# ప్రపంచవినోదకథలు

(రసభావ చరిత్రములు)

BY

బి. టి. నరసింహాచార్యులు







PUBLISHED BY

ప్రొప్రైటర్
వాసన్ పుస్తకశాల,
౧కశాల వీధి, మదరాస్.

వెల రు. ౧

# ప్రపంచవినోదకథలు

( [illegible]

Prapancha Vinoda Kathalu.

BY

బి. టి. నరసింహాచార్యులు.

B. T Narasimhacharyulu



PUBLISHED BY

శ్రీ [illegible]

[illegible] పుస్తకశాల,

244, బంకశాల వీధి, మదరాసు.

౧౯౩౧ వెల రూ. ౧

# తొలిపలుకు

ఇప్పటి దేశకాలపరిస్థితుల ననుసరించి శ్రీయుత బి. టి. నరసింహాచార్యులవారిచే రచింపఁబడిన "ప్రపంచవినోద కథ" లనెడి ఈగ్రంథము పాఠకమహాశయుల చిత్తముల నెంతయు నాకర్షింపఁదగియున్నది. ప్రపంచములో సహజముగా జరుగు చుండు విషయములనాధారపఱచి తద్వారా చక్కని నీతులను బోధించుటకై రసభావ భరితమగు వాడుకభాషాశైలితో నీగ్రంథము వ్రాయబడియుండుటచేత నిందలి కథాంశములు కన్నుల గప్పినట్లు గోచరించుచున్నవి. కాబట్టి యీకథలను సాంతముగా చదివితీరవలయునను నాస దీనిని చదువనారంభించునపుడే ప్రతివారికిని జనించక తప్పదు. హృదయంగమములు, నీతిదాయకములుగా నుండున ట్టికథలను జోడించి వ్రాయఁబడుటచేత నీగ్రంథము దేశసేవకనుకూలింపగలదనియే మానమ్మకము. ఇందు వర్ణితములగు కథలవలె నింకను ప్రశంసార్హములగు కథలు దాదాపు యిరువది ముప్పది అచ్చుకు సిద్ధముగా నున్నవి. ఇప్పటికే యీగ్రంథము గొప్పదైనందున వాటినిందుజేర్చక రెండవభాగమున జేర్చి వెలువరించ నెంచి యున్నారము. ముద్రణావసరమున దొరలిన స్ఖాలిత్యములను పునర్ముద్రణమున సవరించెదము.

సంపాదకులు.

# విషయసూచిక

క్రొత్త పంథాను బహూకృతి.

భగవంతుడందరినీ ఒకే రీతిగ చూస్తాడంటారు గదా మరి చూడండి ప్రపంచంలో అల్పులకి ఐశ్వర్యం, ఉత్తములకు పేదరికంగా ఉంది. మరి ఈసందర్భంలో భగవంతుడు పక్షపాతం గలిగినవాడని అంటామా, అనమా? అలా అంటే యావన్మందికి కోపం వొస్తుంది. పోనీ తెలియకుండా ఏ శాస్త్రుల గారినో అడిగితే ఆయన కస్సు బుస్సు అంటూ, కళ్లుపోతా యంటాడు. ఒకవేళ అడిగిన వేళావిశేషం మంచిదవుతే, అదంతా వాళ్ల వాళ్ల పూర్వజన్మ సుకృత దుష్కృతాల ఫలితం అంటారు. అప్పుడు పూర్వ జన్మ అంటే ఏమిటి? జన్మకారకుడెవడు? కర్మాధికారి యెవడు? యీలాంటి ప్రశ్నలడిగితే పంచాంగం కట్ట తిరగేసి, అదేపనిగా, అక్కడనుంచి తిరిగిచూడకుండా పారిపోయేదాకా కొట్టుతూ ఉంటాడు. కాని తీగ కదిలితే డొంక కదుల్తుంది అన్న సామెత ప్రకారం ఆప్రశ్న వలన అనంతమైన వేదాంతం అంతా కదుల్తుంది. అప్పుడు మనం ఆ వేదాంతంలో పడ్డామంటె కథ కంచికి వెళ్లుతుంది.

కాని యీసందర్భంలో ఒక్క వాక్యంచెప్పి తర్వాత కథారంగంలోనికి దిగుదాము. భగవంతుడు సృష్టిలో పిపీలి కాది బ్రహ్మ పర్యంతం సుఖ దుఃఖాల్ని, కష్ట సుఖాల్ని రెంటి ని సమానంగా ఇచ్చినాడు. కాని కొందఱు మనో దౌర్బ ల్యముగల మూఢులు, తమకు కష్టాలు వచ్చినపుడు దానిని సహింపలేక, తాత్కాలిక తుచ్ఛ సౌఖ్యాలకోసరం, విషయలం పటులై, ఇంద్రియ ప్రేరేపణకి వివశులై, యనేక యవి నీతి కర విధానాల్ని అనుభవిస్తారు. కాని అట్టి ఐశ్వర్యము గాజుమేడ వంటిది. ఇక ప్రాజ్ఞులు కష్టాలలో ఉన్నవాటిని అన్నిటినీ సహనముతో అనుభవిస్తూ, ఋజుమార్గాన్ని అను సరించి చివరికి భగవంతుని మెప్పునుపొంది శాశ్వత సౌఖ్యైశ్వ ర్యాల్ని పొందుతారు. ఇదియే వేదాంతంలోని ముఖ్య పరమ రహస్యం.

*　　*　　*　　*

పాపం రామా నాయుడుగారు కీర్తిశేషులయ్యారు. అదృష్టవంతురాలు లక్ష్మమ్మ సుమంగలిగానే పరమపదించింది. వీళ్లిద్దటికి ముగ్గురు కొడుకులు. ఒకరి తర్వాత ఒకరు, పెద్ద వాళ్లిద్దఱు తల్లి తండ్రుల్ని అనుసరించారు. చూసుకోండి, మంచి గౌరవ మర్యాదలుగల రామానాయుడిగారి కుటుం బాన్ని భగవంతుడెలా ధ్వంసం చేశాడో. కాని ఆఖరికి దయ

తలచి మూడవ ఆతనైన నరసింహారావు నాయుణ్ణి భూమిపైన మిగిల్చాడు. ఇప్పటికి రామానాయుడిగారి సుగుణాలని ఆ వూళ్లో ఉండేవాళ్లంతా కీర్తిస్తూనే వుండేవారు. రామానాయుడు మంచి దాత అవడంవల్ల, తన కొడుకులి కుండాలెననేటటువంటి వివక్షత లేకుండా, తన స్వార్జితపు ఆస్తినంతా దానధర్మాలక్రింద వ్యయపరచి ఆఖరికి చనిపోయేటప్పుడు "నాయనలారా! నేనింత సంపాదించిగూడా మీకేమి యివ్వకుండా పోతూన్నందుకు నాపైన ఆగ్రహించకండి. నాతండ్రి కూడ తన స్వయంశక్తివల్ల విశేష ధనం ఆర్జించి అంతా దానధర్మాల క్రింద వ్యయ పరిచేశాడు. ఎవరైనా ఆయనను "ఏమండీ వెనక ముందు లేకుండా, మీకుర్రవాడి సంగతిగూడా ఆలోచించకుండా యిలా యింత డబ్బును మంచినీళ్లలాగ ఖర్చుపెట్టేస్తున్నారా? మీకొడుకు పెద్దవాడైన తర్వాత మిమ్మల్ని ఎంత దూషిస్తాడోగదా" అని అంటే ఆయన చిరునవ్వుతో వాళ్లని సమాధానంగా "అయ్యలారా! మీరు పొరబడుచున్నారు. నాతండ్రి పోయినప్పుడు నాకేమియు లేదు. నన్నును నాతల్లిని నిరాధారపు పక్షుల్ని చేసిపోయాడు. ఇది అంతా నా స్వయంశక్తి పైననే ఆర్జించాను. కాబట్టి దానిని సద్వినియోగం చేస్తున్నాను. నాకొడుకు ప్రయోజకుడైనచో వాడే సంపాదించుకొన గలడు" అనిచెప్పేవారు. ఆరీతిగానే

నేను మీకు కూడా చెప్పుతున్నాను. నా స్వయంశక్తివల్ల సంపాదించిన డబ్బును బీదవాళ్లని పోషించడం క్రింద వెచ్చించాను. అట్టిది సద్వినియోగం. అట్టి కార్యమే భగవంతుడికికూడా ప్రీతికరం. కాబట్టి మీరుకూడా భగవంతుడిచ్చిన అవయములతో సక్రమ మార్గమున కష్టపడి ధనంగడించి, ప్రయోజకులై, బీదవాళ్లకి దానధర్మాలుచేస్తూ మన వంశం పారంపర్యంగా ఉండే గౌరవ మర్యాదల్ని కాపాడాలి. ఇదే నా అంత్యకోరిక" అని చెప్పాడు. అటువంటి ధర్మదాత అయిన రామా నాయుడిగారి కుటుంబాల్ని భగవంతుడు నాశన మొనర్చి, ఆఖరికి నరసింహారావు నాయుణ్ణి యొక్కడిని మాత్రం దిక్కులేని పక్షిగా భూమిమీద ఉంచాడు. అప్పుడు ఒక చెంప కొడితే పాలు, ఒక చెంప కొడితే నీరు కారేటటువంటి లేతవయస్సులో ఉన్నాడు నరసింహారావు. అటువంటి చిన్నవయసులో, రెండు సంవత్సరాలలోనే తుపాకీతో కాల్చబడినట్టుగా ఒకటి, రెండు, మూడు, నాలుగు చావుల్ని చూసేటప్పటికి అతడేలాటి స్థితిలో ఉంటాడో మీరే ఆలోచించుకోండి. అతనికి దిగులు నానాటికి హెచ్చిపోయింది. అప్పటికి అతనికి పన్నెండేళ్లు, ఆవూళ్లో రామా నాయుడిగారికి బంధువు లెవరూ లేకపోయినా అంతా ఆప్తులే గనుక దిక్కులేని నరసింహారావును సాదరంగా చూసి సహాయంచేస్తూ,

ఆతని దుఃఖాన్ని మరిపించడానికి అనేక తరహాల ప్రయత్నించారు కాని నరసింహారావు దుఃఖం నానాటికి హెచ్చిపోయింది. క్షీణ చంద్రుడిలాగ శుష్కించి పోతున్నాడు. అందరూ అతణ్ణిచూసి జాలిపడేవాళ్లే కాని ఏంచేస్తారు? అతని హృదయంలో ఎంత అల్లకల్లోలంగా వుందో ఎవరికీ తెలీదు. అతడు కుర్రవాడైనను, మంచి తెలివి తేటలుగల వాడవడం చేత ఎవరికి తనలోవుండే దుఃఖాన్ని కనబరచక, ఒంటరిగా పోయి, రహస్యంగా కుమిలి కుమిలి, యేడ్చేవాడు.

ఒక రోజు ఒంటరిగా సాయంకాలం ఊరు బయట చెరువుగట్టుమీద కూర్చున్నాడు. ఆకాశం అంతా నిర్మలంగానే ఉంది. సగము చంద్రుడు మంచివెన్నెలనే యిస్తున్నాడు. ఆనిర్మలాకాశం వొంక, ఆ సగం చంద్రుడివొంక నరసింహారావు వెఱ్ఱి కళ్లతో రెప్పవాల్చకుండా చూస్తూ ఆ చెరువుగట్టుమీద పడుకొన్నాడు. అప్పటికి, ఏడైంది; ఎనిమిదైంది; తొమ్మిది గంటలుకూడా అవస్తోంది. కాని యింకా నరసింహారావు ఆవెఱ్ఱి చూపుల్ని మానలేదు. అప్పటికి తొమ్మిదిగంటలు దాటి ఉండొచ్చు. ఆ ఆకాశంలో అక్కడక్కడ కొన్ని నల్లని చిరుమబ్బులు బయలుదేరి ఆచంద్రుడికేసి వస్తున్నాయి. గాలిదేవుడుగూడా వానిని చంద్రుడి దగ్గిరకి రాకుండా వెనక్కి నెట్టేస్తున్నాడు. కాని ఉన్నటులుండి

తటాలున యెక్కడనుంచో, ఆకాశంలో ఒక పెద్ద నల్లని కాఱుమబ్బు, రివ్వు రివ్వుమని వచ్చింది. దానిని చూసేటప్ప టికి నరసింహారావుకి దుఃఖం, కోపం జాస్తి అయిన్నై. "ఒ క్కసారి రివ్వుమని గాలివొచ్చి ఆ భూతంలాగవుండే కొౝటివి మేఘాన్ని పారదోలరాదూ?" అని గాలిదేవుణ్ణి అనేక విధా లుగ వేడుకొన్నాడు. అప్పుడు గాలిగూడా జోరుగానేవుంది గాని దానికంటె మబ్బుయొక్క తీవ్రత జాస్తి అయింది. అంతలో వొక్కసారి చంద్రుడిని మింగింది. అప్పుడు నర సింహారావు హృదయం దుఃఖావృతమైంది. ఉఱుములు, మెఱు పులు భయంకరంగా ఉన్నై. కాని నరసింహారావు అంతా సహించి అక్కడనుంచి కదలలేదు. ఇంతలో జోరున వర్షం కురిసింది. ఆవర్షంలో నరసింహారా వెక్కడికో మాయ మయ్యాడు.

* * * *

బందరులో రామమోహనరావు నాయుడిగారిని తెలి యని వారు లేరు. ఆయన మంచి రాబడి, పలుకుబడి గల సుప్రసిద్ధన్యాయవాది. అంతే గాకుండా మంచి ఆస్తిపరుడు గూడాను. ఆయనకు తోడు ఆయన భార్య ఇందుమతీ దేవిగారు మంచి ఇల్లాలు. వారిరువురు మంచి ధర్మదాత లు. రామమోహనరావుగారికి సంఘ సంస్కారం అంటే

చాలా ఇష్టం. ఇందుమతీదేవి కూడా కొంతవఱకు చదువు కొన్న దవటంవల్ల ఆమనమనోభావ వైఖరుల్ని బాగుగ గుర్తించి, తదానుగుణ్యాంగా ప్రవర్తిస్తూ వుండేది. రామ మోహనరావుగారి సహాయం పొందని బీద విద్యార్థులు, విద్యా సంస్థలు బందరులో లేవనియే చెప్పవచ్చును. ఆయన సహాయం చేత ఉన్నత పరీక్షలకు చదువుకొని, కృతార్థులై, కృతజ్ఞులైన బీద విద్యార్థులెందఱో ఉన్నారు. వాళ్లందఱు రామమొహనరావు నాయుడిగారిని గుఱించి అనేక విధాలుగ పొగడ్తూ ఉంటారు.

ఆనాడాది వారం సెలవుదినం. రామమోహనరావు నాయుడుగారు తన భార్యతో సరసాలాడ్తూ ఉన్నారు, అప్పు డు మధ్యాహ్నం పంౘ్రెండు గంటలు దాటింది. అలా వారు మాటల ధోరణిలో ఉండగా, వారి ఒక్కర్తెయే కొమార్తె యగు పుష్పవల్లి, గబ గబ పరుగెత్తివచ్చి



"నాన్నా నాన్నా, పాపం, ఎవరో అబ్బా యి, జాడేస్తోంది; చినిగి పోయిన గుడ్డలతో, మన యింటి వాకిటి ముందు నిలబడి, 'ఆకలి, కొంచెం అన్నం పెట్టండి' అని

అడుగుతున్నాడు. నాన్నా, కొంచెం అమ్మని అన్నం పెట్ట మనవు?"

"అలాగేనమ్మా,"

అని తన భార్యను అన్నం తీసుకువెళ్లి పెట్టమన్నాడు. వెంటనే ఇందుమతీదేవి ఒక విస్తరిలో అన్నం, పప్పు, కూరవేసి, పట్టుకొని వాకిట్లోకి వెళ్లింది.

"అబ్బాయీ, అన్నం పట్టుకు వెళ్తావా? ఇక్కడ తింటావా?"

ఆకుర్రవాడు తలకాయ వొంచుకొని మాట్లాడకుండా నిలుచున్నాడు. ఇందుమతీదేవికి ఆశ్చర్యం వేసింది, ఆకుర్ర వాణ్ణి చూసేటప్పటికి. ఆకుర్రవాడు అలామాసిపోయి, చిరిగిపోయిన గుడ్డలలో వున్న, ఆతని శరీరచ్ఛాయ పసిమివర్ణం నిగనిగలాడ్తూ ఉంది. ఇందుమతీదేవి ఆకుర్రవాడు పూర్వం భాగ్యవంతుల బిడ్డయై, ఇప్పుడు కాలవ్యత్యాసం వల్ల యీ రీతిగ మారిపోయి యుండవచ్చునని జాలిపడింది. ఆతణ్ణి గురించి తెలిసికోవాలెనని అభిలాష గలిగింది. వాకిటి గుమ్మందాటి ఆ అబ్బాయి దగ్గరకి వెళ్లింది. ఆమె వెనకాల పుష్పంవొచ్చి నిలబడి, ఆ అబ్బాయి వొంకచూసి, జాలిపస్తు న్నట్టుగా తనతల్లితో "అమ్మా, పాపం, ఆ అబ్బాయి యేడుస్తు న్నాడే" అని అంది.

ఆమాట వినగానే ఆకుర్రవాడు వొక్కసారి తలపైకెత్తాడు. ఆతని విశాల నేత్రాలలో నుంచి అశ్రుకణాలు సంతతధారగా కార్తున్నై. ఆతనిచెక్కిళ్ళపైన అంతా కన్నీటి జాడలుగూడా పడ్డాయి. అతని కళ్లు ముందు పుష్పం మీదకెళ్లాయి. అప్పుడు పుష్పం, చాలా జాలిగా "అమ్మా, ఆ అబ్బాయికి మన యింట్లోనే అన్నం పెటవే" అని తల్లితో చెప్పింది. ఆమాటకి ఆ కుర్రవాడి ముఖం కొంచెం వికసించింది. అప్పుడు అన్నం పట్టుకువచ్చిన ఇందుమతీదేవిని చూశాడు. ఆకుర్రవాడి ముఖం చూసేటప్పటికి, ఇందుమతీదేవికి అపరిమితమైన జాలివేసింది.

"అబ్బాయీ, ఫరవాలేదు. లోపలికిరా. శుభ్రంగా కడుపునిండా అన్నం తిని వెళ్లుదావుగాని." అని అంది. తల్లి చాటుననుండి పుష్పం రమ్మనమని చెయ్యి వూపింది. అప్పుడు మెల్లగా వాళ్లతోగూడా యింట్లోకి వెళ్లాడు. ఆ కుర్రవాడికి ఇందుమతీదేవి, యింట్లో ఒకచోట శుభ్రముచేసి అక్కడ విస్తరవేసి, ఆతనికి కావలసిన పదార్థాల నన్నిటినీ వేసి, భోజనం చేయమంది. అప్పుడాకుర్రవాడు ఇందుమతీదేవి వొంకతన కృతజ్ఞతను తెలియజేస్తూ చూశాడు. ఆచూపుల లోని అర్థగాంభీర్యాల్ని సౌకుమార్యాన్ని చూసి, ఇందుమతీదేవి, లోలోన మెచ్చుకొని "భోజనం చెయ్యి, ఏంకావాలిస్తే

అది అడుగు. సిగ్గుపడకు." అని భర్త దగ్గిరకి వెళ్లింది. పుష్పం ఆతని కెదురుగుండా కూర్చుని, వాచిపోయిన కళ్లతో చూస్తోంది. ఆపిల్లవాడు తలకాయ ఒంచుకొని భోజనం చేయడం ప్రారంభించాడు. అప్పుడు పుష్పం నవ్వుతూ—

"అబ్బాయీ, నెయ్యి కావాలా?" అని అడిగింది. దానికాతడు తలకాయ యెత్తి, పుష్పం ఒంక చూశాడు. పుష్పం నవ్వింది, తాను నవ్వాడు. అప్పుడు పుష్పాని కెక్కడ లేని సంతోషం ఒచ్చింది. వెంటనే గబగబ లోపలికిపోయి నేతిగిన్నెను తీసుకొనివచ్చి, ఒద్దువొద్దంటుండగా నెయ్యిని పోసి తినమని చెప్పింది. అప్పుడు మెల్లగా భోజనం చేయడం ప్రారంభించాడు. పుష్పం యేవేవో ఆటల కబుర్లన్నీ గుక్క తిరగకుండా చెప్పింది. ఆతడుగూడా, తలకాయ వూపుతూ, ఆపిల్లకేసి చూస్తూ, ఊఁ కొట్టుతూ భోజనం చేస్తున్నాడు. అలా మాట్లాడుకొంటూ ఉన్నప్పుడు, ఆ కుర్రవాడు ఆపిల్లను చూసి "నీపేరేవిటి?" అని అడిగాడు. మొదట చెప్పడానికి సిగ్గుపడిందిగాని చివరకు బలవంతంమీాద "పుష్పవల్లి" అని చెప్పి, ఆతని పేరడిగింది. "నరసింహా రావు" అని చెప్పాడు.

వాళ్ల యిద్దఱి సంభాషణ ఇందుమతీదేవి రామమోహనరావుగార్లు గది తలుపున చాటుననుండి వింటున్నారు.

"చూశారా, ఆకుర్రవాడెంత అందంగా ఉన్నాడో. నేను అన్నం పట్టుకొని వెళ్లి అడిగితే తలకాయ వొంచుకొని యేడవడం ప్రారంభించాడు. అప్పుడు మన పుష్పం అతని మీద జాలి కనబఱచి ఆ అబ్బాయి యేడుస్తున్నాడు' అనే టప్పటికి అతడు ముఖం యెత్తాడు. నిజంగా చంద్రబింబం లాగుంది అతని ముఖం. అతని ముఖవర్చస్సు చూపగా ఎవరో గొప్ప యింటివాళ్ల బిడ్డడై, కాలగతి చేత యిలా వొచ్చి ఉండొచ్చు ననుకుంటా"

"నిజమే, నువ్వు చెప్పినట్టుగా ఆకుర్రవాడు. ఆతని ముఖలక్షణాలు చూస్తే మంచి తెలివి తేటలుగల కుర్రవాడి లాగ కనుపిస్తున్నాడు. అతనికి చదువు చెప్పిస్తే చాలా గొప్పవాడవుతాడని నాకు తోస్తుంది." "నాకు అలాగే తోస్తోంది. మనకి మగ సంతానంకూడా లేదుగదా. ఈ పిల్లవాణ్ణి దగ్గిరకి తీసి, విద్యాబుద్ధులు గరపిస్తే, ప్రయోజకుడైతే మన పుష్పాన్నే అతనికిచ్చి పెళ్లిచెయ్యవొచ్చు."

"అదంతా సరి. కాని మున్ముందు ఆతడెవడో అతని కథ ఏవిటో కనుక్కోవాలి."

"అలాగే కనుక్కోండి. కాని అదుగో చూడండి. మన పుష్పం ఆ అబ్బాయీ యేలా మాట్లాడుకొంటున్నారో భగవంతుడు సరిగాచూస్తే వీళ్లిద్దరికీ యీడు జోడు బాగా కుదిగందిసుమండీ."



ఇలా మాట్లాడుకొన్నారు. తర్వాత ఆకుర్రవాడి భోజనం అయింది. పుష్పం ఆతనికి నీళ్లిచ్చింది. అప్పుడు తల్లి తండ్రులు "ఆహా, ఏడేళ్లపిల్ల పుష్పం, అప్పుడే యెంతటి తెలివి చూపిస్తోందో చూశావా" అని వొకళ్ల కొకళ్లు ఆశ్చర్యపడ్డారు.

ఇంతలో, ఆకుర్రవాడు, కృతజ్ఞత తెలియజేసే చూపుల్తో ఆదంపతుల్ని సమీపించి సాష్టాంగ నమస్కారంచేసి, "సెలవుపుచ్చుకుంటా" అన్నాడు. అప్పుడు రామమోహనరావునాయుడు గారికి చాలా జాలివేసింది. ఆతనిముఖం చూసేటప్పటికి ఎక్కడో తనకి పరిచయం ఉన్నవాళ్ల పోలికలు కనబడ్డాయి.

"అబ్బాయీ, నువ్వెక్కడికెళ్తావ్ ?"

ఈ ప్రశ్నకి మళ్లీ ఆకుర్రవాని కళ్లల్లో నీళ్లు తిరిగాయి. కాని బలవంతాన "ఏమో, నాకే తెలీదు" అని అన్నాడు అప్పుడు రామమోహన రావునాయుడతనిని ఒక కుర్చీలో కూచో మన్నాడు. మొదట తన ఉడుపుల్ని చూసి, కుర్చీమీద కూచోడానికి సంశయించాడు కాని, ఆయన అతనిని రెక్క పట్టుకొని మెల్లిగా కూచోబెట్టాడు.

"నీ పేరేవిటి?"

"నరసింహారావు"

"మీ రెవరు?"

"నాయుళ్లం"

ఈ మాటకి ఇందుమతీదేవి ముఖం ఇంత అయింది. అప్పుడు మళ్లీ రామమోహన రావు నాయుడుగారు ఆకుర్ర వాణ్ణి ఉద్దేశించి "నీతండ్రి పేరేవిటి" అని అడిగారు. అప్పు డాతడు ఒణుకుతోన్న కంఠ స్వరంతో, ఉబికివొచ్చే దుఃఖా న్ని ఆపుకొంటూ "రామానాయుడుగారు" అని చెప్పాడు "ఏవిటీ, రామానాయుడా! నువ్వు రామానాయుడి కొడు కువా!" అంటూ తెల్లబోయారు. నరసింహారావు బావురు మని యేడ్చాడు. రామమోహన రావునాయుడి గారికి కళ్ల వెంబడి నీళ్లు గిర్రున తిరిగాయి. అమాంతంగా నరసింహారావుని కావులించుకొన్నారు. ఇందుమతీదేవి ఆశ్చర్యంతో అలాగే

నిలబడి పోయింది. పుష్పవల్లి కండ్లవెంబడి నీళ్లుకారుస్తూ తల్లిని కావులించుకొంది.

తర్వాత కొంతసేపటికి, రామమోహన రావునాయుడు గారు తన భార్యతో ఆ నరసింహారావు తండ్రి (చనిపోయిన రామా నాయుడు) తనకు బంధువనియు, అతడు తాను చిన్నప్పు డొకే స్కూలులో చదువుకొంటిమనియు, ప్రాణ స్నేహితుల మనియు మొదలైన విషయాలన్నీ చెప్పాడు. అప్పుడు నర సింహారావును ఓదార్చి, ఆతనివల్ల ఆతనియొక్క కుటుంబ భగ్న జీవితచరిత్ర అంతా విన్నాడు. అప్పుడు ఇందుమతీ దేవిగూడ దుఃఖించింది. అదివిని పుష్పవల్లి తనకొక స్నేహి తుడు దొరికాడుగదా అని ఆనందించింది. అప్పుడు రామ మోహన రావునాయుడుగారు నరసింహారావుయొక్క చినిగిన ఉడుపుల్ని విడిపించి, క్రొత్తవుడుపుల్ని ఇచ్చాడు. ఇందు మతీదేవి ఆతణ్ణి శుభ్రంగా స్నానం చేయించింది. అప్పు డతడు నిజంగా కళంకంలేని చంద్ర బింబంలాగ వెలిగిపోయాడు. అప్పుడాతని చక్కదనాన్ని చూసి ఇందుమతీదేవి సంతోషా శ్చర్యాలుపడింది. రామమోహనరావు నాయుడుగారు సిగ్గు పడుతున్న నరసింహారావును తన తొడపైన కూర్చుండబెట్టు కొని నరసింహారావూ నువ్వు ఇక్కణ్ణుంచి మాయింట్లోనే ఉండి చదువుకోవాలె సుమా! రేపటిరోజున నిన్ను స్కూలు

లో ప్రవేశ పెట్టుతాను” అని ఆతణ్ణి ముద్దుపెట్టుకొన్నాడు. నరసింహారావు ఆనందంలో విలీనమైపోయాడు.

*　　　*　　　*　　　*

రామమోహన రావు నాయుడుగారి దయవలన, ఇందుమతీ దేవిగారి చేతిచలువవల్ల నరసింహారావు నాయుడు, శుక్ల పక్ష చంద్రుడిలాగ దిన దిన ప్రవర్ధమానుడై, స్కూలు ఫైనలు పరీక్ష ప్యాసయినాడు. ఇరువదేండ్ల వయస్సులో, నిన్ను చూడు, నన్ను చూడన్నట్టుగావుంది. అతని అవయవముల సొంపు చాలా పొందికగా అమరివుంది. అందరు అతనిరూపానికి చాలా మెచ్చుకొన్నారు. ఒక్క క్లాసుగూడా తప్పకుండా స్కూలు ఫైనలు ప్యాసయ్యాడు. రామమోహన రావునాయుడు, ఇందుమతి దేవిగారు అమితానందం పొందారు. ఆతడుగూడ వారి చెప్పుచేతులలో మెలగుతూ భక్తివిశ్వాసాల్తో ఉంటున్నాడు. అతని సౌందర్యానికి ఆతసిసుగుణాలు మఱెంత వన్నెబెట్టాయి.

ఇక పుష్పవల్లియొక్క షోడశకళా ప్రపూర్ణ యౌవన సౌభాగ్యము వర్ణనాతీతంగావుంది. తుమ్మెద రెక్కలలాగుండే కనుల సౌభాగ్యం, తామర పువ్వులాగుండే విశాల నేత్రాలు, పువ్వుతీగలాగుండే తనువు, బంగారు వర్ణంగలిగిన

శరీర లావణ్యం, ఇవి అన్నీ చూస్తే ఎంతటి వాడైనను ముగ్ధుడై పోయేట్టుగావుంది పుష్పవల్లి.

పుష్పవల్లికిప్పుడు పదిహేనేండ్ల వయస్సు. ఇదివరకు లాగ తన తల్లి దండ్రులు నరసింహారావు దగ్గిఱ కూర్చోనివ్వడంలేదు. ఆతనితో మాట్లాడ నివ్వడంలేదు. ఆఖరాఖరికి అతణ్ణి చూడడంగా దుర్లభమైపోతోంది. చంద్రదర్శనార్థంచకోర దంపతులేలా పరితపిస్తాయో, నరసింహారావు దర్శనానికి పుష్పవల్లి ఆలాపరితపించి పోతోంది. రాత్రింబగళ్లు ఆతణ్ణి గుఱించి కలవరించి పోయింది. ఊరికే తాపం ఎత్తినదాని లాగ కొట్టుకొంటూంది. ఒక్కొక్కసారి దీర్ఘాలోచనలో మునిగి పరాకు చిత్తగించేది. ఒక్కొక్కసారి తన తల్లిదండ్రుల్ని మనస్సులో తిట్టుకునేది. తన తండ్రి ఇంత సంఘసంస్కర్తయైయుండి విశాల హృదయం కలిగినవాడైయుండి, తాను చిన్నప్పటినుంచి నరసింహారావును ప్రేమిస్తూన్న సంగతి తెలిసిగూడా, తన ప్రేమమూర్తి సందర్శనాన్ని తనకు కలుగనీయక పోవడం అంతదారుణం ఇంకోటిలేదు. ఒక్కసారి తనను వేఱొకనికిచ్చి ఒకవేళ వివాహం చేయడానికి ప్రయత్నిస్తున్నాడేమో అన్న అనుమానం ఆపిల్లలో ఉదయించేటప్పటికి, ఆపిల్ల నిలువున నీరైపోయి, మూర్ఛబోయింది.

ఇంతకంటె యెక్కువ పరితాపాన్ని పొందుతున్నాడు నరసింహారావు. అంతకాలంనుంచి, అన్యోన్యంగా మెలగిన పుష్పవల్లియొక్క ముఖార విందాన్ని తనకళ్లకే కరవుచేసిన రామమోహన రావు ఇందుమతీదేవిగార్ల యభిప్రాయానికి చాలా పరితపించాడు. ఒకవేళ తాను నిర్ధనుడనీ, యెవరి కైనా ధనవంతుడికిచ్చి వివాహంచేస్తే పిల్ల సుఖపడుతుందనీ ఉద్దేశ పడ్డారేమో అనుకొని విచారపడ్డాడు. అనేక వేడి నిట్టూర్పులు పుచ్చాడు. కాని ఆఖరికి ఒకరోజున తెగించి ఆపలేక, తనయొక్క ప్రేమాత్కృష్టాన్నంతటిని తెలియ జేస్తూ, ఒక ప్రేమలేఖను వ్రాసి, ఒంటరిగా గదిలోవున్న పుష్పవల్లికి, కిటికిలోనుంచి విసిరాడు. ఆతురతతో పుష్పవల్లి ఆలేఖను తీసి చదువుకొంటూంది. అప్పుడు దురదృష్టవ శాత్తు రామమోహనరావు నాయుడుగారా గదిలోకివొచ్చి, తన కూతురు చదువుతూన్న లేఖనుచూసి కోపంతో నిర్విణ్ణుడై పోయాడు. ఆయన నీడనుచూసి, పుష్పవల్లి చప్పున తన లేఖనుమడిచి, వక్షమున భద్రముగ దాచుకొని, తత్తరపాటు తో వెనక్కి తిరిగిచూసి, భయకంపితయైపోయి నిలబడింది. ఎన్నడూ తన తండ్రి తనపైన అలా ఆగ్రహాన్ని చూపలేదు.

"పుష్పం! నీ చేతిలో ఆకాగితం ఏవిటి?" పుష్పవల్లి పలుకలేదు. మళ్లీ కొంచెం కోపంతో గద్దిస్తూ అడిగేటప్ప

టికి, భయపడ్తూ పుష్పవల్లి ఆలేఖని తనతండ్రిచేతిలో పెట్టింది. రామమోహనరావు నాయుడుగారా లేఖనుచూసి, ఆగ్రహంతో నరసింహారావును ఆగదిలోకి రమ్మన్నాడు. నరసింహారావు అపరిమితమైన భయంతో జారిపోయిన గుండెని చేతపట్టుకొని మెల్లగా ఆగదిలోనివెళ్లి, పుష్పవల్లియొక్క వివర్ణముఖం, రామమోహనరావు నాయుడిగారి కోపముఖం, ఆయనచేతిలో వుండే లేఖనిచూసి, లజ్జా విషాదాల్తోటి తలకాయ వొంచుకొన్నాడు.



"ఈ ఉత్తరం నువ్వు రాసిందేనా ?"

"ఔ...ను"

"ఇంత ద్రోహివవు తావని నేననుకోలేదు" అంటూ రామమోహనరావు నాయుడుగారు వాళ్లిద్దఱివొంక ఒక్కసారి ఉరిమిచూసి విసవిస గదివొదలి వెళ్లిపోయాడు. వాళ్లిద్దఱు అలాగే కుంగిపోయారు.

* * *

అప్పటినుంచి నరసింహారావు, పుష్పవల్లి మొగాల్లో నెత్తురుచుక్కలేదు. ఇద్దఱూ గంపెడంత విచారంతో శుష్కించిపోతూన్నారు. వీళ్లిద్దఱియొక్క శుష్కవదనాల్ని చూసి

కూడా ఏమని రామమోహనరావు నాయుడుగారుగాని, ఇందుమతీదేవిగాని అడగలేదు.

ఇంతలో మూల్గే నక్కమీద తాటికాయ పడ్డట్టుగ పుష్పవల్లి వివాహ ప్రయత్నాలు సాగించారు. వరునికోసరం రామమోహన రావుగారు వెదకడం ప్రారంభించారు. అది వినేటప్పటికి నరసింహారావు యొక్క దుఃఖం కలియత్రిప్పడం ఆతనికి తన జీవితంమీద విరక్తి పుట్టింది. సరియైనబట్ట కడుపునిండ భోజనం, కంటినిద్ర మానేశాడు. తానెప్పుడు ఒంటరిగ కూర్చొని దీర్ఘాలోచన చేయడం ఏమేమో పిచ్చివాడిలాగ తనలో తానే మాట్లాడుకోవడం ప్రారంభించాడు. ఈసంగతంతా ఆవృద్ధ దంపతులిద్దఱు కనిపెట్టుతూనే ఉన్నారుగాని యేమని అతనిని ప్రశ్నించలేదు. తమ కూతురివివాహ ప్రయత్నాల్ని మాత్రం మానలేదు. తానానాడు పుష్పవల్లికి అలా సాహసించి ఉత్తరం రాయడమే వారికంతటి కోపకారణం అయింది అనుకొన్నాడు.

ఇక పుష్పవల్లి విచారం చెప్పనక్కరలేదు. అది శ్రుతిమించి రాగాన్ని పడింది. సిగ్గువిడిచి తల్లిదండ్రుల యెదుటనే వెక్కి వెక్కి యేడుస్తూ తాను నరసింరావును తప్ప యింకోర్ని పెళ్లి చేసుకోనని చెప్పింది. కాని తండ్రి గదమాయించాడు. తల్లి కసురుకుంది. ఇంకేం చేస్తుంది?

రేపు నూతన సంవత్సరాది పండుగ అనగా పుష్పవల్లిని పెళ్ళికూతుర్ని చేయడానికి తలి దండ్రులు ప్రయత్నించారు. కాని పుష్పవల్లి ఒప్పలేదు. తలి దండ్రులనేక విధాలుగా నయాన భయాన చెప్పారు కాని వినలేదు. ఆఖరికి రామ మోహన రావునాయుడుగారు తనకూతుర్ని చూసి పళ్లుకొఱుకు కుంటూ "ఇవాళ కాకపోయినా రేపు నువ్వు తప్పక పెళ్లి కూతురు కావాలి" అని చెప్పారు. ఆమాట పుష్పవల్లికి పిడుగులాగైంది. తన తల్లిని కాళ్లావేళ్లాపడి బతిమాలింది. కాని నిష్ప్రయోజనమైంది.

ఈ వార్త నరసింహారావు విన్నాడు. ఆతడు దుఃఖా న్ని పట్టలేక పోయాడు. పుష్పవల్లియు తానును అన్యోన్యంగా ప్రేమించుకొన్నది చూచియు, రామమోహనరావు నాయుడు గారు తనయోగ క్షేమాల్ని కోరి తన్నింతవఱకు పెంచిన వాడయ్యు, విశాల దృష్టిగలవాడయ్యు, ఈ సందర్భంలో తన కును, పుష్పవల్లికి యింత ప్రతికూలంగా సంచరిస్తున్నాడెందుకా యని యాతని మనస్సులో ఊరికే యాందోళన సాగింది. అయిన తాను అందరాని పండుకర్రు జాచినట్లని సిగ్గుపడ్డాడు. కాని తన ప్రేమధనం పుష్పాన్ని ఒదలడం యెట్లా? రేపటి రోజున పుష్పవల్లి యింకోడి పెళ్లాం అవుతే తానక్కడవుండి ఆమాటవిని భరింపగలడా? కాని ఒక సందేహం. పెళ్లికి

జరగవలసిన పనులేమి కాలేదు. ఎవరికి శుభలేఖలు రాయ లేదు. ఒక్కచుట్టమైనా రాలేదు. ఇదంతా చూసేటప్ప టికి అదంతా అయోమయంగా ఉంది.

*　　　*　　　*

నూతన సంవత్సరాది పండుగదినం. బలవంతాన పుష్పవల్లికి తల్లి తలంటిపోసింది. గద్దించి, బెద్దంటూండగా నరసింహారావును తలంటుకొన జేశాడు. నరసింహారావుకు చాలా దుఃఖంగావుంది. ఏంచేస్తాడు? తన్ను దిక్కులేని స్థితిలో ఆదరించి, పెంచి, పెద్దవాణ్ణిచేసిన రామమోహనరావునాయుడి గారికి యెదురాడ సాహసింపడు. సరే, ఏమైనా సరే అను కొని, ధైర్యాన్ని చిక్కబట్టుకొని భగవంతుడిమీద భారం వేశాడు. కాని పదిగంటలకే ముహూర్తమట. ఇంకా పెళ్లి కొడుకుగాని, పెళ్లికొడుకు తరఫు వాళ్లుగాని రాలేదు. ఇదంతా ఆశ్చర్యంగావుంది అతనికి. పుష్పవల్లికిగూడ చాలా వింత గానేవుంది. అయినా చూద్దామనీ తల్లి చెప్పినట్లుగానే శృంగా రించుకొనింది. అప్పుడు ముహూర్తం మించిపోతోందని రామ మోహనరావు నాయుడుగారు తన భార్యను వేగిరపరచాడు. ఇందుమతీదేవి యిటు అటూ విసవిస తిరగడం ప్రారంభించింది. కాని ఏపని చేసినట్లు కనబడదు. రామమోహనరావు నాయుడుగారు సావిట్లో నాలుగు కుర్చీలు మధ్య రెండు

టేబిలు సమకూర్చాడు. "వాళ్ళింకా రాలేదేం?" అని విసుగుకొంటూ పెళ్ళాన్ని అడిగితే, "ఏమో" అంది. వీళ్ళని చూస్తే నరసింహారావు పుష్పవల్లుల ఆశ్చర్యం హెచ్చింది. ఇంతలో ఉన్నటులుండి నాయుడుగారు నరసింహారావును కుర్చీపైన కూచోమన్నాడు. అతడాలాగే చేశాడు. అప్పుడు ఇందుమతీదేవి తమలపాకలు, అరటిపళ్లు, క్రొత్త బట్టలు అన్నిన్ని ఒక పళ్లెంలో పట్టుకొని వచ్చి ఆ టేబిలుపైన పెట్టింది. "ఏదీ, పుష్పాన్ని యిలావొచ్చి కూచోమని నువ్వుగూడా వచ్చి కూచో" అని రామమోహనరావు నాయుడుగారు పెళ్ళాంతో చెప్పారు. ఇందుమతి తనకూతురుతో వొచ్చి యిద్దరుచేరి వొకకుర్చీమీద కూర్చున్నారు. పుష్పవల్లి తల కాయ వొంచుకొని కన్నీళ్లు కారుస్తూ కూచొంది. నరసింహా రావుగూడా ఆలాగే ఉన్నాడు.

అసలు రామమోహనరావు నాయుడుగారు ప్రతి సంవత్సరాదికి నరసింహారావుకి? పుష్పవల్లికీ ప్రజంట్సు యిచ్చే వాడు అప్పుడు ఉన్నటులుండి—

"నరసింహం! ఇదుగో నీమామూలు ప్రజెంటు" అన్నాడు. నరసింహారావు తలకాయయెత్తి ఆశ్చర్యంతో చూశాడు.

“పుష్పం! ఇదుగో నీమామూలు సంవత్సరాది బహుమతి” అని అన్నాడు. పుష్పవల్లి తలకాయ యెత్తింది. అప్పుడొకసారి పకాలున నాయుడుగారు నవ్వారు. ఇందుమతీదేవి నవ్వుతూ తనకూతురు చేతిని నరసింహారావు చేతిలోపెట్టింది. నరసింహారావు పుష్పవల్లులు సిగ్గుచేత నవ్వుతూ తలకాయ వొంచుకున్నారు.



## ౨

### జోశ్యపు పిచ్చి.

తుండేశ్వర సిద్ధాంతి, సూర్యోదయం కాకముందే తటాకానికి బోయి, తలనిండా శుభ్రంగా స్నానం చేసి, శుభ్రంగా తన కావిపంచెల్ని ఉతికి, విభూతి పెండెకట్టుల్ని, సూర్యబింబం అంతకుంఘాన్ని తన విశాలలాటాన ధరించి, తన గోష్పాదం అంత పిలక జుట్టును బాగావిదలించి చివర ముడేసుకొని, తన మకరకుండలాలు రెండు చెవులనుండి కదల్తూంటే, వెండి పొన్ను వేసిన ఛేతికర్రను ఒక చేత బట్టుకొని, వేఱొక చేత ఉతికిన బట్టల్ని పట్టుకొని, మెళ్లో వేసిన రుద్రాక్ష మాలతో, సూర్యుడితోబాటు తన యింటికి జేరుకుంటారు. దారిలో వొస్తూ "శ్రీరామ రామ రామేతి, రమేరామే మనోరమే। సహస్రనామ తత్తుల్యం, రామనామ వరాననే॥" అని రామనామాల్ని జపించుకొంటూ ఒచ్చేవాడు. ఆయన నిష్ఠని చూసి ఆపూళ్లో వాళ్లంతా ఆయన్ని చాలా గౌరవంగా చూసేవాళ్లు.

తర్వాత, ఆయన తెల్లగాతోమిన యిత్తడి చెంబును, పంచాంగం కట్టను బట్టుకొని, "భవతీ భిక్షాందేహి" అని

నాలుగిళ్లకు వెళ్లేటప్పటికి గిర్రుమని చెంబు బియ్యంతోనిండి పొయ్యేది. ఉప్పు మెరపకాయ, విస్తరాకులు, చింతపండు, నెయ్యి యివియవి యనవేల, స్వయంపాకానికి కావలసిన సమస్త పదార్థాలు ఆయన వంటవేళకి తయారవుతాయి. ఆయన అదృష్టం అలావుంది.

ఆయనకి ఏళ్లై పెళ్లింటాయి. మొదటి భార్య చని



పోయినప్పటినుంచి ఆయన యీా వైరాగ్యంలో పడ్డాడు. ఆయనకి అయిదు ఎకరాలు వాళ్ల ఊళ్లో సుక్షేత్రమైన మాగాని పొలం ఉన్నప్పటికీ ఆయన ఆవొచ్చిన ధాన్యాన్ని పాటల్లో వేసేసి, సంచారం బయలుదేరి, స్వయంపాకాలు చేసుకొంటూ, అష్టకష్టాలు పడ్తూ షడ్రసోపేతంగా భోజనం చేశేవాడు. భోజనం చేయగానే తాంబూలం సేవించి, కొంతసేపు గుర్రుపెట్టి విశ్రాంతి తీసుకొనేవాడు. తర్వాత సాయంకాలం మూడు గంటలకి లేచి ఏవంటో కోసుకొని తినేవాడు. అప్పుడు ఎవరో కొందరు ఏజాతకం వ్రాయించుకొనడానికో, ఏగోచారఫలం తెలుసికోడానికో, లేక

ఏ ప్రశ్న అడిగడానికో వాళ్ళ గ్రహచారం చాలకవొచ్చి, తాంబూలంలో, తుండేశ్వర సిద్ధాంతి యిష్టానుసారంగా దక్షిణను సమర్పించుకొని పోతూవుండేవాళ్లు. ఈతీరుగ ఒక్కొక్క వూళ్లో ఒక్కొక్క నెల, బాగా సాగేవూళ్లో రెండు నెలలు మకాం వేస్తూ అలాగ కష్టజీవనం గడుపుతున్నారు తుండేశ్వర సిద్ధాంతిగారు.

పాపం; నిజంగా అలాంటి స్థితిలో ఆ తుండేశ్వర సిద్ధాంతిగారి కొక భార్యమాత్రం ఉండవలసిందే. అలా లేక పోవడం దేవుడియొక్క ఓర్వలేనితనం అనియే చెప్పొచ్చు. ఆయన ప్రథమ భార్య, ఆయనపెట్టే పోరుకు పడలేక, సాక్షాత్ భర్త తన పాలిటి దైవమనే భావంలేక, అంతటి అమాయికపు సిద్ధాంతిని మోసపుచ్చి నూతిలోపడి చచ్చి పోయింది. అప్పటినుంచి పాపం; ఆయనకు విరక్తిపుట్టి దేశాటనం, భిక్షాటనం ప్రారంభించాడు. ఏదో భగవంతుడి దయవల్ల, ఆయనపొట్టకి లోపం లేకుండా ఒక రెండువేల రూపాయలు తన జ్యోతిషంవల్ల సంపాదించాడు. కాని ఆయనకు డబ్బెందుకు? అందులో ఒక దమ్మిడీ నైనా ఆయన ముట్టుకొని యెఱుగడు. దానినంతా ఆలాగే సేవింగ్సు బాంకిలోను, వడ్డీలక్రిందను యిచ్చి వేశేవాడు. ఆయనకెవరెవరో దగ్గిర బంధువులు ఉన్నారుగాని వాళ్లంతా యెం

దుకు ? పడి తెగతింటానికేగాని మఱియేమైనా లాభముం
దా? కాబట్టి ఆయన వాళ్ల ప్రసక్తియే యెత్తడు. ఏదో
ఊరూర తిరిగి భిక్షాటనంవల్ల పొట్ట పోసుకుంటూ, జ్యోతిషం
వల్ల ఏదో నాలుగు డబ్బులు సంపాదించుకొంటూ గొప్ప
జీవనం గడుపుతున్నాడు.

ఆయనకి రెండో పెళ్లి చేసుకొందామని యిష్టం ఉండ
దేమిటి? అప్పుడు చచ్చే ముసలివాణ్ణి "నీకు పెళ్లి కావాలా
తాతా" అంటే బుర్రవూపుతాడు. అటువంటప్పుడు ఈ
సిద్ధాంతిగారు ఏభైయేళ్లపైబడిన నిండు పడుచుదనంలో
రెండో పెళ్లి చేసుకోబోడా తప్పేముంది? అంత అదృష్టం
యే ఆడదానికి పట్టుతుంది? నిజంగా ఆయన లంబోదరం,
తళతళలాడే కృష్ణవర్ణం, లోతుకుపోయినా మిలమిల మెరసే
నేత్రద్వయం, ఆయన నొక్కివేసిన ముఖబింబం, పొడుంచేత
ఎగబెరిగిన ముక్కు, లావుపాటి పెదివెలు, "అధికస్య అధికం
ఫలం" అన్నట్లు ఆయన జంటవరుసల పలువరుస, ఆయనకు
దించివేసిన కాళ్లుచేతులలో దాదాపు నాలుగడుగుల భారి
జవానైన, ఉక్కుతుండువంటి తుండేశ్వర సిద్ధాంతికి సాటి
ఆచుట్టుప్రక్కల ఆయనెతప్ప వేఱెవరైన ఉన్నారా?
ఆయనకు ఆయనేసాటి. ఏదో తన జ్యోతిషం చలువ వల్ల,
ఊరూరా భిక్షాటనం చేసుకొంటూ, ఏలాగోలాగ తన కాలా

న్ని నెట్టివేస్తూ, కృష్ణా, రామా, అనుకొంటున్నాడు ఆబీద తుండేశ్వర సిద్ధాంతి.

లింగయ్య పంతులు నియోగి బ్రాహ్మణుడు. ఇరవై ఐదు ఏళ్లవయస్సు. ఏలాగోలాగ తంటాలుపడి బెజవాడ మునసబు కోర్టులో గుమాస్తానౌకరి చేస్తున్నాడు. ఆపని దొరకడమే చాలా కష్టమైంది. నిజంగా అతని అదృష్టం వల్ల ఆ గుమాస్తానౌకరి దొరికింది. లేకపోతే గవర్నమెంటు జి. ఓ. ప్రకారం నువ్వు బ్రాహ్మణడవు కాబట్టి మా ఆఫీసుల్లో నీకు స్థానంలేదు అని అధికారు లనేవారే. ఎన్నో శిఫార్సులపైన ఆ ఉద్యోగం దొరికింది. మాసమునకు నలభై రూపాయల జీతం. ఆతడు బీదవాడు. స్కూలుఫైనలు ప్యాస్ చేసి ఉన్నాడు. అతనికి మేనమామ కూతుర్నే యిచ్చారు. ఆవిడ కాపరానికి ఒచ్చి మూడు సంవత్సరాలు దాదాపు కావస్తోంది. ఒక మగ శిశువుగూడా కలిగాడు. ఆ ఊళ్లోనే ఒక యింట్లో ఒక భాగంలో నివసిస్తూ ఉన్నాడు.

కాని ఆ లింగయ్య చిన్నప్పుడు చదువుకొంటున్నప్పుడు తాను లక్షాధికారి కావాలెననీ, పెద్ద బంగళాలో ఉండాలెననీ, మోటారుకారు, అట్టహాసం అంతా ఉండాలెననీ ఊరికే తహతహ పడేవాడు. అటువంటి ఆశకల లింగయ్యకు భగవంతు డన్యాయంగా యీ వెధవ గుమాస్తాగిరి ఉద్యోగం

లభ్యపరిస్తే, అది తన కేమూల ? ఇప్పటికిని అతనికా యాశ మాత్రం పోలేదు. రాత్రిం బగళ్లు అదే ఆలోచన. అనేక పత్రికల్ని చూస్తూ ఉండేవాడు. ఎవరెవరితోనో ఏమేమో ప్లానులు వేస్తూ ఉండేవాడు. రాత్రిళ్లు ఊరికే పలవరింపులు, కలవరింపులు ప్రారంభించాడు. ఒకసారి ఏదో పలవరిస్తూండ గా అతని భార్య అతన్ని లేపి——

"ఏవిటండి, ప్రతిరోజూ అలా పలవరిస్తూ ఉంటారు ?"

అని అడిగింది. అప్పుడతడు సిగ్గుపడి ఏమీలేదని మళ్లా పండుకొనేవాడు. ఒక్కొక్కసారి తన పెళ్లాం ఏదైనా కొత్తచీరెగాని, లేక వస్తువుగాని కొనిపెట్ట మన్నప్పుడు, అత డు "ఓసీ, ఉండవే. ఇవన్నీ యిప్పుడేం మాట్లాడబోకు. కొద్దిరోజులలోనే మనకి గొప్ప అదృష్టం రానున్నది. అప్పుడు నేను లక్షాధికారినవుతాను. నువ్వు లక్షాధికారి భార్య వవుతావు. అప్పుడు నీ ఒంటిమీద నీ యిష్టం వచ్చినన్ని నగలు చేయించి పెడ్తాను. అప్పుడు నీకు నగలుమీద, చీరెలమీద మోజు తీరేట్టుగ కొని యిస్తాను. అంతవఱకు నువ్వు ఓర్చుకొని వుండు. మన యిద్దఱం, మన కుఱ్ఱవాడితో సహా యీ ఊళ్లోనే, ఒక పెద్దమేడమీద నివసిస్తూ, అనేక భోగాలను అనుభవిస్తూ, పనివాళ్లని పెట్టుకొని వాళ్లచేత హాయిగా ఊడిగాల్ని పొందుతూ, అనేకమంది చేత నమస్కా-

రాళ్ళి పొందుతూం, ఎక్కడికి పోయినా "అదుగో లింగయ్య పంతులుగారు దయచేశారు". అంటూ అతివినయంగా ఒంగి ఒంగి నమస్కరిస్తూ నాకు ఉన్నతాసనం యిచ్చి తగిన గౌరవ మర్యాదల్ని చేస్తుంటే నేనప్పుడు ఠీవిగా వారికడకు వెళ్లి, గొప్పవాళ్లు ముక్తసరిగా మూడుమాట లేలా మాట్లాడు తారో, ఆలాగ మూడుమాటలు మాటలే వాళ్లకి మహా భాగ్యంలాగ తోపింప జేస్తూ, హాయిగా మనం ఇద్దరం, చిలుక గోరువంకల్లాగ సాయంకాలంపూట గాలిషికారుకి మోటారు కారెక్కి వెళ్తుంటే మనల్ని చూసి ప్రతివాళ్లు "అదుగో, లింగయ్య పంతులుగారు, లింగయ్య పంతులుగారి భార్య" అంటూ అనుకొనేట్టుగా చేస్తూ, స్వర్గలోక సౌఖ్యాల్ని చూచు కొనే భాగ్యం మనకి కొద్దిరోజులలోనే అలవడుతుంది. నువ్వు తొందర పడవద్దు. అప్పుడు నీకోర్కెలన్నింటిని సఫలీకృతం చేస్తాను. అప్పుడు నీవు సౌఖ్యాన్ని పొందుతావు. అంత వరకు ఓపికతో ఉండాలి. ఇంకా రెండు సంవత్సరాలలో నాకు మంచి రోజులని అనేకమంది జ్యోతిష్కులు చెప్పారు. ప్రస్తుతం ఇవిచాలని దినాలని గూడా చెప్పారు. కాబట్టి ఈ కష్టదినాల్ని మనం ఓపికతో నిట్టేశెయ్యాలి." అని దీర్ఘమగు ఈ ఉపన్యాసం యిచ్చేవాడు. అప్పుడు భార్య నవ్వుతూ "ఏమిటండీ! మీాకింత పిచ్చితనం యెందుకూ? డబ్బుకోసం

ఆసపడి ఎవరో జ్యోశ్యులు ఎన్నెన్నో అంటుంటారు. అవన్నీ నిజం అనుకొని, అవి తప్పకుండా ఒస్తాయని మురిసిపోతారేవిటి? ఇంత వఱకు ఆజ్యోశ్యుడికనీ ఈజ్యోశ్యుడికనీ శాంతులికి, ఉప శాంతులికి యెంతో డబ్బు తగలేశారు. ఆడబ్బు గనుక ఉంటే మన సంసారం యెంత సౌఖ్యంగా జరిగి పొయ్యేది. ప్రస్తుతం సంగతి చూసుకోక, ముందేమో ఒస్తుందని ఆసతో, డబ్బంతా ఖర్చుపెడుతూ, అప్పుచేసి పప్పుకూడు తింటూ, ఎన్నాళ్లు సంసారం చేయడం? అప్పులు జాస్తి అయిపో తున్నాయి. మీరు వృథాగా డబ్బును ఖర్చుపెట్టేస్తే ఇక యీ ఊళ్లో మన సంసారం యేలా గడవడం? ఊరికే ఎండ మావుల్లాగ కనబడే నిరాధారమైన, జ్యోతిషం ద్వారా, గాలిలో మేడలులాగ కనబడే ముందు ఐశ్వర్య దినాల్ని నమ్మి మురిసిపోవడమంత చాదస్తం ఇంకోటి యేమీలేదు. కాబట్టి నామాటవిని వ్యర్థజ్యోతిష్కుల మాటలు విని, డబ్బు దండగ పెట్టుకోనక, ఉన్నదానితోనే తృప్తిపడి, సంతుష్ట జీవనం చేయడమంత ఉత్తమమైన పద్ధతి, సౌఖ్యజీవనం వేఱొండు లేదని నాయభిప్రాయం. ఏమీ ఐశ్వరం ఉన్నా మనం ఇప్పు డు తినేదానికంటే ఏమీ అంత ఎక్కువ తినలేముగదా. కాబట్టి మనకిదే ఐశ్వర్యం. మీకొచ్చే నలభై రూపాయల లో ఒక దమ్మిడికూడా ఖర్చుచేయకుండా నాచేతిలో పడేశా

రంటే, మీాకేమి కొదువరానీయకుండా సంసారాన్ని గడుపు తూ ఉంటాను. అంతేగాని, ముందేదో మనకి మేరుపర్వతం ఊడిపడుతుంది, ఆసౌఖ్యం ఉంది, ఈసౌఖ్యం ఉంది అని పిచ్చి కోర్కెలు పెట్టుకొని, డబ్బు తగలేశెయ్యటం అది తెలివి గలవాళ్ల లక్షణాలుగావు! ఇప్పుడు కానికి ఒక జోశ్యుడు న్నాడు. మనం ఎంతడబ్బు యిస్తే అంత మనకు మంచి గలు గుతుందని చెప్పుతాడు. అసలావారికి జ్యోతిష శాస్త్రమంటే ఏవిటోగూడా తెలీదని నాయభిప్రాయం. ఏవో ఎక్కడో నాలుగు శ్లోకాల్ని నల్లేవేసి, అక్కడక్కడ నాలుగు ముక్కల్ని జ్ఞాపకం ఉంచుకొని యేవో అట్టహాసం చేస్తూ, తాము జ్యోతిష సిద్ధాంతులమని విర్రవీగుతూ, భేషజానికేమి కొదువలేక, కిర్రు చెప్పుల్తోను, దుశ్శాలువలతోను, మకర కుండనాల్తోను, విభూతి కుంకుమరేఖల్తోనూ, రుద్రాక్ష మాలల్తోను, అపర శివావతారాల్లాగ ఊడిపడతారు. అది అంతా వట్టిభేషజం తప్ప వేరేమీాలేదు. వీళ్లంతా డబ్బుకోసరం ఆశపడేవాళ్లేగాని మరేంలేదు. కాబట్టి నామాటవిని యికమీాదనన్నా జ్యో తిషం పిచ్చ వొదిలేసి, మీాజీతం ఆజ్యోశ్యులకీ యీా జ్యోశ్యు లకీ పంచిపెట్టక యింటికి తీసుకవస్తే మర్యాదగా సంసారం చేయ వొచ్చు"అని భార్య లింగయ్య పంతులకి ఉపదేశించింది. దాని తో అతనికి ఆగ్రహం మెండై "నోరుముయ్యి. అపశఘునపు

మాటలంటావు. పెద్దలైన జ్యోశ్యులు తిడ్తావ్? "పిల్లకాకికి యేంతెలుసురా వుండేలుదెబ్బ" అన్న సామెత ప్రకారం నీకేం తెలుసునని ఆలాతూల నాడ్తావ్. ఇటువంటి గుణాలన్నీ నాకు సరిపడవు. నేను బాగుపడడం నీకిష్టంలేకపోతే, నీపుట్టింటికిప్పుడే నువ్వు మూట గట్టొచ్చు" అని అన్నాడు. అప్పుడు పాప మాయిల్లాలు తన భర్తయొక్క పిచ్చి నమ్మకానికి చాలా విచారించింది. కాని యేంజేస్తుంది? ఎంత చెప్పినావినలేదు. తన మెళ్లో తనపుట్టింటి వాళ్లుపెట్టిన నగల్నిరెంటిని అమ్మి బియ్యం వాడికి ఉప్పు చింతపండువాడికి సమాధానం చెప్పింది. కాని యింకా అప్పులున్నై. భర్త జీతంలో మూడ్పాతిక భాగం జోశ్యులపరం అవుతుంది. అంటే ఆతని జీతం నలభై రూపాయల్లో ముప్ఫైరూపాయలు వాళ్లపరం అవుతుంది. తక్కిన పదిరూపాయల్లో జీవనం ఏలా గడపడం? కాని అత నికింకో దురభ్యాసం ఏమీలేదు. ఆఖరికి పొడుంగూడా అలవాటులేదు. ఈ జ్యోతిషపుపిచ్చి అతన్ని ఆలా ఆడి స్తోంది.

*　　　*　　　*

ఆరోజు శివరాత్రి. బెజవాడ యాత్రికులకూడలిస్థానం అయింది. అనేకమంది ఆ పవిత్రకృష్ణానదిలో జలకమాడి వెళ్లుతున్నారు. అప్పుడానకట్టుమీద గూర్చుండి మన తుండే శ్వర సిద్ధాంతి రుద్రాక్షమాలను త్రిప్పుకొంటూ, విభూతిరేఖ

లను కుంకాన్ని దిట్టంగా పెట్టుకొని, అర్ధ నిమీలిత నేత్రాల్తో కొంత సేపటివరకు గాయత్రి మంత్రాన్ని జపం చేశాడు. పిమ్మట తన చంకలోవున్న కాగితాలకట్టని బయటికితీసి, ఏవేవో జాతకచక్రాల్ని గీస్తూ, లెక్కలేస్తూ, వచ్చేపోయే వాళ్లని ఆకర్షిస్తున్నాడు. అప్పుడే కొందఱతని వద్దకువొచ్చి "ఏమండీ సిద్ధాంతిగారూ! తమకేమైనా జ్యోతిష శాస్త్రంలో ప్రవేశ ముందా? మీకు కేరళం తెలుసునా? సాముద్రికం తెలుసునా? రేఖాశాస్త్రం తెలుసునా? ప్రశ్నఫలం తెలుసునా?" అని యీమోస్తరుగా అడగడం ప్రారంభించారు. అందఱికి అన్ని విధాలుగా సమాధానం చెప్పాడాతుండేశ్వర సిద్ధాంతి. కొంతమంది చేతుల్ని చూపించుకొనేవాళ్లు, కొంతమంది ప్రశ్నలడిగేవాళ్లు, కొంతమంది కొంతవఱకు చక్రంవేయించి భావిఫలం తెలుసుకునేవాళ్లు తయారయ్యారు. అందఱిదగ్గిర తన వీలుకొద్ది సిద్ధాంతిగారు డబ్బును గుంజేస్తున్నాడు.

అప్పుడు లింగయ్యపంతులు, తన భార్యా బిడ్డలతో శివరాత్రి స్నానానికి కృష్ణానదికి వొచ్చి, స్నానంచేసి యింటికి మరలి వెళ్లుతూండగా యీతుండేశ్వర సిద్ధాంతిని చూశాడు. అప్పుడు భార్యతో "ఒశే! అదుగో, చూశావా? ఆ సిద్ధాంతిగారు చుట్టు ఎంతమంది జనం ఉన్నారో. ఎన్ని ప్రశ్నల్ని చెప్పించుకుంటున్నారో చూడు. వాళ్లందఱినిగూడా పిచ్చ ముండాకొడుకుల క్రిందనే కట్టేస్తావా" అని అన్నాడు.

"ఆఁ! కాకపోతే యేమిటి? మనకు భగవంతుడు నొసట వ్రాసిందేమిటో దాని ప్రకారం జరుగుతుందిగాని యీప్రశ్నలడగడం యిదంతా ఒక వేలంవెఱ్ఱి. పైగా ఆజోశ్యుడు సగం తెలిసీ తెలీక, డబ్బుకోసరం ఏదైనాచెప్పినా అక్కడనుంచి వెళ్ళిపోకడలు, ఇంతతప్ప నాకేమీ కనబడదు."

* * *

"చాలు చాలులే నోరుముయ్యి ఆడముండకి నీకేం తెలుస్తుంది. ఆయనచూడు శివరాత్రిపూట అపర శివావతారంలాగ ఏలావున్నాడో. అటువంటి ఆయన్ని నువ్వేమన్నా అన్నావంటే కళ్ళుపోతాయి, జాగర్త."

"బాబూ, మీకోనమస్కారం గాని, నన్ను పండుగనాడుమాత్రం, ముండతిట్లు రండతిట్లుమాత్రం తిట్టవద్దు. ఆ సిద్ధాంతీ మీరూ ఏవన్నా సంప్రదించండి. నాకు ఆ ప్రసక్తే ఒద్దు."

"ఓసీ ఏడుపుకొట్టుదానా! నాబాగు కోరడంలేదులాగుంది. నాబాగంటే నీకళ్ళు ఆలా మంటలెక్కుతాయేం?"

"మీ కాళ్లు పట్టుకొంటానండీ, ఈ పదిమంది వచ్చేపొయ్యేదారిలో మీ దూషణ పంచాంగం విప్పకండి. ఇంటికిబోయిన తర్వాత మీ ఆర్భాటం అంతాచూపించండి. ఇప్పటికి చాలా పొద్దుపోయింది. ఇంకెప్పుడు యింటికి వెళడం? వంటచేసుకోవడం?"

"ఎప్పుడూ నీకు తిండి తిండి. ఉండు మాట్లాడకుండా, మహా పర్వదినం, మహా శివరాత్రిపూట ఆయపర శివావ తారం మనకి అతిథిగా దొరికితే మనభాగ్యం చెప్పవీలులేదు. నేనాయన్ని పిలుచుకువొస్తా, నువ్విక్కడుండు." అంటూ ఆ సిద్ధాంతిగారి దగ్గిరకి వెళ్లాడు. ఆతనిభార్య అతని జ్యోతిషపు పిచ్చునిగురించి చాలా విచారించింది.

లింగయ్యా పంతుల్ని చూడగానే తుండేశ్వర సిద్ధాంతి భేషజం మరింత ఎక్కువైంది. ఏమో పరధ్యానంగా, ఏదో ఉపాసిస్తున్నట్టు, పెన్సలు చేతిలోవుంచుకొని, కళ్లు మూసు కొన్నాడు. లింగయ్యాపంతు లతనినిచూచి, అతని నిష్టనిచూచి, చేతులుగట్టుకొని వినయసంభ్రమాల్తో నిలుచున్నాడు. అప్పు డు కొంతసేపటికి తుండేశ్వర సిద్ధాంతి తన కరుణా దృక్కుల్ని లింగయ్యా పంతులమీద బరిపాడు. లింగయ్యా పంతులు ధన్యోస్మి అంటూ అతని పాదాలమీద సాష్టాంగ పడ్డాడు.



ఆతణ్ణి తుండేశ్వర సిద్ధాంతి "అభీష్ట సిద్ధిరస్తు"అని దీవించాడు. అప్పుడు పులకరించిన శరీరంతో లింగయ్యాపంతులు లేచి చేతులు జోడించి"

"శాస్త్రిలవారూ! తమరు మా అదృష్టంకొద్దీ మహా శివరాత్రిపూట శివుడిలాగ సాక్షాత్కరించారు. కాబట్టి యీ రోజు మాగృహం పావనంచేసి మా అతిథి పూజల్ని స్వీకరించాలి."

"సంతోషం; కాని నేనొకదానికి అనుమానిస్తున్నాను. నాకీరోజు వ్రతం. కాబట్టి ఫలాహారం చేస్తాగాని భోజనం చేయను."

"ఆలాగె, తమరికి ఏవిధంగా లోటుచేయను, దయచేసి నాప్రార్థనని అంగీకరించాలి."

"సరే"అని ఒప్పుకొని తుండేశ్వర సిద్ధాంతి, లింగయ్యపంతుల గృహానికి అతిథిగావెళ్లాడు. అతని అడుగు మడుగులొత్తుతూ పాదపూజగావించాడు లింగయ్యపంతులు.

* * *

ఫలాహారానంతరం తుండేశ్వర సిద్ధాంతి తన బొజ్జ నిమురుకొంటూ, పోతవిగ్రహంలాగ తుంగచాపమీద చతికిలబడ్డాడు. అప్పుడు లింగయ్యపంతులు ఆమాట యీమాటా చెప్పి తనయొక్క జాతకం చూడాలెనన్నాడు. అప్పుడాయన తీసుకురమ్మన్నాడు. అప్పుడు జాతకం తీసుకువొచ్చాడు. భార్యమాత్రం తుండేశ్వసిద్ధాంతి దొంగ అనే భావించింది; కాని ఊరుకొంది. అప్పుడు తుండేశ్వర సిద్ధాంతి తనరొండి

నుండి పొడుంబుర్రతీసి, అందులోని పొడుమును చిటికెడుతీసి, పీల్చి, తాంబూలం, ఫలం, దక్షిణ తీసుకురమ్మన్నాడు. ఆ లాగే లింగయ్యపంతులు తీసుకొచ్చి ఆయనముందుబెట్టి, ఆయనచేతిని తన జాతకాన్ని యిచ్చాడు. అది అటూ ఇటూచూసి "ఇదియెవడో తలతిక్క శంకరాయి రాసిందాని లాగుంది"అన్నాడు. అప్పుడా లింగయ్య "కాదండి, గొప్ప సిద్ధాంతులే రాశారండీ"అని అన్నాడు. "అయ్యా, మీకీ విషయంలో ఏంతెలుసు" అని తుండేశ్వర సిద్ధాంతి అనేటప్ప టికి లింగయ్య నోరు తాళంపడింది. తర్వాత సిద్ధాంతి తన దారాలు గట్టిన సగంబద్దలైన సులోచనాలజోడును తగిలించు కొని, ముందు రుద్రాక్షమాలను తిప్పి, కళ్లుమూసుకొని ఏవే వో జపిస్తూన్న వాడిలాగ నటించి, తర్వాత కళ్లుదెఱిచి, ఆ జాతకం వొంకచూసి, అటూ యిటూ చక్రాల్ని వేసి, గుణకార భాగారాల్ని చేసి, పిమ్మట యేవేవోకొన్ని దశల్ని, అంతర్దశల్ని, దశానాథుల్ని, వారివారి స్థానాల్ని, వాళ్ల వాళ్ల ఫలాఫలాల్ని, లింగయ్య పంతులకి సగం అర్థం అయ్యేట్టుగా చెప్పాడు. తర్వాత లింగయ్య పంతుల్తో "పంతులుగారూ! మీజాతకం చాలా గొప్పజాతకం. ఇంకా ఒక సంవత్సరందాకా యిలా కష్టపడ్తూ ఉంటారుగాని, తర్వాత మంచిదశ యెత్తుకుంటుంది. ఇంకొక సంవత్సరానికి మీకు సముద్రప్రయాణం జరుగుతుంది. అప్పుడు ఇతర పట్నంలో ఒకపెద్ద వ్యాపార రీత్యా మంచి

ధన లాభం పొందుతారు'' అని చెప్పాడు. అప్పుడు లింగ య్యా ఆనందం అపారమైపోయింది. ఒళ్లుపై తెలీక పరవశుడై ఆయనకి నమస్కరించాడు. అప్పుడు తుండేశ్వర సిద్ధాంతి ఇదే సమయం అనుకొని ''పంతులుగారూ! యీనవగ్రహాపీడ పోవడానికి ఉపశాంతిగా మీరెవరైనా సద్బ్రాహ్మడికి నవ ధాన్యం, నవసువర్ణ నాణ్యాల్ని దానంచేయాలి''అని అన్నాడు, అప్పుడు కొద్దిగా లింగయ్యపంతుల ఉత్సాహం తగ్గిందిగాని మళ్లీ భావిఫలితాన్ని తలచుకొని ఆలాగే ఒప్పుకొన్నాడు. ఆయన భార్యకిమాత్రం నమ్మకంలేదు. తనయింకోనగతీసి, భర్తకిచ్చింది. దానితో తుండేశ్వర సిద్ధాంతికే ఆదానాన్ని చ్చేసేశాడు. ఆలా తుండేశ్వర సిద్ధాంతి ఒకమాసంరోజులు అక్కడ మకాం వేశాడు.

* * * *

రాద్ధాంత సిద్ధాంతాలు చేసి, ఏలాగోలాగవుంచి యిల్లాలైన తనభార్య ముక్కుపుడక దగ్గఱనుంచి అమ్మించి, వట్టి నిరాభరణనుగాజేసి పుట్టింటికి తోలేశాడు. ఆనగలమ్మిన డబ్బుతో అప్పుల్ని తీర్చాడు. తన సంవత్సరం జీతం నాలు గు వందల రూపాయల్నికూడ బెట్టి, సంవత్సరం తిరగగానే జోశ్యుడు చెప్పాడనే సంతోషంతో మద్రాసువెళ్లి, అక్కణ్ణుంచి రంగూనుకు సముద్రయానం చేశాడు. రంగూనుకుచేరి అక్కడ ఒక బస యేర్పాటు చేసుకొని, హొటాలులో

భోజనంచేస్తూ అపరిమితానందంతో, తుండేశ్వర సిద్ధాంతి చెప్పిన ప్రకారం తన అదృష్టపు రోజుల్ని లెక్కపెట్టుకొంటూ యెప్పుడెప్పుడా అని తహతహలాడి పోయాడు. రోజులెన్నాళ్లో వస్తాయి. లింగయ్యపంతులు లారాటమేగాని, తనకు తుండేశ్వర సిద్ధాంతి పెట్టిన అదృష్టపు దినానికి యింకా వారం రోజులే ఉన్నై. తన చేతిలోవుండే పైకంగూడా ఆఖరుకా వచ్చింది. ఆ అదృష్టదినాన్ని తలుచుకొంటూ డబ్బు అయి పోయిన బెంగకూడా లేకపోయింది.

రేపు తన అదృష్టదినం అనగా ఆరాత్రి భోజనానికి గూడా తికాణా లేక పోయింది. అయినా రేపు తనకు శుభ దినం వస్తూండగా వొక్కపూట తిండిలేకుండావుంటేయేమి అనుకొన్నాడు. ఆరాత్రల్లా అతనికి నిద్రపట్టలేదు. తెల్ల వారితే అదృష్టదినం. తనకి బాగా డబ్బు రావాలి వ్యాపారం చేయాలి. అందులోను గొప్ప వ్యాపారం అట—తన చేతిలో యెర్రని యేకాసీగూడా లేదు—ఎలావొస్తుందో ఏరూపంగా ఒస్తుందో అని అనేకవిధాలుగా తలపోసుకొంటూ, గంట యింకా కాదేమన్నా అని తహతహలాడ్తూ, ఏలాగోలాగ ఆ రాత్రి గడిపాడు.

తెల్లవారింది. రంగూను వీథులన్ని మేలుకొన్నై. అంతకుముందే మహాసంతోషంతో, తన అవశిష్టాలన్నీ తీర్చు

కొని వీథిలో పడ్డాడు లింగయ్యపంతులు. కాఫీగూడా తాగ లేదు. రంగూనంతా, ప్రతిసందు, ప్రతివీథి తిరుగుతున్నాడు. మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. కడుపు ఆకలిచేత దహించి పోతోంది. కాళ్లుచేతులు తడబడ పడుతున్నాయి. నాలుక పిట్టంగట్టి పోయింది. నోటి వెంబడి మాటరాక పోయింది. ప్రాణం శోషిల్లింది. పాపం, క్రిందటిరోజు మధ్యాహ్నం తిన్నతిండి. లింగయ్యపంతులు ఓ యింటి అరుగుమీద ఒళ్లు తెలీక పడిపోయాడు.

కొంతసేపటికి ఆ యింట్లో వాళ్లు అతనినిచూచి, తిండీ లేదని జాలిపడి, ఆతనిపైన నీళ్లుజల్లితే అప్పటికి తెలివి వచ్చి కళ్లుతెరిచి చూశాడు. తర్వాత వాళ్లు "భోజనం చేస్తావా?" అంటే "చేస్తా" అని సైగ చేశాడు. అప్పు డతని జందెపు పోగువల్ల బ్రాహ్మడని గ్రహించి లోపలికి తీసుకుపోయి, భోజనం పెట్టారు. అప్ప టికతని ప్రాణాలు బొం



దిలో ప్రవేశించాయి. తర్వాత మెల్లిగా తన యావత్తు సంగతి ఆయింటి యజమానికి చెప్పితే, ఆతడు ఫక్కు-మనినవ్వి "ఓయి, వెర్రి బ్రాహ్మడా, ఎవడో సిద్ధాంతి జోశ్యం చెప్పె

డని యింతదూరంవొచ్చి, ఆఖరికి తిండి లేకుండా చచ్చిపోవ డానికి సిద్ధమైనావే. నీవంటి చాదస్తుడెవడైనా ఉంటాడా? భగవంతుడు మన నుదుట యెంత రాశాడో అంతే లభిస్తుంది. అంతేగాని వృధాగా "ఉదరపోషణార్థం బహుకృతవేషం" అని వచ్చే కపట జోశ్యులమాటవిని యింతవరకు తెచ్చుకున్నావని అనేక విధాలుగా మందలించాడు. తర్వాత వారం దినాలు ఆయింటి యజమాని దయవల్ల అక్కడ భోజనంచేస్తూ, ఆతని ప్రాపకంవల్ల నల్గురు చందా వేసుకొని ఆతన్ని స్టీమ రెక్కించి, కొంతడబ్బు చేతికిచ్చి "పిచ్చివాడా, ఇకనైనా, నీజోశ్యవుపిచ్చ వొదలుకొని యిల్లుచేరుకొని, హాయిగా పెళ్లాం బిడ్డలతో ఉండు" అని బోధించాడు వాళ్లందరికి సిగ్గుతో తన కృతజ్ఞాభి వందనాల్ని సమర్పించాడు.

* * *

మాసిపోయిన గుడ్డల్తో, పెరిగిపోయిన గడ్డంతో, కడు వు పీవుకంటుకొనివున్న లింగయ్యా పంతుల్నిచూసి, అత్త మామలు గుర్తు పట్టలేకపోయారు. అప్పుడు భార్యవొచ్చి ఆతన్నిచూసి, కొయ్యాయైపోయింది. ఐదు నిమిషాలదాకా అందఱు మౌనం వహించారు. తర్వాత భార్య కన్నీళ్లు తుడుచుకొంటూ, ఒణుకుతున్న కంఠ స్వరంతో, భర్తని

సమీపించి "ఏమిటిది, యిలా అయిపోయారేం?" అని అడిగింది.




అతడు దుఃఖం ఆపుకొని, "ఇది నా జోశ్యపుపిచ్చి" అని యేడ్చాడు. భార్య గూడా యేడుస్తూ అతన్ని కావులించుకొంది. పిల్లవాడేడ్చాడు. అప్పుడు అత్త మామలు, అల్లుణ్ణి కూతుర్ని ఓదార్చారు.

లింగయ్యావంతులు కొంతకాలం భార్యతో అత్తింటి దగ్గిరవుండి, యథాప్రకారం తన ఉద్యోగంలో ప్రవేశించాడు. అప్పుడప్పుడు భార్య ఆతన్ని "జోశ్యం చెప్పించుకోరూ?" అని యెగతాళి చేస్తూ ఉండేది.

# 3

" పండువంటి సంసారాన్ని పాడుచేసుకొన్నానే ".

అప్పన్న కాపు మనిషి. ఆతడు చాలా బీదవాడు. ఏలాగోలాగ కష్టపడి కూలినాలి చేసికొని గడించిన ధనంలో పెళ్లిచేసుకొన్నాడు. అప్పన్న యెంత కష్ట జీవితం గడుపుతూన్నా ఉరుటూరు అగ్రహారికులు, రైతులు అంతా అతని యొక్క సత్యప్రవర్తనానికి, విశ్వాసానికి చాలా మెచ్చుకొంటూ అప్పుడప్పు డేదో పనికల్పించి యాతనికో నాలుగు డబ్బుల్ని ముట్ట చెప్పుతూండేవారు. వాళ్లిచ్చే సరీగా దినభత్యం గడిచేది. తన వొక్కడి పొట్ట, గుడ్డ గడిచేది, కాని యిప్పుడు ఒక యింటివాడయ్యాడు. తనకితోడు తన పెళ్లాన్ని గూడా పోషించవలసిన బాధ్యత ఆతనిమీద బడింది. ఇప్పుడతని జీవితం చాలా కష్టమైంది. "అయ్యో, దైవమా! ఎఱుగక పెళ్లిచేసుకొన్నానే." అని విచారించడం ప్రారంభించాడు. ఎన్నెన్ని విధాలో డబ్బు సంపాదన కాలోచించాడు, కాని యేమిచేస్తాడు? ఏమీ పాలుపోలేదు. అందులోను ఇదివఱకు సేకరించిన డబ్బంతా వివాహానికి ఖర్చు అయిపోయింది. ఇంక అతనికి తెక్కలాడితే డొక్కలాడ్తాయి. అయితే యింకో యిబ్బంది ఒచ్చింది. ఇటువంటి అవస్థలో

పండువంటి సంసారాన్ని పాడుచేసుకొన్నానే,

తన పెళ్లాంతరఫువాళ్లు కూడా కొంతమంది యింటికి వచ్చారు. ఇంతమందికి ఏలా భోజనం పెట్టడము అని ఆలోచన సాగించాడు. పెళ్లాం ఒచ్చింద కొత్త. తన సంగతి యింకా యేమీ తెలీదు. అదిగాకపోయిన తన యిబ్బందుల్ని పెళ్లానికి తెలిపితే చాలా చిన్నపోతుంది. ఒచ్చిన బంధువు లెన్నాళ్లుంటారో కూడా తెలియలేదు. వాళ్లకొక్కరోజు ఏమైన లోటు జరిగితే తన పరువు బయటపడుతుంది. ఆతని పని "వెనకచూస్తే నుయ్యి ముందుజూస్తే గొయ్యి," లాగున వుంది. ఏం చెయ్యాడానికి తోచలేదు. దీర్ఘాలోచన చేస్తూ తన యింటి వసారాలో కుక్కి నులకమంచం మీాద కూచొని వొక రాత్రి ఆకాశం వొంకచూస్తున్నాడు.

అప్పటికి పన్నెండు ఘుంటలరాత్రి అయింది. అంతా పండుకొన్నారు. కాని అప్పన్నకి మాత్రం నిద్ర పట్టలేదు. తెల్లవారితే ఏలా గడుస్తుందా అన్న ఆలోచనలో మునిగి ఉన్నాడు. ఇంతలో చీకట్లను విరజిమ్ముతూ చంద్రోదయమైంది. చల్లని గాలి అప్పన్న శరీరానికి తగుల్తోంది. అప్పుడు కొద్దిగా అతనికి ఉపశాంతి కలిగింది. అప్పుడు మంచంపై నుండిలేచి మంచినీళ్లకని యింట్లోకి పోయాడు. అప్పుడా యింట్లో ఒక చిన్న తడికెల గదిలో కిరసనాయిలు బుడ్డి దీపం వెలుగుతోంది. ఒక నులకమంచంపైన దుప్పటిని పఱచి వుంది. ఆమంచం ప్రక్కనే నేలమీాద యీతాకుల చాప

మీద తన భార్యకూచొని వుంది. అప్పన్న అదంతా చూశాడు. అప్పటి తన భార్య దృశ్యాల్ని చూసేటప్పటికి అతని కెక్కడలేని విచారం కలిగింది. కాని పొంగివచ్చే దుఃఖాన్ని బలవంతాన ఆపుకొని మెల్లగా అగదిలోనికి ప్రవేశించి తన భార్య యేం చేస్తున్నదో అని తొంగిచూశాడు.



అప్పుడా యువతి అప్పన్న యొక్క చినిగిపోయిన పంచల్ని ముందువేసుకొని సూది దారంతో కుడ్తోంది. అప్పుడప్పుడు కంటి మీద కునుకువస్తే, అటూ ఇటూ తూల్తూ, మళ్లీ "మాయనిద్ర" అనుకొంటూ, తన ప్రక్కనే వుంచుకొన్న యిత్తడి చెంబులోవున్న నీళ్లలో తనచేయిని ముంచి, ఆ తడి చెయిని తన కళ్లకు తుడుచుకొంటున్నది. అదిచూసి, అప్పన్న విచారాశ్చర్యాలకి మితిలేదు. అటువంటి భార్య తనకు లభింపజేసినందుకు తన యిలువేల్పైన సింహాద్రి అప్పన్నని యెంతో వేడుకొన్నాడు. అప్పటి తన భార్యని చూసి చాలా జాలి పడ్డాడు. ఇంతకుముందు తన భార్యసంగతి అతని కంతగా తెలియలేదు. ఇప్పుడతనికి తెలిసినది. ఇప్పుడతనిలో వొక విధమైన ధైర్యభావం అంకురించింది. సంతోషంతో గూడిన

పండువంటి సంసారాన్ని పాడుచేసుకొన్నానే.

దుఃఖంచేత కలిగిన కన్నీళ్లను బలవంతాన ఆపుకొంటూ మెల్ల మెల్లగా తన భార్య వెనుకకుబోయి కూర్చొన్నాడు. అప్పుడు మెల్లని కీచుగొంతుకతో యీ క్రిందివిధంగా, తనలో తాను పాడుకొంటూవుంది.

"పడవ పయనం అంటె బ్రమసిపొయ్యాను
పానాలు పైకట్టె పరుగు లెడతాయి పll

కెరటాల తాకిడికి, గిరికేలు కొడతాది
హోరుగాలికి పడవ వొరిగొరిగి పడుతాది పll

చంకలో చిన్నోడి ఝడుపు తీరుతూంటె
పడవొరిగి నీనీళ్ళల్లో పడదూకబోతాది పll

కింద మీదికి సూస్తే కిందమీదౌతాది
పానసూ సేతల్కి పడవొరిగి పడతాది పll

శింహాద్రి అప్పణ్ణి, శిత్తమున దలచుకొని
సుక్కాని పట్టుకొని సూటిగా పోవాలి పll

కూసింత దూరాన, గుడి గోపురాలయిగో
పానాలు బిగబట్టి పడవ సాగిద్దాము పll

ఈ పాటనువిని అప్పన్న పరవశుడై పోయాడు. ఆనం దాన్ని పట్టలేక తన భార్యని వొక్కసారి గట్టిగా ఆలింగనం చేసుకొన్నాడు. అప్పుడు భార్య, ఉలిక్కిపడి, వెనక్కి తిరిగి చూసి, సిగ్గుచేత "నన్ను ఒదలండి" అని మెల్లిగా అంది. కాని అప్పన్న "నిన్ను వొదలను, నిన్ను వొదలలేను. ఇలాగే

పట్టుకొంటాను. ఈ తెల్లవార్లు నిన్ను ఈలాగే పట్టుకోవాలని వుంది. నువ్వు నాకౌగిటిలోంచి మళ్లీ నీమధుర కంఠ స్వరంతో ఆపాటను పాడాలి. నువ్వు నిజంగా నాప్రాణానివి. నా భాగ్యమవు. ఇన్ని నాళ్లనుంచి నిన్ను సరిగా గ్రహించు కొనలేదు. ఇప్పుడు గ్రహించుకొన్నాను." అని ఆవేశంతో అంటూ ముద్దుల వర్షంతో వుక్కిరి బిక్కిరి చేశాడు. ఆ యువతి మెల్లగా "నన్ను వొదలండి. నేను గుడ్డను కుట్టాలి." అని అంది.

"ఇప్పటికి రాత్రి ఒంటిగంట కావస్తోంది. నీవిందాకా మేల్కొంటే జబ్బు చేస్తుంది. ఇక కుట్టడము చాలించి పడుకో."

"ఇదిగో అయిపోయింది. మీరు తెల్లవారుఝాముననే లేచి పనికి పోయేవారు. ఇంతసేపు మేల్కొంటే లేవడం కష్టం కాదా?"

'తెల్లవారుఝాము, పని' అనగానే తనలో విచారం మళ్లీ కలియబెట్టడం ప్రారంభించింది. అప్పుడతని కళ్లవెంబడి రెండశ్రుకణాలు అప్రయత్నంగా క్రిందరాలాయి. అప్పుడు చప్పున తలకాయ క్రిందికి వొంచేసుకున్నాడు. అదిచూసి ఆ యువతికి మొదట ఆశ్చర్యం గలిగింది. తర్వాత ఆమెకు గూడ కళ్లవెంబడి నీళ్లు కారుతున్నాయి. బలవంతాన విచా

పండువంటి సంసారాన్ని పాడుచేసుకొన్నానే.

రాన్ని అణిచి వేసుకొని, తనభర్త ఒంకచూసి "ఎందుకు మీరలా దుఃఖిస్తున్నారు" "ఏమీ లేదు" అంటూ కండ్లు తుడుచుకొన్నాడు.

"ఏమైన తలనొప్పిగా వున్నదా?"

"లేదు."

"చెప్పరూ?" అని అతని వొంకదీనంగా చూసింది. ఆ కళ్లల్లో ఒకవిధమైన విచారభావాన్ని అప్పన్న చూశాడు. అప్పుడు మళ్లీ భార్యని కావులించుకొని, ముద్దుబెట్టుకొని, చిన్న కుర్రవాడులాగ, వెక్కి వెక్కి యేడ్వడం ప్రారంభించాడు. అప్పుడతని భార్య యేలావుందో చెప్ప శక్యంగాదు. దుఃఖంలో వొకళ్లకంటె వొకళ్లు ఎక్కువయ్యారు. ఒకళ్ల కొకళ్లు వోదార్చుకోలేక పోయారు. ఒకళ్లని పట్టుకొని ఒకళ్లు దుఃఖించడం ప్రారంభించారు. కొంతసేపటి వఱకలా దుఃఖించారు. తర్వాత ఆ యువతి తన చీరకొంగుతో భర్తయొక్క కన్నీళ్లను తుడుస్తూ, ఒణుకుతూన్న కంఠస్వరంతో "ఏడవకండి. మీరేడుస్తే నేనుచూడలేను" అని అంది. అప్పుడా మాటకి మఱింత దుఃఖించాడు.

కొంతసేపటికి, అప్పన్న భార్యయొక్క ఓదార్పు మాటలవలన కొంతవఱకు దుఃఖోపశాంతిని బొందాడు.

"నువ్వు వట్టి నిర్భాగ్యుడికి భార్యవయ్యావే"

"అదియే నా సంతోషము"

"ఏమి! కట్టుకోవడానికి గుడ్డను, తినడానికన్నమును లేని నాబోటి నిర్భాగ్యుణ్ణి పెళ్లి చేసుకోవడం సంతోషమా?"

"దరిద్రంలోనే సంతోషం ఉంది. పైకి సౌఖ్యాలలాగు కనబడేవన్నీ ఎండమావులు. పువ్వులరాణి, గులాబి పువ్వు ముళ్లమధ్య ఉంటుంది. అలాగే కష్టాలమధ్యనే నిజమైన సంతోషం ఉంది."

ఈమాట వినేటప్పటికి అప్పన్న కెక్కడలేని సంతోషాశ్చర్యాలు కలిగాయి. తర్వాత భార్యతో యిలా అన్నాడు.

"నీకింకా నేనెటువంటి నిర్భాగ్యుణ్ణో సరిగా తెలియలేదు. నీకు నిజంగా తెలిసినమీదిట పైరీతిగా అనజాలవు".

"మీకు నాయొక్క నిజం నిలకడమీద తెలుస్తుంది."

"అయ్యో! పిచ్చిదానా! నీకింకా తెలీలేదు. ఇదుగో, చెప్తావిను. నేనిందాకటినుంచి విచారించుచున్నది యెందుకో తెలుసునా? రేపటిరోజు భోజనానికెట్లా అని ఆలోచిస్తున్నాను. నాచేతిలో ఒక దమ్మిడికూడా లేదు. ఇంట్లో బియ్యంకూడా లేవు. రేపు చుట్టాలకెట్లాగా అని ఆలోచిస్తున్నాను. రేపటిరోజున కూలిపనులుగూడా యేమిలేవు. ఇటువంటి కూటికిలేని దరిద్రుణ్ణి నేను.

"మీరు దానికి విచారపడితే లాభంలేదు. "నారుపోసిన వాడు నీరు పోయకమానడు". కష్టాలెప్పుడూ కాపరాలుండవు. కొన్నిరోజులు చీకటిదినాలు కొన్నిరోజులు వెన్నెలదినాలు. అంతమాత్రానికి ధైర్యం ఒదలడం బుద్ధిమంతుల లక్షణం గాదు. ఇదిగో, నామెళ్లో, నాపుట్టింటివాళ్లు పెట్టిన పులిచేరునాను ఉన్నది. రేపటిరోజున యిది అమ్మివేసేయండి. దానిఖరీదు నూరు రూపాయల పైచిలుకుండును. దానితో మనం కొంతకాలం గడపొచ్చు. తర్వాత దేవుడున్నాడు."

"ఆహా, ఇల్లాలంటే నువ్వే!" అంటూ భార్యని ముద్దాడాడు.

"కాని నువ్వొచ్చి యింకా యెన్నోరోజులు లేదు. అదీగాకపోయినా నీపుట్టింటివాళ్లు నీకుపెట్టిన నగల్ని అమ్మడానికి నాకు అధికారంలేదు."

"నేను మీదాసినైనప్పుడు నావస్తువులన్నియు మీవి కావా?"

"నువ్వేను దాసివికావు. నాప్రాణమవు."

"అయితే యింకోమాట చెప్పకుండా యీ నగని తీసుకోండి. మీకంటే నాకీలోకంలో ఎవ్వరులేరు. భర్తయే భార్యకి సర్వస్వం అని పెద్దలంటారు. కాబట్టి నేను మీకోసరం నా ప్రాణాల్ని అన్నా బలియివ్వడానికి సిద్ధంగా

ఉన్నాను. నేనుకూడ యికమీద కూలిచేసి డబ్బును గడించి, మిమ్మల్ని పోషింతును.

"దానికి నేను సమ్మతింతునా?"

"అది నా విధి."

సంతోషం పట్టలేక అప్పన్న భార్యను కౌగలించుకొని ముద్దాడును.

*　　*　　*　　*

ఒక పదిహేను రోజులకి అప్పన్న యింట్లో చుట్టాలు వెళ్లిపోయారుగాని, అప్పన్న దరిద్రం మాత్రం వొదల్లేదు. వాళ్లు వెళ్లిన నాలుగురోజులకు అప్పన్నకు చాలా తీవ్రజ్వరం వచ్చింది. అప్పుడు అప్పన్న భార్యపడిన ఆరాట మంతింత కాదు. అనేక దేవుళ్లకి మొక్కుకొన్నది. అతని కనేక ఉపచారాలు చేసింది. చేతిలో ఒక దమ్మిడిలేక పోయింది. పగలల్లా కూలిపనిచేసి, ఆడబ్బులో తన భర్తకి, గంజికాచి పోసేది. ఒకొక్కప్పుడు తాను పస్తుపడుకొని అతనికి పెట్టేది. అప్పన్న ఆ జబ్బులో "నువ్వు తిండితిన్నావా?" అంటే తిన్నాననేది. కాని ఆమె లోతుకి పోయినకళ్లు, చిక్కిపోతున్న శరీరంచూసి, అప్పన్న, తనభార్య తనకోసం అలా కష్టపడుతుంది అని అనుకొన్నాడు.

కాని కొన్నాళ్లకి భార్యచేసే ఉపచారాలవల్ల అప్పన్నకీ ఆరోగ్యం కలిగింది. పనిలోకికూడా వెళ్లడం ప్రారంభించాడు.

ఆతనిభార్య అయిదారు యిళ్లల్లో పాచిపని, వడ్లదంపుకి వెళ్లుతూ సాయంకాలాని కేలాగైనా కొంతడబ్బును సంపాదించుకువచ్చేది. అదిగాకపోయినా, ఆతనిభార్య ప్రతివాళ్ల విశ్వాసానికి గురి అయిపోవడంవల్ల ప్రతివాళ్లు యింటికివొచ్చి "చంద్రమ్మా! అన్నం పెడ్తారా. ఇదిగో నీకివ్వవలసిన డబ్బులు తీసుకో. ఇదిగో నువ్వు పండక్కు అడిగిన చీరె, రెవిక, ఇవ్వాళ మాయింట్లో పేరంటం. నీకు పళ్లు ఇస్తానురా. పసువు కుంకం తీసుకోని వెళ్లువుగాని." అని యీ విధంగా అనేక మంది అనేక విధాలుగా అప్పన్న భార్యని ఆదరిస్తూ ఉండేవాళ్లు.

అప్పన్నకి పాతికేళ్లు. చంద్రమ్మకి ఇరవైయేళ్లు. ఈడూ జోడూ బాగానే ఉంటుంది. వాళ్లిద్దరు ఎప్పుడుగూడ బిర్రుబుస్సలు లేక, కలియో, గంజో తమకున్నది తిని సంతోషంగా కాలం గడిపేసేస్తున్నారు. అప్పన్న శరీరచ్ఛాయ చామనచాయ. మంచి బలిష్ఠమైన శరీరంగలవాడు. ఆజానుబాహువు. కన్ను ముక్కు తీరు బాగావుంటుంది. ఇక చంద్రిమ్మ శరీరం దబ్బపండుచాయ. శరీరం చాలా పొందికగా ఉంటుంది. కన్ను, ముక్కు చాలా తీర్చినట్టుగా ఉంటాయి. చంద్రిమ్మ చాలా అందమైన మనిషి అని అంతా అంటారు. "చంద్రిమ్మ బ్రాహ్మల్లో పుట్టవలసిందిగాని కాపుల్లో పుట్టవలసింది కాదు" అని అంతా అనేవాళ్లు. అందరు అప్పన్నని చాలా అదృష్టవంతుడనేవాళ్లు. అప్పన్నకిగూడా చాలాసంతోషంగా వుండేది.

సంవత్సరం గడిచింది. చంద్రిమ్మకి ఒక మగ శిశువు కలిగాడు. అప్పుడు అప్పన్న చంద్రిమ్మల సంతోషం అపరిమితమైంది. ఆపిల్లవాణ్ణి చూసి, అందరూ దొరలపిల్లవాడిలా గున్నాడనేవాళ్లు. నిజంగా అప్పన్న చంద్రిమ్మల యొక్క అనుకూల దాంపత్యాన్ని చూసి, ప్రతివాళ్లు మెచ్చుకొనేవాళ్లు.

చంద్రిమ్మ సంపాదించిన డబ్బులో కొంత చేర్చిపెట్టింది. దాదాపు ఆరవై రూపాయలయినాయి. తనభర్త సంపాదించిన డబ్బులోగూడ మిగిల్చి కూడబెట్టి, అవి నూటపాతిక రూపాయలపై చిలుకుచేసింది. కాని ఆ సంగతి అప్పన్నకు తెలీదు. చంద్రిమ్మ కూడబెట్టి, ఒకేసారి, పెద్దమొత్తంగా భర్తకిస్తే, భర్త చాలా ఆనందిస్తాడనుకొని అప్పుడు చెప్పకుండా ఊరుకొన్నది.

అప్పన్న జబ్బుపడిన దగ్గిరనుంచి నిస్సత్తువ యేర్పడింది. అన్నం సరిగా తినడంలేదు. ఆయాసం అధికమైంది. కూలి పని చేయడానికి శక్తి లేకపోయింది. అక్కడి రెండురోజులు పనికి వెళ్లలేదు. కాని వెళ్లకపోతే సంసారం గడవడం యేలాగా అనుకొన్నాడు. పాపం తనభార్య పడే కష్టాల్ని చూస్తున్నాడు. వచ్చినదానికంటే చాల చిక్కిపోయింది. ఒకవేళ తనభార్యగూడా జబ్బులోపడితే యిక చేసేదిక్కు ఉండదనుకొన్నాడు.

పండువంటి సంసారాన్ని పాడుచేసుకొన్నా నే.

"ఇదుగో; చూడు. ఇలారా."

"పిల్లవాడికి పాలు ఇస్తున్నాను. తొందరపని యేమన్నా ఉన్నదా?"

"ఏమీలేదు. తొందరలేదు. పిల్లవాడికి పాలిచ్చిరా."

తర్వాత పిల్లవాడికి పాలుకుడిపి జోకొట్టి తర్వాత భర్త వొద్దకి వొచ్చి "ఎందుకు పిల్చారు?" అని అడిగింది. "ఇలా కూచో చెప్తా" అని పెళ్లాన్ని తనపక్కనే కూచోబెట్టుకొన్నాడు. నిజంగా వాళ్లిద్దఱప్పుడు ప్రకృతి పురుషు లనిపించారు. ఇద్దఱు ఒకళ్ల వొంక ఒకళ్లు చూసుకొన్నారు. ఇద్దఱియొక్క భావాల్ని బాగా అవగాహనం చేసుకొన్నారు.

"ఒసే అమ్మా! నువ్వు నాకోసరం యీలాగ కష్టపడడం నాకిష్టంలేదు."

"మీరు నాకోసరం కష్టపడడంలేదు."

"అది నావిధి"

"ఇదికూడా నావిధి."

"ఆహా, నీముందు పొగడడం కాదుగాని భగవంతుడు, నాకు నీవంటిభార్యని ప్రసాదించినందుకు నేనాతనికి యెంతో కృతజ్ఞుణ్ణి."

"నాకూ మీరంతే."

"అయ్యో, నాకొక్క విచారంవున్నది. ఆ విచారం నిన్నేవిధంగా సుఖపెడ్తామా అని. ఇంతవఱకు నాదగ్గిఱకి వచ్చింది మొదలుకొని కష్టమేగాని సుఖంలేదని నాకు తెలుసు. కాని నేనేంచేయగలను?"

"అదుగో మళ్లా పూర్వపు పంచాంగం యెత్తారే. ఇక ఆ విచారం వొద్దు అని చెప్పలేదూ. ఇప్పుడు మాత్రం నాకేం కొదువచేసారు? కూటికి గుడ్డకి కఱవులిచినానా?

"ఆహా, నీవంటి సుగుణవంతురాలు దొరకడం నా భాగ్యం. కాని, అమ్మా, నువ్వెఱుగవుగాని నేను మునుపటిలాగ, జబ్బుపడినప్పటినుంచి ఏమాత్రం కూలిపని చేయలేక పోతున్నాను. బరువులుమోస్తే గుండెల్లో ఆయాసం. ఏదైనా కొంచం కష్టపడితే కాళ్లు చేతులు కలువకాడలు లాగ చచ్చు పడ్తాయి. నేనేంచెయ్యను? నేను కష్టపడకపోతే కూడుగడవదు."

"మీరలా అధైర్యపడవొద్దు. మీకంత అస్వస్థతగా వుంటే మీరు విశ్రాంతి తీసుకోండి. నేను కష్టపడి పనిచేసి సంపాదించి మీకు పెడ్తాను."

"అయ్యో, ఆఖరికి నాబ్రతుకంత వ్యర్థమైనది. అదియు గాక నేను నిజంగా చెప్తున్నాను విను. నువ్వు పనిచేయడం నాకేమాత్రం యిష్టంలేదు. నువ్విప్పటికే చాలాచిక్కిపోయావు ఇంటి పనుల్తోనే నువ్వు సగం అయిపోతుంటే, ఇక బయట

పనులూచేస్తొంటే యింక నీకు శరీరారోగ్యం ఏలావుంటుంది? నువ్వూ గూడ జబ్బునపడ్డావంటే యిక మన యిద్దరికి చేసి పెట్టే దిక్కెవ్వరు ఉండరు. ఆఖరికి పసిపిల్లవాడి ఆరోగ్యం గూడా చెడిపోతుంది."

"ఔను; మీరుచెప్పినదంతా నిజమేకాని మీరుమట్టు కిటువంటి స్థితిలో ఏలా పాటుపడగలరు? నేనే మీకంటే దృఢంగావున్నాను. మీశరీరం జబ్బుపడ్డ దగ్గిరనుంచి చాలా శుష్కించివుంది. మీకింకా కొన్నిరోజులు విశ్రాంతి తీసు కొంటేనే గాని ఆరోగ్యం కుదరదు. కాబట్టి నామాటవిని, మీరు కొన్నాళ్లు పనిలోకి వెళ్లక, ఇంటిదగ్గిరే ఉండి విశ్రాంతి తీసుకోండి."

"ఓసి పిచ్చిదానా, నాకు తెలీక ఆలా అంటావుగాని నువ్వూ పనిలోకి వెళ్తే పిల్లవాడి సంగతి చాలా కష్టం అవు తుంది. కాబట్టి ముందుమనం పిల్లవాడి సంగతి ఆలోచించాలి."

ఔను; అదిగూడా నిజమే. కాని ఏంచెయ్యమంటారు?"

"నాకేమి తోచకుండావుంది. కాని ఒక్క ఆలోచన మట్టుకువుంది. కాని యేమిలాభం? అలా అయితే మన యిద్దరంగూడా అంతగా కష్టపడవలసిన అవసరం కలుగక, హాయిగా ఉంటాము."

"అదేవిటో చెప్పరు?

"చెప్పి ఏమిలాభం?

"అయినా చెప్పాదురు, వింటాను."

"అంతదాక ఉండాలెగాని, యిప్పుడు ఎవరైనా మనకి ఒక నూటయేభై రూపాయలు అప్పు ఇస్తే, వెంటనే మనం కాపురం యిక్కణ్ణుంచి లేవనెత్తి, గుడివాడకు వెళ్ళి, అక్కడ గుర్రపు బండికొని, కిరాయికి తోలడం ప్రారంభిస్తే మనకి సునాయాసంగా రోజుకి ఒకరూపాయ డబ్బులు గిట్టుబాటవుతాయి. కాని మనకా నూటయేభై రూపాయలిచ్చే దాత ఏడీ?"

"అయితే ఆలాగే చేయండి."

"ఏలా చేయడం? డబ్బెక్కడలేదూ"

"డబ్బు అది అంతట అదేవొస్తుంది"

"అదేవిటి అలా అంటావ్? ఎలా వొస్తుంది?"

"బాగానే వొస్తుంది."

"నాకాశ్చర్యంగా వుంది."

"నేనిస్తాను."

"నువ్వా!"

"ఔను. ఇవిగో"

పండువంటి సంసారాన్ని పాడుచేసుకొన్నానే.

గుడివాడలో గుఱ్ఱపు బళ్లు అప్పుడు అపురూపం. ఒంటెద్దు బళ్లే అధికంగా ఉండేవి. కాని అక్కడ గుర్రపుబళ్లు ఎక్కడం అంటే వాళ్లకి వొక గొప్ప రోల్స్‌రాయి మోటా రెక్కినట్టుగా వుండేది ఆరోజుల్లో. అప్పుడు రెండు మూడు గుర్రపుబళ్లు మాత్రమే ఉండేవి. అందులో అప్పన్న గుర్రం అంటే చాలా వొడిగాపోయేదని వాడుకైంది. ఆగుర్రం రెండు మూడు పందెములలో గెల్చింది. అప్పటినుంచి అప్పన్న గుర్రపుబండి అంటే అందఱికి యిష్టంగా ఉండేది. అసలు అప్పుడు గుర్రపుబండికి చాలా గిరాకిగా ఉండేది. అప్పన్న బండికి మఱింత గిరాకే. దానికి తగినట్టుగానే అప్పన్న బండి వాళ్లందఱికంటే చాలా నమ్మదస్తుడనీ, న్యాయంగలవాడనీ వాడుకైంది. కాబట్టి అందఱు అప్పన్న గుర్రపుబండినే యెక్కే వాళ్లు.

అప్పన్నకి రోజు ఎంతలేదన్నా గుర్రపుబండివల్ల సాయంకాలం అయ్యేటప్పటికి వచ్చుసంభావన మూడు రూపాయిలకు తక్కువగాకుండా గిట్టుతుండేవి. రాత్రిళ్లుబండి కట్టేవాడు కాడు. దానితో అప్పన్న సంసారం హాయిగా గడిచిపోతోంది.

ఒకసంవత్సర మయ్యేటప్పటికి అప్పన్నలో వొకవిధమైన వింతమార్పు కలిగింది. డబ్బు బాగా గడించడం ప్రారంభించేటప్పటికి అప్పన్న పూర్తిగా మారిపోయాడు. ఇది

వఱకు తలవెనుక రెండు పిలకలు, ముందు బోడివుండేది. ఇప్పుడదంతా బెంగాలీ క్రాపుక్రింద మారిపోయింది. పూర్వం చాలిచాలని, కాషాయి వస్త్రాల్లాగుండే ముతక పంచెను కట్టుకొని, పైనగూడ అలాంటిదే వొక కండువా వేసుకొనేవాడు. ఇప్పుడవన్నిపోయి, గ్లాస్కో మల్లులు, గ్లాస్కో చొక్కాలు, సిల్కు కండువాలు ధరించడం ప్రారంభించాడు. ఇదివఱకు పొగచుట్టలు, ఇప్పుడు సిగరెట్లు. ఇదంతా యెందుకు ఇదివఱకు అప్పన్న, యిప్పుడు అప్పారావు అయిపోయాడు.

తనభార్యకి ఏవేవోనగలు, చీరలు కొనిపెట్టాడు. కాని ఆ చంద్రిమ్మ పూర్వపు చంద్రిమ్మగానే ఉందిగాని మారలేదు. చంద్రిమ్మ, ఎప్పటి చంద్రిమ్మే. చంద్రిమ్మకి తనభర్తలో యీలాటి మార్పుకలగడం ఏమి యిష్టంలేక పోయింది. ఒకటి రెండుసార్లు గూడా చెప్పింది. కాని యిదివఱకు లాగ గాక వూరికే కసరి గొట్టేశాడు. అప్పుడు చంద్రిమ్మ మఱిమాట్లాడ లేదు.

ఈషోకులుంటే ఇతరషోకులు లేకపోతే మజా ఏంవుంది? దానిలో జీవిత సారస్య మేముంటుంది? ఇప్పుడు అప్పారావుతో చాలామంది స్నేహితులేర్పడ్డారు. వాళ్లు వొక్కనిమిషం గూడా అతణ్ణి యింట్లోవుండనివ్వరు. ఏ రాత్రిరెండు ఘంటలకో యింటికి చేరుకునేవాడు అప్పారావు. అంతవఱకు

పండువంటి సంసారాన్ని పాడుచేసుకొన్నాడే.

చంద్రమ్మ, కొడుకుని పెట్టుకొని ఒంటరిగా వుండేది. పాపం, చంద్రమ్మ "అదేమి" అని అడుగుతే, నడముకొంప నలుగ నలుగ దూషణ పంచాంగం విప్పేవాడు.

కొంతకాలంవఱకు తన భార్యకి తెలియకుండా మద్య పానం చేసేవాడు. ఇప్పుడు బాహాటంగా ప్రారంభించాడు. ఇంకేముంది? రాత్రిపూటలందు బాగా మద్యపానం చేసి, ఇంటికివొచ్చి, భార్యని హింసిస్తూ చాలా అల్లరిచేసేవాడు. ఇదివఱకా దంపతులెక్కడ వుంటున్నారా? అన్నంత నిశ్శబ్దంగా వుండేవాళ్లు. ఇప్పుడు ప్రతిరోజూ తన్నులాటలు, దెబ్బలాటలు, బూతుల పంచాంగాలు, ఏడ్పులు, పెడబొబ్బలు మొదలు పెట్టాయి.



పాపం, చంద్రమ్మకి చాలా విచారం అయి పోయింది. తన భర్త యిలా మారినందుల కెంతో ఆశ్చర్యం, విచా రం పొందింది. తను, ప్రథమమున ఆడబ్బు ఇస్తే ఆడబ్బుతో బండిగుర్రం కొనుక్కొని, హాయిగా సంపాదించు కొంటూ ఉన్న తనభర్త, దుస్సహావాసముచేత యింతచెడి

పోయినాడేమో అని మహావిచారం ఆవేశించింది. కాని తన రోజులు మంచివి కావనుకొని ఘూరుకొంది.

అప్పారావు గుణాలు ఒక్కొక్కటి జాస్తి అవుతున్నాయి. ఇదివరకు దాకా అప్పన్న అంటే చాలామంచివాడని అంతా అనుకొనేవారు. ఇప్పుడంచటికి అంత చెడ్డవాడైపోయాడు. ఇప్పుడు బండితోలడం గూడా అంతగా తలుచుతోలేవాడు కాడు. ఎప్పుడో తన యిష్టం వొచ్చినప్పుడు బండికట్టేవాడు. ఎప్పుడూ త్రాగుడేమో తన స్నేహితులేమో ఆలల్లాయిపదాలేమో,ఆజూదాలేమో అంతేగాని యింటికిగూడ సరిగా రావడం మానేశాడు. ఇంటి సంగతే కనుక్కోవడం మానేశాడు. తన పొట్ట, తన స్నేహితులేగాని పెళ్లాం, యిల్లు, బిడ్డ అన్నమాట మఱచిపోయాడు. ఇంతకుముందు, చంద్రిమ్మ తన కష్టాలు గట్టెక్కాయి అని చాలా సంతోషపడిందిగాని, యిప్పుడవన్నీ భగ్నమయినై. ఇంట్లో బియ్యంగూడా లేవు మళ్లీ తనం పనిచేయడం ప్రారంభించింది. తనం సంపాదించిన డబ్బుతో ఆలాగే, భర్తచేత తిట్లు కొట్లు పడుతూ, సంసారం గడుపుతోంది.

* * *

ఇంకేముంది? అప్పారావుపని మట్టమైంది. అన్నిచోట్ల అప్పులు పెరిగాయి. అప్పులవాళ్లు పీక్కుతింటున్నారు. స్నేహితు లేలాగైతేనేం బండీ గుఱ్రాన్ని అమ్మించేశాడు. ఇప్పు

డొక్క స్నేహితుడూ ఆతనిముఖం చూడడంలేదు. కాని యీతనికి త్రాగుడు అభ్యాసం జాస్తి అయింది. చేతిలో ఒకదమ్మిడి లేకపోయింది. త్రాగివచ్చి భార్యను, 'చంపుతా, పొడుస్తా, నరకుతా,' అంటూ బెదిరించి, చంద్రమ్మ నగలన్ని అమ్మేసి త్రాగుడిక్రింద ఖర్చుపెట్టేశాడు. ఆఖరికి చెంబు తప్పాలాలనుంచి అమ్మేశాడు. పాపం; చంద్రమ్మ భర్తకి పల్లెత్తు అయినా ఎదురాడక, కుండలలో అన్నం వండుకొని తినడం ప్రారంభించింది.

*　　　*　　　*

ఒకరోజు అప్పారావు, తప్పత్రాగి, రోడ్డుమీద అటూ ఇటూ తూలిపడ్తూ లేస్తూ యింటికి వొచ్చాడు. అప్పుడు రాత్రి పదకొండుగంట లౌతోంది. చంద్రమ్మ, వొక గోనె పఱచుకొని తన కుర్రవాడికి పాలు యిస్తూవుంది. అప్పుడు, పడ్తూ లేస్తూ వస్తూన్న తనభర్తను చూసింది. అదెందుకో కాని, చంద్రమ్మ కాతనిని చూచేటప్పటికి యిదివఱకెన్నడెఱుగని ఒకవిధమైన భయం ఆవేశించింది. వణుకుతూ, మెల్లగా లేచి నిలబడింది. బెదురుతూ తనభర్త వొంక చూసింది. కాని అప్పుడు అప్పారావు కళ్లల్లో ఒకవిధమైన క్రూరత్వం, కర్కశత్వం కనబడింది. అదిచూసి, మఱింత భయపడింది. అలా భయపడ్తూ, మెల్లగా "భోజనం చేస్తారా?" అని అడిగింది. కాని అప్పారావు జబాబుచెప్పలేదు. పళ్లు పటపట కొఱికాడు

లోపలికివచ్చి తలుపు గడియవేశాడు. చంద్రిమ్మ వొంక ఉఱిమిచూస్తూ, మెల్లగా సమీపిస్తున్నాడు. అప్పుడు చంద్రిమ్మ భయంతో వెనక్కి వొదిగింది.

"నాకిప్పుడు పదిరూపాయలు కావాలి." అని గర్జించి అడిగాడు అప్పారావు.

చంద్రిమ్మ భయంతో వొణుకుతూ "నాదగ్గిర ఏమీ లేదే" అంది.

"ఇస్తావా? చస్తావా?" ఈ మాటకి చంద్రిమ్మ మఱింత భయపడింది. కాని యేమిచేస్తుంది! బలవంతాన ధైర్యాన్ని తెచ్చుకొని "నాదగ్గిరలేదు" అని అంది. అప్పుడు అప్పారావు గ్రుడ్డై, ఉన్నటులుండి, హఠాత్తుగ తన మొల నుండు చాకుతీసి, చంద్రిమ్మపైకి విసిరాడు. దానికి చంద్రిమ్మ "అమ్మో" అని ఒక పెద్దకేక వేసింది, క్రిందపడిపోయింది.

ఆకేకవిని ఊళ్లోవుండే జనం అంతావొచ్చి తలుపులు బ్రద్దలుకొట్టి లోపలికి పోయిచూశారు. పాపం; చంద్రిమ్మ రక్తకొట్ల మద్యపడివుంది. పక్కనే కత్తిపడివుంది. కాని అప్పారావు పారిపోయాడు.

*　　　　*　　　　*

తర్వాత పోలీసులు, అతనిని పట్టుకొన్నారు. చంద్రిమ్మకి కత్తిపోటు డొక్కలో తగిలి రక్తం వొచ్చిందిగాని మళ్లీ

పండువంటి సంసారాన్ని పాడుచేసుకొన్నానే.

హాస్పిటలు మందువల్ల ఆగాయం నెమ్మదించింది. చంద్రమ్మ చావకుండుటను, అప్పారావు తాగివున్నప్పుడు కొట్టివుండడం వల్లను అతనికి ఒకటిన్నర సంవత్సరము కఠినశిక్ష మాత్రమే విధింపబడెను. అప్పుడు జైలులో సంకెళ్లు తగిలించుకొని, కూర్చుండి, పిచ్చివాడిలాగ "పండు వంటి సంసారాన్ని పాడు చేసుకొన్నానే" అని యేడ్చేవాడు అప్పన్న.



# ౪

"సంసారమ్, సాగరమ్, దుఃఖమ్"

"మహాత్మా, మీరు జితేంద్రియులు, ధీమంతులు. ఈలోకమున నుండియు నీలోకముయొక్క తాపత్రయములు మిమ్ములను బొందకున్నవి. ఇట్టి యాత్మశక్తి మీకెట్లు లవడి నది? నేనీసంసార సాగరమునబడి, శ్లేష్మమున బడ్డ యీగవలె నటునిటు పొరలాడుచు, దినక్రమమున క్రుంగి పోవుచుంటిని. నేనెంత సంపాదించినను, నేనెంతటి మన్ననల నీలోకమున బడసి నను, నాతల్లి దండ్రులు, నాభార్య వీరందఱు నన్నెంత ప్రేమించు చున్నను ఇంకను నామనంబునం దేదియో కొఱంతను గల్గి ఉన్నట్లొక విధమగు ననుతాపమున ప్రతిదినము నాఆత్మ నాలో రేపుచున్నది. నాకెప్పుడును పెద్దల వాక్యమగు "సంసారం, సాగరం, దుఃఖం తస్మాత్ జాగ్రత, జాగ్రత" అన్న శ్లోకము స్మృతిపథమునకు వచ్చుచుండును. కాని నిజముగా నాకీశ్లోక మునకు ప్రతి పదార్థముగాక, లక్ష్యసమన్వితమగు నుదాహరణ ముల నరయవలయునని యెంతయోకలదు. కావున నా యందు దయ యుంచి తమకేదైన యొక యుపాయాంతరము దోచినచో నాకది యనుగ్రహింపుడు. దానివలన, నేనీశ్లోకము

రయొక్క అంతరార్థమును గనుగొని, తద్ద్వారా వేదాంతార్థమును గ్రహించి జీవన్ముక్తికి సాధనాంతరము నన్వేషింపగలుగుదును."



"పుత్రా! నీ మోఘము, ఇంతటి చిన్న వయస్సులో నింతటి జీవన్ముక్తికై పరామర్శింప బూనుట యెంతయు నాశ్చర్యము. నీవు పవిత్రమైన పరిశుద్ధాత్మను గలవాడవు. కావుననే నీహృదయమింత త్వరలో పరిపక్వస్థితికి రాగలిగినది. ఇకనీవు ధన్యుడవు. పూర్వజన్మ సుకృతముచేత నీవిజ్ఞానమును బొంద గలిగితివి. నీయందు దైవము కృపజూపుచున్నాడు. కొలది రోజులలోనే నీవాతని దివ్య తేజస్సును బొందకలుగుదువు. ఇది ముమ్మాటికిని తథ్యము."

"మహాశయా! ఎంతటివానికైనను గురుముఖతః గాని అంతగ. అనుభవ విజ్ఞానము గలుగదని నానమ్మకము. కావున నాకేదియైన సాధనాంతరమును గన్పఱుపవలయును."

"పుత్రా! భగవానుడే నీకు గురువగును. నీయంతరాత్మ ప్రబోధించిన తెఱుగున వర్తించినయెడల నీకంతయు విశదపడును. నీ అంతరాత్మయే నీకు గురువు. అయినను

నీవు నన్నడిగితివి గావున నాకుతోచిన తెలుంగున కొన్ని సూచనలు గావించు చున్నాను. వానిని నీవాచరించినచో నీకు వేదాంతార్థము సుగోచరమగునని నావిశ్వాసము."

"ధన్యోస్మి"

"నేను చెప్పబోవు యీక్రింది వాక్యములు తొలుత నీవాచరణలో బెట్టినచో, అప్పుడే నీకాశ్లోకముయొక్క అంతరార్థము సుగోచరముకాగలదు.

1. ఆర్జించినప్పుడే తండ్రి.
2. ఆర్జించినను, ఆర్జింపకున్నను తల్లి.
3. నిర్ధనుడైనచో "తోబుట్టువు నావాడుకాడ"నును.
4. భార్య ప్రాణఘాతకి.
5. స్నేహితుడు ప్రాణదాత.

ఈపై నుదహరింపబడిన యైదువాక్యముల యొక్క అంతరార్థమును నీవు గ్రహింపగలుగుటకు నీవువానిని ఆచరణలోబెట్టి లక్ష్యసమన్వితములుగ నొనర్పవలయును. అవి లక్ష్యసమన్వితములయినచో నానాడే నీకు సత్యసాక్షాత్కారమగును. ఇంతకంటె ప్రస్తుతము నేనేమియు జెప్పజాలను. నీవు వీనిని లక్ష్యసమన్వితములుగ జేసిన మఱునాడే నేను

నీకు గనబడుదును. అప్పుడు నీకు గొంత తత్త్వోపదేశ మొన రించెదను. కావున నేనిక బోవుచుంటిని. ఇకమీాద నన్ను ప్రశ్నలచే జంపకుము."

అని ఆసన్యాసి, ఆకాషాయాంబరములతో ఆకొండపై నుండి దిగి, అర్ధనిమీాలిత నేత్రుండై, ఆనందపారవశ్యముచేత, చిందులు ద్రొక్కుకొనుచు, తన మధురకంఠ, స్వరముచే నీరీతిగ, తన తంబూరాను మీాటుచు నాయడవిలో నెచ్చటికో పోవుచుండెను.

"ఎన్నాళ్లు బ్రతికిన, ఏమినాబ్రమాజ్యమే
కొన్నాళ్లకో రామచిలుకా,
మూన్నాళ్ల ముచ్చటకే మురిసేవు త్రుళ్లావు
ముందుగతి కానదో చిలుకా ఎన్నాళ్లు॥

ఇల్లు, ఇల్లనియేవు, ఇల్లు నాదనియేవు
ఇల్లు నీకేడనే చిలుకా
ఊరికి యుత్తరాన సమాధిపురములో
కట్టె యిల్లున్నదే చిలుకా ఎన్నాళ్లు॥

కర్రలే బంధుగులు, కట్టెలే చుట్టాలు
కన్నతల్లె వ్వరే చిలుకా............"

ఆతరువాతి చరణములు ఆనంద తన్మయత్వంచేత

నిశ్చేష్టుడైన సుధీరునికి వినబడలేదు. ఆ సన్యాసియొక్క తంబూరా స్వరంతో మిళితమై చల్లగావచ్చుచున్న ఆమధుర గానంలో విలీనమై, సుధీరుడానందముతో గూడిన విచార జనిత నిరాశాసూచక బాష్పజలముల నప్రయత్నముగ, నేల పైని జలజల రాల్చెను. ఆ సన్యాసితో ఆగానము అదృశ్య మైనది. సుధీరుడులిక్కిపడి, అనేకవిధములు ఆ సన్యాసిని గుఱించి, ఆసన్యాసి చెప్పిన అయిదు వాక్యములను గుఱించి, తదుపరి ఆమధురగానమును గుఱించి తదేక ధ్యానముతో దలచుకొని, తలచుకొని పిమ్మట మెల్లగా యింటికి జేరెను.

* * * *

సుధీరుని తల్లి తండ్రు లాంధ్రులైనను, అతని తండ్రిగారు కలకత్తాలో కొంతకాలము భార్యా సహిత ముగ నుద్యోగరీత్యానున్నప్పు డచ్చట జన్మించియుండు టచే నప్పుడు అచ్చటి సంప్రదాయానుసారముగ సుధీర కుమార్ అని నామకరణ మొనర్చిరి. అతని తలి దండ్రులు కొంతవఱకు సంస్కరణాభిలాషులను, నవనాగరకాభిమాను లగుటచేత వారి యుడుపులుగూడ బెంగాలి పద్ధతినేయుండును. వారిప్పుడాంధ్ర దేశమునందున్నను వారిని జూచినవారందఱు బెంగాలీలనియే యనుకొందురు. వారికి బెంగాలీలనిపించు కొనుటయే సమ్మతము. ఈ సుధీరునకు బొసంతిని అని

చెల్లెలు గలదు. అసలాంధ్రమున వసంతిని యని యర్థము. ఇక నా బొసంతిని కట్టుగుడ్డల దగ్గఱనుంచి ప్రతి విషయములోను బెంగాలి యువతివలెనే యుండును. ఇప్పుడాంధ్ర దేశములో నున్నను తన భర్తనుగూడ బెంగాలీ యువకునిగ మార్చ గలిగెను. తల్లి దండ్రులకు సుధీరకుమారుని పైనికంటే బొసంతిసీ పైననే యెక్కువ ప్రేమ. ఏలయన, సుధీరకుమారునకు ననుకరణమన్న యెంతయు నేవగించు కొనువాడు. తన తల్లి దండ్రులయొక్క పద్ధతి, తన చెల్లెలియొక్క పద్ధతి యాతని కేమాత్రము సరిపడక పోయెను. ఆతనికి తల్లి దండ్రులు వారి కిష్టమగు రీతినే నవనాగరకపు సుగంధముతో గూడియుండు యువతినే యిచ్చి వివాహము జేసిరి. అది యెంతమాత్రము సుధీరకుమారున కిష్టము లేకపోయెను. అనేకసారులు తన భార్యబుద్ధిని మరల్ప బ్రయత్నించెను. కాని విఫలుడయ్యెను. అడకువలేని స్త్రీలను జూచిన ఆతడేవగించు కొనుచుండెడివాడు. ఈ నవనాగరకపు నారీమణులయొక్క విఱ్ఱవీగుట, ఠీకు టాకులు, సంభాషణలు, భేషజములు, పయెట తొలగిపోవుట యెఱుగకుండుట, పరపురుషులతో సంభాషణలు అతనికి తల కాయ నొప్పి అనిపించును. కాని యీరీతిగనే తనయింటిలో, తన తల్లితప్ప, తక్కినవారందఱును ప్రవర్తించుచుండువారు. ఒకరోజు తన తల్లితో నవనాగరకపు మోహ్యాను, వ్యక్తిత్వ మును నశింపజేసుకొనుటను గూర్చియు, గ్రుడ్డియను కరణ

మును గూర్చియు నొకపెద్ద గంభీరోపన్యాస మొసంగ నప్పు డామె "ఓయి, వెర్రివాడా, నాకివియన్నియు దెలియకగాదు. మీతండ్రిగారికి భయపడి, మీతండ్రిగారి యిచ్ఛానువర్తినై నేనీరీతిగ సంచరింపవలసి వచ్చినది. అందులకు నేనెంతయు జింతించుచుంటిని. నీకంటె వేయిరెట్లుగ నాకీయనుకరణము చాలా బాధకరముగనున్నది. అయినను విధిలేదు." అని ప్రత్యుత్తర మొసంగెను, కాని సుధీరకొమారుడు మాత్రము వ్యక్తిత్వమును జాపుకొనక తన యాంధ్ర వ్యక్తిత్వమును భూషణములందేమి, ఉడుపులయందేమి, చేతలయందేమి, ప్రతివిషయములందును గన్పఱచెడివాడు. కాని తండ్రియు, సోదరియు, భార్యయు నాతనిని 'పల్లెటూరి గబ్బిలాయ' అని పరిహసింపసాగిరి. కాని యతడేమియు తన వ్యక్తిత్వమును విడలేదు. ఆతనిలో నొకవిధమగు ప్రశాంత స్వభావముగలదు. ఆతడు మితభాషణత్వము, శాంతము, నిరాడంబర జీవితము, సత్యపరిపాలన, ధర్మపరిపాలన, వీనిని గుఱించి యెప్పుడును చింతన చేయుచునుండువాడు. ఎప్పుడు వేదాంతగోష్ఠి, దైవ చింతనముతప్ప యింకొక వినోదమేమియు నెఱుగడు.

ప్రజలందఱు నాతనిని మహాపురుషుడని తలంచెడివారు. ఇంటిలోనివారు మాత్రము పిచ్చివాడని పరిహసించెడివారు. ప్రతిరోజు సాయంకాలము ఆఫీసునుండి రాగానే తన ఆఫీసు

యుడుపులను తీసివేసి నిరాడంబరమగు నుడుపులను ధరించి, దేవాలయమునకు బోయి యచ్చట భజనలలో బాల్గొను చునానందోన్మత్తతచే బాడుచుండువాడు. కాని యితడు బీ. ఏ. ప్యాసుచేసినను పొరబాటుకు గూడ నొక యింగ్లీషు ముక్క నోటివెంబడి రానిచ్చెడివాడు కాడు. అతనికి యింపీరియల్ బ్యాంకులో మేనేజరు పదవి లభించెను. మాసమునకు రెండువందల యేబది రూప్యముల వేతనము గడింప బ్రారంభించెను. అప్పుడు తల్లిదండ్రులయొక్కయు, సోదరి యొక్కయు, భార్యయొక్కయు ప్రేమాదరణములు వర్ణనాతీతములయ్యెను. అప్పుడాతనిని యిదివఱకువలె పరిహాసింపక యెంతో అనుగు ముసుగులొత్తుచు "నాకొడుకు, నా అన్న, నా భర్త' అని తండ్రితోబుట్టువు భార్య వీరుమగ్గురును ఎంతో అతనిని ఆదరింపసాగిరి. తల్లి మాత్రము మామూలుగానే ప్రేమాతిశయమును గనపఱచుచుండెను. వీనినన్నిటిని సుధీర కుమారుడు చూచుచునే యున్నాడు. కాని యెప్పటి రీతిగనే యతడు మెలగుచుండెను. ఆతనికి తల్లియెడల మాత్రమ వ్యాజానురాగ ముదయించినది. తక్కినవారికివలె తల్లి తన నిదివఱకంటె ముఖస్తుతి యేమియు జేయుటలేదు. తండ్రి మాత్రము 'తనకొడుకింతవా డంతవాడని వేయినోళ్ల బొగడుచు పదిమందితో జాటుచుండువాడు. సోదరి, తన భర్తతో "మా అన్నయ్య, మా అన్నయ్య యనుచు సోదరునియొక్క

గొప్పతనమును గుఱించి పొగడుచుండెడిది. భార్య అడుగు మడుగులొత్తుచు నుపచారములు చేయుచుండెడంగును. నిజముగా నిప్పుడు సుధీరకుమారు డాయింటిలో యింద్రభోగ మనుభ వించుచుండెను. కాని యతనిలో మాత్రము పూర్వముకంటె యెంతమాత్రమును మార్పు కానరాకపోయెను. రాను రాను అతనియొక్క భజనలు, వేదాంతగోష్ఠి, పిచ్చియుకుపులు అధిక ము కాజొచ్చెను. కాని తండ్రిమాత్రము వాటికేమియు పల్లెత్తు మాటయైనను ఆడలేదు. పైపెచ్చు అతని నెంతయో పొగడుచుండువాడు. సుధీరుడంతవాడు లేడని చెప్పుచుండు వాడు. ఇదియంతయు సుధీరునకొక నాటకమువలెగాని పించుచుండెను. తన మనస్సులో తాను తలచుకొని నవ్వుచు నుండెడివాడు.

ఇప్పుడు భార్య తానుచెప్పిన చొప్పున కుక్కిన పేను లాగున బడియుండి నడచుకొను చుండెను. ఆతని నెంతయో ప్రేమను తొలుకాడ జేయుచు పిలిచెడిది. ఆతని కొఱకై తన ప్రాణమును బలియిచ్చుటకు సంసిద్ధురాలనని పల్కుచుండెను. "ప్రియా, ప్రాణేశ్వరా" మొదలైన ప్రేమపూరిత సంబోధనలు అధికమై పోయినవి. వేయేల ప్రబంధములలోను, నవలలోను వివరింపబడిన నాయికవలెనే ఆమెగూడ నటించుట ప్రారం భించెను. ఆవిరహతాపము ఆదుస్సహావియోగ దుఃఖాశ్రు

వులు అచ్చొత్తినట్టుగా ఆ దమయంతివే, ఆ సీతవే; ఆద్రౌపదియే, ఆహా, సుధీరకుమారుడట్టి సహధర్మ చారిణిని గలి యుండుట కెంతటి ధన్యుడోగదా. సుధీరకుమారుడు తన ప్రాణసతి, తన జీవితసర్వస్వము. ఆతనికొఱకు తాను తన ప్రాణములను గూడ బలియివ్వగల యెట్టి సాధ్వి సుధీరకుమారుని యొక్క ధర్మపత్ని.

కాని సుధీరకుమారుని పిచ్చిమాత్రము కుదురలేదు. ఇదంతయు మాయ అనుకొనెను. "ఆహా, నేనిదివఱకు వీరల కెందుకు కొఱగానివాడనిప్పుడు ఉద్యోగము చేయుచు ధనము నార్జింప బ్రారంభింపగనే వారికి నాపైన నింతటి యపార ప్రేమ ముదయించెను. ఆహా! ఏమీ యీ జగన్నాటక విచిత్రము." అని తనలో తానాశ్చర్యపడెను. ప్రతిదినము ఈ చిత్రమును గుఱించి యాలోచన పొడమెను."

ఒకరోజు రాత్రి ఒంటరిగ తన శయ్యపైన గూర్చుండి దీర్ఘాలోచన గావించు చుండెను. అప్పుడున్నటులుండి యాతనికి తటిల్లతవలె యొక భావము తట్టెను. వెంటనే అతని విశాలనేత్రములు కాంతి వంతములాయెను. శరీరము పులకాంకురమాయెను. ఆతని అందమైన ముఖము వికసించి, మఱింత శోభను గూర్చెను. అసలతడు సహజముగ చాలా అందమైనవాడు. అప్పుడతని సౌందర్యము ఇనుమడించినది.

వెంటనే మంచముపైనుండి దిగ్గునలేచి, సంతోషముతో దనలో "సంసారమ్, సాగరమ్, దుఃఖమ్; తస్మాత్ జాగ్రత, జాగ్రత" అని అనేకసార్లు మననము చేసికొనెను.

మఱునాడు యథాప్రకారముగ తన కాలోచిత కృత్యములన్నియు దీర్చుకొని, తర్వాత భోజనముచేసి, మామూలు ప్రకారము ఆఫీసుకుపోయి, తిరిగి సాయంకాలము ఇంటికి వచ్చెను. తర్వాత తన నిరాడంబర మగు నుడుపులలో, అక్కడికి సమీపమునందే యున్నయొక చిన్న కొండకడకు బోయెను. ఆకొండపైన శిథిలమైన గుడి గోపురమొకటి యుండెను. అదిచూచుటకై దాని నెక్కెను. అప్పుడు నలుదిక్కులు కలయచూడగా అక్కడ యొక సన్యాసి అపర శివావతారమువలె కనబడెను. అప్పుడతడు ముకుళిత నేత్రుడై యీశ్వరధ్యానమును గావించుచుండెను. అతడు కొంచెము నేత్రములు విప్పిచూచు సరికి తనపాదములపై వ్రాలియున్న మన సుధీరునిగాంచి, అపరిమితానందముతో లేవనెత్తి, ఆశీర్వదించెను. పిమ్మట ఆ సన్యాసిని కొంత స్తుతించిన మీదట "సంసారమ్, సాగరమ్, దుఃఖమ్, తస్మాత్ జాగ్రత జాగ్రత" అను శ్లోకమును చదివి దీనియొక్క అంతరార్థమును గనుగొనుట కుపాయాంతర మడిగెను. అప్పుడా సన్యాసి, యతని యొక్క భక్తికి చాలామెచ్చుకొని, వెనుక చెప్పబడిన నైదు

వాక్యములను సూచించి, తాను తంబురా మీటుకొనుచు, పాడుకొనుచు నంతర్హితుడయ్యెను. అప్పుడాపాటను విని తన్మయత్వమును జెంది, సుధీరుడు" స్వగృహాభిముఖుడై, ఆ రాత్రియంతయు నాయైదు వాక్యముల నేరీతిగ లక్ష్యసమన్విత మొనర్చుడమా యని తలపోయ సాగెను.

మఱునాడు యథాప్రకార మాఫీసునకు బోయి, తన యొక్క మేనేజరు పదవికి రాజినామా పెట్టి, ఇంటికిపచ్చి పరుండెను. అప్పుడు తండ్రి వచ్చి "ఏమినాయనా, ఆఫీసుకు వెళ్లలేదేమి" అని ప్రశ్నించెను గాని సుధీరునుండి సంతృప్తి కరమగు ప్రత్యుత్తరమేమియు రాలేదు. అందువలన తండ్రి, ఆతనికస్వస్థముగ నుండెనేమోయని యనుకొనెను. తల్లి వచ్చి "ఏమి నాయినా, పరుంటివేల? ఏమైన తలకాయ నొప్పి, జ్వర ముగ నున్నదా? ఏదైన యౌషధము నిచ్చెదను లెమ్ము. కొంచెము చారు అన్నము మాత్రముతినుము." అని తన మాతృప్రేమ సుధీవర్షమును ఆతనిపైన గురిపించెను. దాని కాతని మనస్సెంత యుతృప్తియాయెను. భార్య "ఆఫీసుకు వెళ్లలేదా?" అని అడిగెను. కాని సుధీరకుమారుడు ఎవరికిని సరియైన ప్రత్యుత్తర మొసంగలేదు. తల్లి యతనిని చంటి బిడ్డవలె యాదరించి, అన్నమును తినిపించెను. తండ్రి ఏమియు నమగలేదు. భార్య, "తమలపాకులు తీసుకురానా?" అని

యడిగెను. ఇవియన్నియు జూచి, యతడు మౌనవ్రతు డాయెను. * * * *

మఱునాడు గూడ ఆఫీసుకు వెళ్లలేదు. తండ్రి యథా ప్రకారముగ నడిగెను. కాని జవాబుచెప్పలేదు. విసుగు కొంటూ తండ్రి ఆఫీసుకుపోయి సుధీరుయొక్క రెజిగ్నేషను ఉత్తరము సంగతి విని యత్యాగ్రహముతో నిప్పులు గ్రక్కు చు వచ్చి, సుధీరునిచూచి "ఏమిరా, ఏలనీవు రిజగ్నేషను పెట్టితివి?" అని అడిగెను. అప్పుడు సుధీరు "నాకు పని చేయుట యిష్టములేదు." అని నెమ్మదిగా చెప్పెను. దానితో నాజ్యము బోసిన నగ్నివలె మండిపడుచు నాతని తండ్రి యతని ని యనేకవిధముల దూలనాడుచు "ఛీ, అవతలకుపొమ్ము. నాకడుపున చెడబుట్టితివి. ఇంతవఱకు నిన్ను పెంచి పెద్దవాడను గావించినందుకుగాను ద్రోహివైతివి. ఇక నీవీక్షణముననే నా యింటినుండి, నీభార్యతోగూడ వెడలిపొమ్ము" అని కసరినాడు.



అప్పుడు సుధీరు మరు మాటాడక భార్యతో "నేనిప్పుడేయింటనుండను. నాకిప్పుడుద్యోగమేమియు చేయుట కిష్టములేదు. అక్కడక్కడ భిక్షమెత్తు కొని పుణ్యక్షేత్రముల

సందర్శించుకొనుచు కాలమును బుచ్చెదను. నీవు నాతోడ నట్టి కష్టములను బడజాలవు కావున నీవు నీపుట్టింటికి బోయెదవా?" అని యడిగెను. అప్పుడు పాపమాయిల్లాలు భర్త యెడబాటు కోర్వలేక సంతతధారగా కన్నీరు మున్నారుగా గార్చుచు "నేను మిమ్ములను వదలను. మనమిరువురము పోయి మాపుట్టింటనే యుందము. నా తల్లిదండ్రులు మనల నిద్దఱును ఆదరింతురు." అనెను. ఈమాటలను విని యాతడు "అట్లుకాదు. ప్రస్తుతము నీవు మీయింటి యొద్దనేయుండుము. నేను క్షేత్రములన్నియు దిరిగివచ్చి నిన్ను జేరుకొందును. దాని కెట్టకేల కతనిభార్య యొప్పుకొనెను.

తర్వాత సుధీరకుమారుడు, తల్లికడకుబోయి, నమస్కరించి, "అమ్మా, నేను పోయివత్తును." అని చెప్పెను. అప్పుడు తల్లియొక్క దుఃఖమాగలేదు. ఒక్కసారి తన రెండుచేతులతో ఆతని కంఠమును బట్టుకొని "నాయనా, సుధీరా," అని యేడ్చెను. అప్పుడు తల్లిదుఃఖము జూచి, సుధీరునకుగూడ దుఃఖాశ్రువు లొకటి రెండు ఒలికెను గాని, వానిని అణిచివేసి, ఆమెను ఓదార్చెను. కాని ఆమె దుఃఖమాగలేదు. "సుధీరా, భోజనము చేసిపొమ్ము." అని మెంతో బ్రతిమాలెను. అప్పుడు సుధీరుడు "అమ్మా, నాకు భోజనమక్కఱలేదు. నేనీరాత్రి యీవూరిలోని సత్రమున

బరుండి తెల్లవారుఝామువనే పయనమై యెచ్చటికేని పోయె దను." అని చెప్పెను. ఆమాటలకు తల్లి దుఃఖము వర్ణింప దరముగాదు. కాని యెట్టకేలకు సుధీరుడామెకు ధైర్యము చెప్పి, తన భార్యను పుట్టినింటి కాక్షణముననే పంపివైచి, తానా యిల్లును వదలెను.

* * * *

రాత్రి పండ్రెండుగంటలాయెను. మేఘము లావరించి, మెఱుపులు మెఱయుచు, నుఱుము లుఱుముచు తుషారము ప్రారంభమైనది. ఆయూరి సత్రపు టరుగుమీద సుధీర కుమారుడు కూర్చొని, కాషాయ వస్త్రధారుడై చలినిగూడ లెక్క చేయక, తదేక నిష్ఠలో భగవంతుని ప్రార్థించు చున్నాడు.



ఇట్లుండగా నింతలో నతనికా అంధకారములో "సుధీరా" అను పిలుపు వినబడినది. అప్పుడాత డాశ్చర్య ముతో ఆపిలుపు వచ్చిన వంక బరికించుచు "ఎవరు నన్ను బిల్చునది?" అని పలికెను. "నాయనా, యెక్కడయుంటివి!"

అని అనెను. అప్పుడతని హృదయము ద్రవించెను. ఒక్క సారి ఆతని నేత్రముల శ్రుపూరితములయ్యెను. కాని బలవంతమున నాపుకొని "అమ్మా" అని పిలిచెను. అప్పుడు "సుధీరా" అని పిలుచుచు తల్లి తన నెత్తిపైన సుధీరునకాహారమును గొనివచ్చెను. అప్పుడు తల్లికొడుకుల కొకరిపై నొకరి కుండు ప్రేమకు చెప్పతరముగాదు. అయిదు నిమిషముల వరకు మాటలేక యొకరికొకరు వాచిపోయిన కండ్లతో జూచుకొనుచు ప్రతిమలైరి. తర్వాత సుధీరు తల్లికి అనేక విధములుగ ధైర్యముచెప్పి, ఆమె తెచ్చిన భోజనమారగించి, ఆమెను యింటికి పంపివైచి "ఆహా, తల్లికంటె అమూల్యమైన వస్తువీప్రపంచమున లేదనుకొనియెను. "నేను సంపాదించనందుకు తండ్రి వెళ్లగొట్టినాడు గాని, తల్లి ఆదరించినది. ఆహా, ఆ సన్యాసి చెప్పినట్లు ఇప్పుడు నేను రెండు వాక్యములను నేర్చుకొంటిని. ఇక చెల్లెలును పరిక్షింపవలయును." అని అనుకొని, యారాత్రికా సత్రములోనే యుండి, మఱునాటి వేకువజామున నందుండి యెచ్చటికో పయనమైపోయెను.

*　　　*　　　*　　　*

పదినెలలైనది. ఒకరోజు ఒక మేడయింటిముందు పెద్దగడ్డము, జడలు అల్లుకొన్న వెంట్రుకలు, శరీరమంతయు విభూతి పూసుకొని, ఒక సన్యాసి, ఒకచేత కట్టెయు వేఱొక చేత జోలెయు పట్టుకొని "అమ్మా" అని కేకవేసెను.

అప్పుడాయింటి యజమానురాలు విసుగుకొంటూ "ఎవరు వారు?" అని బయటికి వచ్చెను. అప్పుడా భిక్షువు, ఉన్నటు లుండి, "వసంతా" అని పిలిచెను. అప్పుడు భయాశ్చర్య ములతో బాసంతిని "ఎవరు నీవు?" అనినది.



"గుర్తింపలేవా? నీ అన్నను; సుధీరుడను" "ఏమి! నీవా! ఏల యిట్లయితివి?" "నాకర్మ వశమున. అదిసరికాని యీరాత్రికిట విశ్రమింతును. మఱునాడుదయమునసే కాశీకి బోయెదను. దీనికి సమ్మతింతువా?" "నేనైన సమ్మతింతును గాని, నాభర్తచూచిన నన్నును, నిన్నును చంపి వేయును. కావున నీవిందుండ తగదు. ఆయనవచ్చు వేళ అయినది: వెంటనే వెడలిపొమ్ము. లేకున్న చాలా కష్టపడ వలసియుండును."

"మంచిది; చెల్లీ" అని వెడలిపోవుచు, సంతోషముతో సన్యాసి చెప్పిన మూడవ వాక్యమును స్మరించుకొనెను.

* * * *

మరల కొన్నిదినముల తర్వాత సుధీరకుమారుడు ఆ సన్యాసి వేషముతో, కాషాయాంబరధారియై, అత్తవారి యూ

రకు వెళ్లెను. అపుడు మధ్యాహ్నము పండ్రెండుగంటలకు ఒక ఎత్తైన యరుగుగల డాబాయింటిని సమీపించి, బంధించియున్న కవాటమును దట్టెను. అప్పుడు లోపలనుండి యొకస్త్రీ వ్యక్తి "ఎవరువారు?" అని గద్దించుచు నడిగెను.

"తలుపు తీయుము"

"తలుపుదీయుటకు వీలులేదు. మీరెవరో చెప్పుడు."

"తలుపుదీసినచో దెలియగలదు."




అప్పుడు రౌద్రముతో గభాలుమని తలుపులు తెరవబడెను. సన్యాసి మాత్రము చలింపలేదు. అప్పుడొక నల్లని ఇరువది యెనిమిది ఏండ్ల వయస్సుగల యువకుడు, సిల్కు దాల్చి, సిల్కు వస్త్రములను ధరించి, పదివ్రేళ్లకు పదిరవ్వ యుంగరములనుబెట్టి, చెవులకు చిన్న యేడురాళ్ల అంటుజోళ్లను దాల్చి, చేతికి బంగారు రిస్టువాచిని ధరించి, చేతనొక దండమును ధరించి, క్రోధముతో పండ్లు పెట పెట కొరుకుచు "ఓరీ నీవెవడవు? నీకు బుద్ధిలేదా? వేళ కాని వేళ నీకు భిక్షమేమి? ఈదొంగ సన్యాసి వేషమును ధరించివచ్చిన భిక్షము

వేసెదరనుకొంటివా? అవలకు పొమ్ము, లేకున్న నీకు దండ ప్రయోగము తప్పదు" అని గర్జించెను. వెనుక నొక యిరువది యేండ్ల వయస్సుగల యువతి, దబ్బ పండువంటి శరీరచ్ఛాయ, మంచి నగలను ధరించి, సిల్కు చీరెను ధరించి, విలాసముగా సన్యాసిని కోపగించుచున్న యువకుని హస్తమును బట్టి, చిరు నగవుతో, వెనుకకు లాగుచు "ఆసన్యాసితో నేమి, నీవు లోనికిరమ్ము, పండుకొందము." అని అనెను. వెంటనే అంతవఱకు ప్రశాంతవదనముతో నున్న యీసన్యాసి, యీ నారీమణి ముఖమునుగాంచి, యాశ్చర్య చమకితుడై, యాస్త్రీనుద్దేశించి "ఇదిగో, యిట్లుచూడుము. నేనెవడనో యిప్పుడు బోధపడినదా?" అని యడిగెను. ఆయువతి సన్యాసిని జూచి యబ్బురపడి, తన విటునికి సైగచేసెను. వెంటనే ఆ యువకు డాసన్యాసిని తన దండముతో వెనుకకు ద్రోసి తలుపును మూసివైచెను. ఆసన్యాసి నిర్ఘాంతపడి ఆయింటి యరుగుపైననే సాయంకాలమువఱకు గూర్చుండియుండెను.

ఆతడు కూర్చొని యుండుటను గాంచి, యాయువతి తన విటునితో "అదుగో, చూడుడు; వాడింకను గూర్చొని యున్నాడు. ఆతడే నాభర్త. ఇన్నినాళ్లనుండియు మన యిరువురనుభవించు సౌఖ్యమున కంతరాయము గల్పింప నున్నాడు. మఱియేది సాధనము?" అని చెప్పెను. అప్పు

డతడు "నీకేమియు భయములేదు. ఆతనిని సునాయాస ముగా దాటింగించెదను" అని చెప్పి యాపెను సంతోష పెట్టెను.

*　　　　*　　　　*

రాత్రి పదిగంటలు, అమావాస్య చీకటి. ఆప్రదేశము పూరి బయలు. అచ్చటచ్చట అప్పుడప్పుడు సమీపగ్రామములకు బోవుచు, వచ్చుచునుండు బండియెద్దుల యొక్క కిణకిణా రావములు తప్ప, మఱి మనుష్య సంచారములేదు. అట్టి తరుణమున ఆప్రదేశమునుండి "రక్షింపుడు, రక్షింపుడు" అను నార్తనాదమువినవచ్చెను. పాపమా వ్యక్తి యదృష్ట వంతుడు కాబోలును. అప్పుడే యామార్గము గుండా, మువ్వల చప్పుడు కూడా లేకుండా యొక బండి పోవుచుండెను. ఈ



యార్తనాదము విని యాబండివాడు ఆబండిలోనున్న యుద్దలు ఆసాములు చేత దండములను ధరించి, బండిని దిగ్గనుఱికి యాదెసకుబోయిరి. పాపమొక బాటసారి దొంగలచేత దెబ్బలుతిని, నేలపైన స్మృతితప్పి పడియుండెను. అప్పుడు వారిద్దఱును అతనిని లేవదీసి బండివాని సహాయమున తమ

బండిలోనికి జేర్చిరి. వారిరువురిలో నొకడు యువకుడు. మఱియొకడు వృద్ధుడు. వీరిద్దఱును తండ్రి కొడుకులు; వ్యాపారస్థులు. వ్యాపారమునకై సరకులను దీసికొని తమ గ్రామమునకు మరలుచుండిరి.

అప్పుడా యువకుడు అగ్గిపుల్లనుగీసి, యా పడియున్న వానిని చూచెను. అతని ముఖము తనకెక్కడనో పరిచయ ముండినట్లతని స్మృతిపథమునకు వచ్చెను. వెంటనే చేతి లాంతరును వెలిగించి యాతని ముఖమును బరీక్షించెను. ఒక్కసారి యున్మత్తుడై "సుధీరా!" అని కేకవేసెను. అత డెవడు? మన సుధీర సన్యాసియే. తన భార్య యతనిని ప్రాణము దీయించుటకు సిద్ధమైనది. కాని యాతని బాల్య స్నేహితుడగు నీయువకుని వలన బ్రతుకును గనినాడు.

ఆస్నేహితుని యింటికి జేరినపిదప తన యాపద్విషయము నాతనికెఱింగించెను. తర్వాత తన స్నేహితుని తండ్రి వలన, నాతడుగూడ వారియింట నొక పుత్త్రుడుగా నుండి వారి విశ్వాసమునకు బాత్రుడై వారి వ్యాపారమును జేయుచుండెను. ఆతడు వారియింట గాలిడినప్పటినుండియు వారి వ్యాపారము జయప్రదముగ సాగుచుండెను. ధనలక్ష్మి వారియింట తాండవించుచుండెను. అతని కేవిధమగు కొదువ లేకుండ అమితాదరముతో జూచుచుండిరి. అప్పుడు స్నేహి

తుడు, తమయొక్క బాల్యకాలమునాటి ముచ్చటలచేత నాత నిని సంతోష పఱచుచుండెను. ప్రతి దినము వారివ్యాపారము అభివృద్ధి పొందుచుండెను. అప్పుడతని స్నేహితుని యొక్క తల్లి దండ్రులు అతనిని జూచి "నాయనా! ఇంత కాలము మేము వ్యాపారము నందనేక కష్టములను బొంది యుంటిమి. కాని నీవు వచ్చినపిదప మేము లక్షాధికారుల మైతిమి. ఇదియంతయు నీచలువయే. నీవునిజముగ దైవాంశ సంభూతుడవై యుండ నోపుదువు. కావున నికమీదట నీవు, మాకొమారునితో బాటొక కొమారుడవై మమ్ములను వీడక యుండవలయును. మేము వృద్ధులమగుచుంటిమి. ఈ ధనమునంతయు మీరిరువురు తీసుకొని హాయిగా జీవయాత్రను గడపుచుండుడు." అనిరి.

"తల్లి దండ్రులారా! మీకు నమస్కారము. నిజముగ యీ నాసోదరుడు, మీకొమారునివల్ల నాకు ప్రాణము దక్కి నది. లేకున్నచో నాభార్య, దుష్టాత్మురాలి వలన నే నీపాటికీ లోకమును విసర్జించి యుండవలయును. మీకొమారుడును, నేనును చిన్ననాట నొక స్కూలులోనే చదివియుంటిమి. అప్పటినుండియు మాకిరువుర కన్యోన్య ప్రాణమైత్రిగలదు. ఒకరి కొకరొకరమప్పుడు ప్రాణము లర్పించుకొందమని బాస లాడి యుంటిమి. గాని యవి బాల్యపు పలుకులు. అయినను

అయ్యది నిజములైనవి. మీరునన్ను మీకొమారునివలె ప్రేమించుచు నన్నాదరించినందులకు మీ ఋణము నేనెట్లు తీర్చుకొందునో తెలియకున్నది. నేనింతవఱకిట సర్వసౌఖ్యముల ననుభవించుచు నిర్భరానందముతో గాలము గడిపితిని. కాని యిప్పుడు మిమ్ములను విడనాడి పోవలసి వచ్చినందులకు మీకంటె నాకే చాలకష్టముగ నున్నది. అందునను నాప్రాణదాతయగు నాసోదరుని—మీపుత్త్రుని విడచుట యంతటి దుర్భరవిషయము వేఱొండులేదు. అయినను నేను మిమ్ములను వీడిపోవలసి వచ్చినందులకు చాలా చింతిల్లుచున్నవాడను. నేనిప్పుడు భగవంతుని యాదేశము ప్రకారము ప్రవర్తింపవలసి యున్నది."

ఈమాటలు విని స్నేహితుని తల్లి యిట్లనెను.

"నాయనా! అదేలకోగాని నివెన్నిచెప్పినను నిన్ను వీడుటకు మామనం బాడకున్నది. నీవుచెప్పినట్లుగ భగవంతుని యాదేశమైనను, నీవుమాతో నుండియే భగవంతుని యాదేశ ప్రకారము ప్రవర్తింపవచ్చును. "దైవమ్ మనుషరూపేణ" యని పెద్దలు చెప్పుదురుగదా."

"అమ్మా! నీవుచెప్పునది నిజముగాని నేను ముందొక యతీశ్వరునికి వాగ్దత్త మిచ్చితిని. కావున యవశ్యము వెడల

వలసియున్నది. ఆ యతీశ్వరుని నేనొకనాడు "సంసారం సాగరం దుఃఖమ్" అను శ్లోకమునకు లక్ష్యసమన్వితమైన యంతరార్థము గ్రహించు విధానము చెప్పుమనగా, అప్పుడు నేనింతకు ముందు మీకుచెప్పిన అయిదు వాక్యములను జెప్పి వానిని లక్ష్య సమన్వితముగ జేసిన "సంసారం సాగరం దుఃఖమ్" అనుదాని యంతరార్థ మపుడే సులభముగ లక్ష్య సమన్వితము కాగలదని చెప్పెను. అటులనే అయినది. నేనిప్పుడు నాగురూపదేశ ప్రకారము నాయైదు వాక్యముల యొక్క యంతరార్థమును గ్రహించితిని. ఇక నాసందేహము లు బాసినవి. కోర్కెలు తీరినవి. నేత్రములు పొరలు వీడినవి. ఇక నేనీజన్మమును ఈశ్వరార్పణ గావించెదను. కావున నన్ను మీరన్యథా భావింపక, మీయాశీర్వచనముల నొసంగి పంపుడు." అని చెప్పెను. అందులకా స్నేహితుని తల్లి యాతనియం దెంతయు జాలినొంది, పుత్రవాత్సల్య ముట్టిపడునట్లుగ నాతనిని యాశీర్వదించెను. ఆస్నేహితుని తండ్రిగూడ యట్లే చేసెను. అప్పుడు స్నేహితుడు పిన్నవానివలె "సోదరా, నన్నువీడి పోయెదవా?" అని దుఃఖించెను. అప్పుడాతనిని సుధీరుడెంతయో యోదార్చెను.

"అన్నా! మరల నీదర్శన భాగ్యము కలుగునా?"

"తమ్ముడా, మఱచితిని. నేనిప్పుడు ఒక్కసారి మా

తల్లి దండ్రులను జూడబోవలయును. అక్కడ ఒక పెద్ద సమారాధన యేర్పాటు చేయుదును. అప్పుడందరికిని ఆహ్వాన పత్రిక లంపుదును. నీవు తప్పక రావలయును."

"ధన్యోస్మి"

"కాని తమ్ముడా! ఆసమారాధనకై నాకొక మూడు వేల రూప్యము లిప్పింపవలయును."

"ఆహా, మూడువేలెంత మాత్రము. నీకు కావలసిన ధనమును గొనిపొమ్ము"

"తమ్ముడా, నాకు నాయెత్తు ధనము నొసంగిననువలదు. ఈ ధనముపైన నాకేమాత్రము కాంక్షలేదు. ఈమూడు వేలైనను సంతర్పణకై యడిగితిని. అదియునుగాక మీ మోటారునుగూడ నాకిప్పింపవలయును. నేనిప్పుడు ఆడంబరమగు దుస్తులతో మాతండ్రి కడ కేగవలయును."

"నాకంతయు నాశ్చర్యముగ నున్నది."

"ఇందులో నీవాశ్చర్య పడవలసిన దేమియులేదు. ఆసంతర్పణ నాడు ఏమి విచిత్ర సంఘటన మొనగూడునో దానినినీవు కన్నులార గాంచి యానందింతువుగాక."

"మహాభాగ్యము"

ఈవిధముగ తన స్నేహితుని వద్దనుండియు, స్నేహితుని తల్లి దండ్రుల వద్దనుండియు సుధీరకుమారుడు సెలవు తీసికొని, అచ్చపు యాంగ్ల యువకుని యుడుపులను ధరించి, మోటారు కారులో బంగారు పాత్రలు, బంగారు అరటియాకు, వెండి పళ్లెరము, వెండి పాత్రము మొదలైనవి పెట్టుకొని, మూడు వేల రూపాయలను బట్టుకొని తన తండ్రిగారి యింటికి బయలు దేరెను.

*　　　*　　　*

మోటారు ఇంటిముందు నిలిచిన శబ్దమును విని, ఆశ్చర్యముతో సుధీరునియొక్క తండ్రి రివ్వున బయటికివచ్చెను. అప్పుడు అభినవాంగ్ల యువకుడొకడు మోటారును దిగి, మోటారువానికి మోటారులోని సామానుల నింటిలోనికి గొని పొమ్మని యాజ్ఞాపించి, తాను తండ్రికి నమస్కరించెను. వెంటనే "ఎవరు? సుధీరా!" అని ఆనందాశ్చర్యములతో నాతనిని కౌగలించుకొని యింటిలోనికి గొనిపోయెను.

అప్పుడింటిలో శుష్కించి యున్న తన తల్లినిగాంచి, జాలితెలుపు కన్నీటితో "అమ్మా, ఇదిగో నీపుత్త్రుడు సుధీరు నమస్కరించు చున్నాడు." అని చెప్పగానే సుధీరుని తల్లి యతనిని కౌగలించుకొని పసిపిల్లవలె బావురుమని యేడ్చెను. తర్వాత "సుధీరా, ఎన్నాళకెన్నాళ్లు? ఎంత కృశించిపోయితివి!

అయ్యో! యిన్ని నాళ్లు నిన్ను చూడక నాకళ్లు కాయలు కాచినవిరా తండ్రీ" అని వాపోవదొడంగెను. అప్పుడు సుధీరుడు తల్లిని యెన్నోవిధముల నూరార్చుచుండ నింతలో తండ్రి, మోటారువాడు తీసికొని వచ్చుచుండిన బంగారు చెంబును, బంగారు అరటియాకును బట్టుకొని, పరమసంతోష ముతో "బాబూ, సుధీరా, ఇదియెంతకు గొంటివి? ఆహా! చాలా బాగుగనున్నది. ఇదివఱకు నేను మూర్ఖుడనై, నీవ ప్రయోజకుడవని యిల్లువెడల గొట్టితిని. పిదప యెంతయో దుఃఖించితిని. కాని యిప్పుడు నిన్నును, నీయొక్క గొప్పతన మును చూడ నాకెంతయు నానందముగ నున్నది. నీవింత ప్రయోజకుడ వగుదువని నేనెన్నడనుకొనలేదు." అని శర పరంపరలుగ, తనకు దెలియకుండగనే, ఆనంద పారవశ్యము చేత యేదేదో తన పుత్త్రుని పొగడుచు మాట్లాడెను. కాని వానికంతటికి సుధీరకొమారుడు చిరునవ్వునే ప్రత్యుత్తర మొసంగుచు తన తల్లిని యోదార్చుటలో నిమగ్నుడాయెను.

అప్పుడు సుధీరుని తండ్రి తన భార్యతో "ఒసీ, సుధీరు నకు స్నానమున కుష్ణోదకమును సిద్ధపఱుపుము. పాపము వాడు భోజనమొనర్చి, యెంత తడవాయెనో యని యాజ్ఞాపించెను. సుధీరుని తల్లి సంతోషముతో దన పుత్త్రునికి యుష్ణోదకమును సిద్ధము జేయుటకై వెడలెను.

తర్వాత సుధీరుని తండ్రి యెన్నియో విధములుగ సుధీరునియొక్క గుణములను బొగడుచు, సల్లాపించెను. మరల సుధీరుడు తన గృహమున స్వర్గలోక సౌఖ్యముల ననుభవింప మొదలిడెను.

ఆ మఱునటి దినమున సుధీరుడు తన తల్లి దండ్రులతో దానొక సంతర్పణ చేయనున్నా డననియు, కావున బంధు వర్గమున కంతయు నాహ్వానము లంపవలయుననియు జెప్పెను. అప్పుడు తండ్రి యుల్లేయని పరమానందముతో తానే స్వయముగా బోయి, కొన్ని ఆహ్వాన పత్రికల నచ్చొత్తించి, బంధు మిత్రాదుల కందఱికిని పంపెను. ఆ సంతర్పణకై వలయు నేర్పాటుల నన్నిటిని చేయించుచుండెను. తనయింటి ముందు, లోపల, బ్రహ్మాండమైన తాటియాకుల పందిళ్లను వేయించి వానికి చాందినీ గుడ్డను పఱపించి, చిత్రవిచిత్ర వర్ణములగు పాదరసపు బుడ్లను తగిలించి, యింకను అనేక విధాలలంకారముల జేయసాగెను. ఆయింటి వైభవము చూపఱకు కనులు మిఱుమిట్లు గొల్పుచుండెను. ప్రతివారును సుధీరకొమారుని యొక్క గుణాగుణములను గుర్తించిరి. తండ్రి ఆనంద మహారమై పోయినది.

సంతర్పణ యింక నాలుదినములకు జరుగుననగా, సుధీరకొమారుడు తాను స్వయముగ నొకరోజు మోటారు

పైన తన భార్య పుట్టింటికేగెను. ఆదార వేషముతోనున్న తన భర్తను చూచి భార్య యెంతయు నాశ్చర్యపడెను. కాని తాను తన విటుని ద్వారా యీతనిని చంప ప్రయత్నించిన విషయమును దలచుకొని, యాతడేమనునో యని మనమున భయమందెను. కాని సుధీరకుమారుడు మామూలుగా నేమియును దెలియనివానివలె నటించుచు, భార్యవద్దకు బోయి ప్రేమ రసమొలుకు నట్లుగా "ప్రేయసీ, క్షమింపుము. నే నప్పుడే రావలయునని యనుకొంటిని గాని, కొన్ని కష్టముల వలన మతిచలించి, పిచ్చవాడనై తిరిగి, కడకు నున్మాద వైద్య శాలయందు చికిత్సను బడసితిని. ఇప్పుడు నాకు గొప్ప ఉద్యోగమయినది. కావున సంతోష చిహ్నముగ నతి వైభవముగ సంతర్పణను జరుపుచున్నాను. కాని నీవు నా ధర్మపత్నివగుటచే, నిన్ను స్వయముగ గొనిపోవుటకు నా మోటారులో వచ్చితిని. కావున వేగమే ప్రయాణమునకు సిద్ధమగుము. మనమిరువురమును మన మోటారులో గలిసి మా చెల్లెలి యింటికిబోయి, యందుండి మా చెల్లెలినిగూడ పిలుచుకొని రావలయును. అప్పుడు సుధీరుని భార్యకు గొంతభయము తగ్గెను. తాను చేసిన దుర్మార్గము సుధీరు డప్పుడున్మాదుడై యుండెను గాన మఱచియుండెనని సంతో షించెను. ఇప్పుడు మోటారు కొన్నాడు. చాల గొప్ప ఉద్యోగములో ఉన్నాడు. అందునను తనకు కొన్ని పట్టు

చీరెలను గూడ గొనితెచ్చెను. కావున యిక తాను తన భర్తతో వెడలుటకేమియు నభ్యంతరముండదు.

అప్పుడు సుధీరునిభార్య కపటప్రేమను జూపుచు, మిథ్యా భాష్పముల నిగుర్చుచు, వియోగ దుఃఖమును భరింపలేని దానివలె నటించుచు భర్తనుచూచి "ప్రియా, మీరాకకు నేను దినమొక్క యేడుగా గడపుచు కాలమును ఎడతెగని వియోగ దుఃఖముచేత నెట్టితిని. అనేక దేవతలకు మ్రొక్కుకొంటిని. తత్ఫలితముగను, నాపూర్వ సుకృతమున మరల యిన్నినాళ్లకు నేను మిమ్ముల దర్శింపగలిగినందులకు నాజన్మము ధన్యమైనది. నా జీవితము ప్రఫుల్లమైనది. నాథా! మీరికమీద నన్ను పరిత్యజించి దేశాటనార్థము బోకుండవలయును. ఇకమీదట మీరట్లు గావించినచో నేను ప్రాణపరిత్యాగము గావించు కొనవలసి వచ్చును. ఇకమీదట నేను వియోగ దుఃఖమును భరింపజాలను." అని యీరీతిగ కపటప్రేమ పూరితవాక్సుధా ధారలొలికించుచు, నప్పుడప్పుడు తనభర్త పరాకున నున్నవా డని యెంచి, కొంతవలకు భీతిని గదురుచుండెను. ఆమాటలు సుధీరకుమారున కాశ్చర్య జనకములాయెను. తన్నానాడు, సన్యాసి వేషమున నున్నప్పుడు, తన ప్రాణములను దీయింప బ్రయత్నించిన దుష్టాత్మురాలగు దనభార్య, తన్నిప్పుడు, లేని ప్రేమ వాక్యములను అశ్రుజలంబులను బ్రయోగించుచు

నాకర్షింప జూచుచున్నందుల కెంతయు నాశ్చర్యపడెను. "ఆహా, స్త్రీలెట్టి సాహసురాండ్రు!" తనలో దానాశ్చర్య పడసాగెను. కాని తనలో విజృంభించుచున్న భావ పరంపరల నడచిపైచి, యేమియు నెఱుగనివానివలె, తన భార్యయొక్క మధుర ప్రేమపూరిత వాక్యములకున్మత్తుడైన వానివలె, దన భార్యను దనయక్కున జేర్చుకొని "ప్రేయసీ, నిన్నింతకాలము వియోగజలధిలో ద్రోసివైచినందులకు నన్ను క్షమింతువని కోరియెదను. మనమిప్పుడే మన మోటారుపైన నాచెల్లెలి యింటికిగూడ వెడలి యాపెనుగూడ గొనిరాబోవలయును. కావున కాలహరణము జేయక శీఘ్రముగ వెడలిరమ్ము." అని చెప్పెను. ఈమాటల కాయువతి, తన భర్తకు తన దుశ్చేష్టితము లేమియు జ్ఞప్తియందులేవని యెంతయు సంతస మందుచు, వెంటనే లోపలికి బోయి, శృంగారించుకొని, తన ముసలి తల్లికి దానును దనభర్తయు నమస్కరించి యామెచేత నాశీర్వచనముల పడసిన పిదప, "ఇదుగో పొరుగింటి యమ్మ తో జెప్పివత్తు"నని తన విటుని కడకుబోయి, తనభర్తవచ్చిన సమాచారమును తానాతనితో వెడలిపోవుటను మొదలైన విషయములన్నియు జెప్పి యాతని వక్షముపైనవ్రాలి ఘోరారు మని యేడ్చెను. అప్పుడా విటుడు తానుగూడ నాపె వియో గమున కెంతయు దుఃఖించుచు, ఆపెను దన బిగికౌగిట లాలించుచు, ననేక చుంబనములగొని "మరల నెన్నినాళ్లకు

నీదర్శన" మని యడిగెను. అప్పుడామె కన్నీరు తుడుచుకొనుచు "కొలది రోజులలోనే" అనిచెప్పి, యాతనిని వదలలేక తుదిచుంబనముల గొని యతనివద్ద సెలవుగైకొని, తన భర్తకడకు వచ్చి నిలిచెను. దీనినంతయు బాగుగ నవగాహన మొనర్చికొని, ఆయనుమానమావంతయు గన్పఱచక ప్రఫుల్ల వదనముతో దనభార్యను ఆలింగన మొనర్చుకొని, పిదప దన మోటారుపై నెక్కించుకొని తనసోదరి బొసంతిని యింటికి పయనమాయెను.

*　　　　*　　　　*

సాయంకాల మైదుగంటలాయెను. బొసంతిని తన మేడపైని వరండాలో గూర్చొని వీణను వాయించుచు బాడుకొనుచుండెను. అప్పుడు తన యింటిముందు మోటారు కారాగుట జూచి, యాశ్చర్యముతో దొంగిచూచెను. అప్పుడా మోటారునందుండి యభినవాంగ్ల ప్రముఖుడగు సుధీరకుమారును, నాతని భార్యయు దిగి, యాలోపలికి బ్రవేశించిరి. వారి కెదురుగా బొసంతిని వచ్చి, యన్ననుజూచి కొయ్య బొమ్మవలె నిర్ఘాంతపడి నిలుచుండెను. అప్పుడు సుధీరకుమారు చిరునవ్వుతో "సోదరీ! ఏమి యట్లు చూచుచుంటివి. నీ యన్నను, సుధీరుని గుర్తింపలేదా? ఓహో మఱచితిని నీయాశ్చర్యమునకు గారణ మిప్పుడరసితిని. బహుశః నేనున్మాదుడనై, తిరుగులాడుచున్నప్పుడు నీవు నన్ను వీక్షించితివేమో?

కాని నేను దైవకృపచేత నున్మాద వైద్యచికిత్సను పొందితిని.” అని చెప్పెను.

అప్పుడు బోసంతిని సోదరుని యనేకవిధములుగ సంస్తుతించుచు, నుచిత గౌరవమును గావించెను. ఇంతలోపల బోసంతినీ భర్తగూడ యింటికివచ్చి, తనభార్యచేత తన బావ మఱది విషయమునంతయు దెలిసికొని, యపరిమితానందము నొంది, అనేక విధములగు సరసోక్తులాడెను. పిమ్మట యారాత్రి యచ్చటబసుండి, మరునాడుదయముననే లేచి, తన సోదరిని, తన బావను తానుచేయు సంతర్పణమునకై పిలిచెను. కాని బోసంతిని భర్త, తాను వచ్చుటకు వీలులేదనియు, అవశ్య కార్యములున్నవనియు జెప్పి, తన భార్యను మాత్రము పంపించుట కొప్పుకొనెను. అప్పుడు బోసంతిని, తన సోదరునితోడను, వదినెగారితోను యిష్టాలాపము లాడుకొనుచు నా మోటారులో పయనమై పోయెను.



అప్పుడు వారుముగ్వు రు ఇంటికి బోవుటతోడనే సుధీరబోసంతినీలను కౌగలించుకొని తల్లియు, దండ్రియు నపరిమితానందము నొందిరి. కోడలిని అత్తగారు సంప్రీతి

తో గాగలించుకొనిరి. మామగారు, ఆమెను ఆశీర్వదించి కుశల ప్రశ్నలను వైచిరి. అందఱా దినమంతయు నమితా నందముతో, మృష్టాన్న మారగించి సుఖముగ గాలము బుచ్చిరి.

* * *

రేపటిదినమున సంతర్పణ జరుగవలసిన దినమనగ, సుధీరుని తండ్రి అద్భుతమైన యేర్పాటులను జేయుచుండెను. అందరు తలకొక కార్యమును జేయుచుండిరి. సుధీరుడు వారినందఱిని బాగుగా బరికించుచు నర్థము జేసుకొనుచుండెను. వారియిల్లు పెద్ద పెండ్లి యిల్లాయెను. సంతర్పణమునకై యింతవైభవము జేయువారెవ్వరును లేరు. వచ్చిన చుట్టము లందఱు ఆవైభవమును గాంచి యమితాశ్చర్యమును, ఆనంద మును బొందిరి.

ఇందఱు బందుగులు వచ్చినను, తనభార్య, తనసోదరి మొదలైనవారు వచ్చినను సుధీరునియొక్క మానసమునం దేదియో కొరవడెను. ఎవరికొఱకో యాతని నేత్రము లారాట పడుచుండెను. అతని హృదయము పరితప్తమై పోవుచుండెను. నిరాశాపూరితములగు నూర్పులను విడచు చుండెను. ఆతని ముఖమునందు విచార రేఖలు తాండవ మాడుచుండెను. అయ్యది యతని తల్లిదండ్రులు, భార్య,

సోదరియు గనిపెట్టి, కారణమేమని యడిగిరిగాని, యేమియు లేదు, శరీరము ప్రయాణాయాసమున కొంచెము నవసియున్నది యని అతడు ప్రత్యుత్తరమొసంగెను.

*     *     *     *

నాడు సమారాధనదినము. సుధీరుని గృహమంతయు నధిక సంరంభముతో నిండియున్నది. సమారాధనకు కావల సిన యేర్పాటమంతయు జరుగుచున్నది. వంటలు గూడ సిద్ధమగుచున్నవి. మామిడాకు తోరణములచే గృహమంత యు కలకలలాడుచున్నది. అప్పుడు వారియింట భాగ్య లక్ష్మి తాండవించుచున్నది.

తర్వాత కొంతసేపటికి మంగళ వాయిద్యములు మ్రో గినవి. సుధీరుడు మంగళస్నాన మాచరించెను. శ్రీకృష్ణుని విగ్రహమునెదుట గూర్చుండి, తదేకనిష్ఠతో బూజనము గావిం చెను. పిదప మంగళ హారతులైనవి. అటుపిమ్మట భోజనపు టేర్పాట్లు జరుగుచున్నవి. సుధీరకొమారుడు స్వయముగ వడ్డనము సలుపవలయునని వ్రతము బూనియున్నాడు. కావున తండ్రి యాతనివద్దకు వచ్చి "నాయనా, యేమి యిట్లు జాగు చేయుచుంటివి? అందరు భోజనములకై కాచుకొని యున్న వారు. ఇప్పటికే అపరాహ్నము దాటిపోవుచున్నది. నీవింకను జాగుచేయుచుంటి వేల?" అని యాతురతతో బ్రశ్నించెను.

అప్పుడు సుధీరుడు* తండ్రితో "నాయనా, ఒక మహాపురుషు డిప్పుడు రావలయును. ఆతడు వచ్చును. అంతవరకు వేచి యుండవలయును."

"ఏమి, నీకు మతిపోయినదా? వారందఱు ఆకలితో ఎంత సేపు వేచియుందురు. అట్లు వేచియుండమనుటన్యా యమా?"

"అట్లయినచో నింక పావుగంటలో వచ్చెదను. మీరు నడుపుడు." అని చెప్పెను.

అప్పుడతని తండ్రి కొంచెము విసుగుకొనుచు, వెడలి పోయెను. పిమ్మట సుధీరుడు తలవాకిటికిబోయి వైదునిమి షములకాలము తూర్పుదిక్కునకు తన దృష్టిని సారించి, తదేక నిష్ఠలో బరిక్షింప సాగెను. అప్పుడున్నటులుండి యొక్కసారి సంతోష పారవశ్యముచేత గెవ్వుమని కేకవైచెను. ఆ కేకకు తండ్రియు మఱికొంతమందియు నటకు బిరబిర వచ్చి "ఏమి విశేషము?" అని యాతురతతో నడుగుచుండిరి. ఇంతలో నొక మోటారునుండి నిరాడంబరమగు నుడుపులతో దన స్నేహితుడు వచ్చెను. అప్పుడు అతనిని తాను మడికట్టు కొనిన సంగతికూడా మఱచి, ప్రేమాలింగన మొనర్చుకొని, యత్యంతాదరముతో లోనికి గొంబోయి, యుతనిని జలక మాడించి, తానును మరల కృతస్నానతుడై, యిరువురును తిలకముల దిద్ది, శుభ్రవస్త్రముల దాల్చివచ్చిరి.

అప్పుడు సుధీరకుమారుడు మధ్యగా* రెండు యెత్తైన పీఠములను వేయించి, యొకదానిముందు బంగారు అరటి యాకును, ప్రక్కన బంగారు పాత్రమునుబెట్టి వేఱొకదాని ముందు వెండి వళ్లెరమును వెండి పాత్రమును నుంచెను. దానికి ప్రక్కన కొంతదూరములో నొక తాటియాకుల చదరనువేసి, దానిముందు అరటియాకునువేసి, ప్రక్కన జలమునకై సత్తు పాత్రమును బెట్టెను. దానికి కొంతదూరములో వేఱొక చోట ఆసనమేమియు లేక, భోజనమును వడ్డించుటకై యొక మఱ్ఱియాకుల విస్తరను వేసెను. ఇతని చర్యయంతయు దక్కిన వారమితాశ్చర్యముతో జూచుచుండిరి. అందఱు ఏమి జరుగునో యని తహతహలాడుచు నిశ్శబ్దముగ గూర్చొని యుండిరి.

అప్పుడు సుధీరకుమారుడు త్వరగా వంట యింటిలోనికి బోయి, పిండి వంటలపనిలో నిమగ్నమైయున్న, తన తల్లిని లేచి రమ్మనెను. ఆమె యెందుకు నాయనా?" అని యడిగెను. "భోజనముచేయుట"కని యాతడనెను. అప్పుడామె యాశ్చర్యముతో "ఇదియేమి? నన్ను పురుషుల పంక్తిలో గూర్చొన మనుచుంటివేమి?" అనెను.

"అమ్మా, అట్లుకాదు. నావ్రతమట్టిది. ఈసంతర్పణలో పురుషులు స్త్రీలు గూడ కలిసి కూర్చుండవలయును."

అనిచెప్పి యాపెను తీసికొని వచ్చెను. ఆపె బెదరుచువచ్చెను. ఇంతలో నాఎత్తయిన పీఠముపై, బంగారు అరటియాకును జూచుకొనుచు సంతోషముతో దనతండ్రి కూర్చొనియుండెను. అప్పుడు సుధీరుడు తండ్రిని సాదరముగా నందుండి లేవవలయు నని కోరెను. "ఏల" యని తండ్రి యాశ్చర్యపూర్వకముగా నడిగెను. అదియొక వ్రతవిశేషమని తండ్రికి, చెప్పెను. అప్పుడతడాశ్చర్యముతో చిన్నపోయిన వదనముతో నటనుండి లేచెను. ఈవింత దృశ్యము నందఱు వింతగజూచుచుండిరి.

అప్పుడు సుధీరుడు తల్లికి వినయముతో మ్రొక్కి యాపె హస్తమును బట్టుకొని యాపీఠమున గూర్చుండమనెను. ఆమె యాశ్చర్యముతో "ఇదియేమి?" యనెను. అదియొకవ్రత విశేషమనియు, తద్విరుద్ధముగ వర్తించినచో వ్రత భంగ మగుననియు, తన్నెవ్వరును ప్రశ్నింప గూడదనియు జెప్పెను. అందరు నిశ్శబ్దముగ నుండిరి. పిమ్మట స్నేహితుని, సగౌరవ మున రెండుచేతులను బట్టుకొని తన తల్లిప్రక్కనేయున్న యున్నతాసనముపై కూర్చుండబెట్టెను. తండ్రిని ఆసమీపముననే వేయబడిన తాటియాకు చదరపై గూర్చుండుమనగా నతడు నిరాకరించెను గాని తర్వాత గూర్చుండెను. సోదరిని, దూరముగా ఆసనములేని, మఱ్ఱియాకుల విస్తరిముందు కూర్చొండనెను. "ఏమిటి అన్నయ్యా యిది?" అనెను.

"కూర్చుండుమమ్మా, తర్వాత చెప్పెదను." అని యాతని కూర్చుండబెట్టెను. వీరి పంక్తికి దూరముగా నొకమూల భార్యను కూర్చుండమని చెప్పెను. పిమ్మట వడ్డనము చేయుచు వేడివేడి యన్నమును వడ్డించుటకు తన భార్యవద్దకు బోయి దోసిలిపట్టుమని చెప్పెను. అందులకామె కోపముతో జూచెను. అప్పుడందఱికి కొంచెము కష్టము కలిగెను. అప్పుడంద ఱేమియిది?" యని యడిగిరి. అప్పుడందఱికి చిరునగవుతో నమస్కరించి, బంధువుల ముందఱ యీరీతిగా చెప్పి "అయ్యలారా! ఆగ్రహింపక నేను చెప్పునది, వినుడు. నేను ఇంపీరియల్ బ్యాంకులో మేనేజరుగా నున్నప్పుడు నాతండ్రి యెంతయో గౌరవించుచుండువాడు. నే నొకరోజు ఒక పర్వతగుహాయందు ఒక యతీశ్వరుని సందర్శించి "మహాత్మా! 'సంసారం, సాగరం, దుఃఖం' అను శ్లోకమును లక్ష్యసమన్వితముగ నొనర్చుమార్గ ముపదేశించు మన నప్పుడునాకైదువాక్యముల నుపదేశించెను." అని చెప్పి యాయైదు వాక్యములను జెప్పి, తర్వాత తన్ను ఉద్యోగము లేనపుడు తండ్రి యిలువెడల దఱుముటయు, నారాత్రి రెండుఝాముల వేళ వర్షములో దల్లి తాను సత్రములోనుండ నాహారము పట్టుకువచ్చుటయు, పిదప తాను సోదరి యింటికి పోగా తనను జూచి యసహ్యించుకొని పొమ్మనిన విధమును, పిదప తనభార్య తనను జంపించుటకు జేసిన కుతంత్రమును, పిదప తన స్నేహితుడు తన్ను కాపాడి,

తన నింతధనికునిగ జేసినదియు మున్నగు యావద్విషయము లను జెప్పగా బంధువులందఱు ఆశ్చర్యానందములతో నతనిని కౌగలించుకొనిరి. ఆతని భార్యను అనేక విధముల దూషించి బహిష్కరించిరి. సోదరిని యనేకవిధములుగ దూషించిరి. తండ్రికి బుద్ధిచెప్పి తలవంపులు పొందజేసిరి. అతని తల్లిని వేయి నోళ్ల బొగడిరి. ఆతని స్నేహితుని భుజమును సంతోష పూర్వకముగ దట్టిరి. అప్పుడున్నటులుండి సుధీరుడు అందఱికి నమస్కరించి, స్నేహితుని కౌగలించుకొని, తల్లికి నమస్కరించి "అమ్మా! ఇక సెలవు." అని వెడలపోయెను. అప్పుడు అశ్రుపూరిత నయనములతో తల్లి "నాయనా, సుధీరా, నన్ను గూడ గొనిపొమ్ము." అనెను. స్నేహితుడు "సుధీర్, ఉండుము. నేనుగూడ వత్తును." అనెను.

కాని యింతలో వాయువేగమున సుధీరుడు భక్తి పారవశ్యముచేత "సంసారమ్, సాగరమ్, దుఃఖమ్, తస్మాత్ జాగ్రత జాగ్రత" అని పఠించుకొనుచు నదృశ్యుడై పోయెను. అందఱాశ్చర్యముతో నిలువున నీరై పోయిరి.

౫

"పేరాశయే పెనుభూతమగుట."

"ఓషేవ్, అమ్మో, ఏంచేఘున్నావ్? దేవతార్చనకు లెమ్మంఛావా? ఇప్పటికి రెండుఝాములాయె? ఇంకా వంటకాలేదుకే."

"వంటాలేదు, పెంటాలేదు. ఘ్నార్లుకోండి. మీకేం, పనాపాటా? తిని కూర్చుండడమేగా. నేనీ పొయ్యిదగ్గిఱ, వెధవమండనికట్టెల్తో అవస్థపడ్తూ, పొగతోటి కళ్లంతా పోతూవుంటే, మీకు దేవతార్చనకి తొందరైందా?"

"ఓసీ, గయ్యాళి నువ్వెక్కడ దాపురించావే నాపాలిటికి. ఇలా చేవట్లువాడిపి సంపాదించి యింట్లో పడేస్తుంటే, వేళకిన్ని మెతుకులు పెట్టడానికి ముక్కుతో ఏడుస్తావేమే?"

"చాలు, చాలు, మీపనస చాలించండి, బయిటనుండి ధర్మపన్నాలు చెప్పమంటే ధర్మపన్నాలు చదవమంటే యెన్నైనా చెప్పొచ్చు. నాకష్టం మీకేం తెలుస్తుంది?"

"ఓసీ, పక్షీ, నోరుముయ్యి. ఏవిటి నువ్వు కష్టపడేది. ఒక ఆడబిడ్డా, ఒక అత్తగారా; మామగారా; ఒక్కమొగుడి

ముండాకొడుక్కి యింతచేసి పడెయ్యడానికి నీపిండం పిల్లుల కేసుకుంటావేం? అందటి పెళ్లాలు నీకు మల్లెనే మొగుళ్ళకి చేసిపెట్టడాని కిలా యేడుస్తున్నారా? ఒక్కొక్కళ్లు గంపెడు సంసారం యీదుతూ వుండలే?"

"మీారనవసర ప్రసంగంలోకి దిగుతే బాగా జరగదు. అందఱు పెళ్లాలు వాళ్లవాళ్ల మొగుళ్లకి చేస్తున్నారంటే యెందుకు చేస్తున్నారు? వాళ్లవాళ్ల మొగుళ్లు వాళ్లవాళ్ల పెళ్లాల్ని ప్రేమగా చూస్తూ, ఏవిధమైన కొదువలేకుండా బాగా డబ్బుసంపాదించి, నగలు నాణ్యాలు చేయించి పెడ్తారు. అలా మీారు పెట్టితే నేను ఏమి అనుకోకుండా పనిచేస్తాను. ఇంతవఱకు కాపరానికి వొచ్చింది లగాయితు, మెళ్లో మంగళ సూత్రం తప్ప, పేరుకైనా యేదైనా ఒక్కనగ చేయించిన పాపాన్ని పోయారూ? ఒక్క మంచిచీరె కొందామంటే 'డబ్బులేదు డబ్బులేదు' అని యేడవడమేగా, అంతకంటే మీా వద్ద యేం సుఖపడ్తున్నాను నేను?"

"ఓసి, పిచ్చిదానా, అదంతా వాళ్ల అదృష్టం. మన దురదృష్టం, మనకే యెప్పటికైనా, ఓపికతో వున్నామంటే తప్పకుండా అదృష్టం పట్టుతుంది. అప్పుడు నీవొళ్లంతా బంగార మవుతుంది అన్నమాటే."

"ఇంకేం, సంబరం. చాలు, చాలు, ఎవరన్నా మీ మాటలువింటే నవ్వుకూపోయేరు. ఎప్పుడో అదృష్టం వస్తుందిట, అప్పుడు నావోళ్లంతా బంగారం అవుతుందిట. ఎక్కణ్ణుంచి వస్తుంది ఆ అదృష్టం మీకు? ఆ అదృష్టానికి ఏమైనా రెక్కలున్నాయా, ఒక్కసారి మీతలపైన వచ్చి వ్రాలడానికి, ఏం అదృష్టమైనా ఊరికే మీదబడుతుంది కామోసు. ఎప్పుడూ యింట్లో కూచొని, ఏం పంచాంగము చదవడమో, ఏయజ్ఞోపవితాలు చేయడమో, ఏవేదమంత్రాలు చదవడమో, చేస్తూ, ఫూరికే చిటికెలపైన చిటికెలు పొడుము ముక్కులోకి పీలుస్తూ, గజ్జిపొక్కుల్ని గిల్లుకొంటూ, "అదిగో రవిమహర్దశ, అదుగో గురుమహర్దశ, ఇదిగో అదృష్టం, అదుగో అదృష్టం అని ఒకమూల కూచొని గాలిమేడలు కట్టుతుంటే, యిటువంటివారికి అదృష్టం ఒక్కసారి వలచి, పైన బడుతుంది కామోసు. ఏదైనా బయటికి పోయి, నాలుగుడబ్బులు సంపాయించే మార్గం కనిపెడ్తామా అని లేదు. కష్టపడకుండా అదృష్టం రమ్మనమంటే ఏలావస్తుంది?"

"ఆడముండవు నీకేం తెలుస్తుంది? వట్టి ఎద్దు మొద్దు అవతారమేగాని, మంచి చెడ్డ లాలోచించవుగదా. నీకు తెలియనన్నా తెలియాలి, లేకపోతే నేను చెపితే వినాలి. ఇవిరెండూ చేయకపోతే నువ్వు ద్విపాదపశువుతో సమానమన్నమాటే?"

"ఆఁ ఏవిటి మీయసందర్భపు మాటలు. నేనింతా చెపితే 'ఆడముండవు నీకేం తెలుస్తుంది' అంటారేవిటి? నాకు తెలియని దేవిటి, మీకు తెలిసిన దేవిటి యిప్పుడు? కష్టేఫలే అన్నాడుగదా. మీరు కష్టపడకుండా, యింట్లో కూచొని, కడుపులో చల్ల కదలక గొంతెమ్మ కోర్కెలు కోరుతోంటే అవియన్నీ ఏలా సఫలమౌతాయో చెప్పండి".

"ఓసి తెలివి తక్కువ పెద్దమ్మా, నామాటవిను. అదృష్టం లేకపోతే ఏంచేసినా ఏం లాభంలేదు. బంగారం ముట్టుకొంటే మన్ను అయిపోతుంది. అదృష్టం వుంటే మన్ను ముట్టుకొంటే బంగారం అవుతుంది తెలుసునా? అదృష్టం ఒకళ్లతో చెప్పిరాదు, ఎప్పుడో, ఏనిమిషాన్నో, ఒద్దన్నా వచ్చి మీదపడుతుంది. అప్పుడు మన యైశ్వర్యానికి మితివుండదు. మన మేదికావలంటే అది అవుతుంది. కొండమీద కోతి గూడా దిగివస్తుంది. మనం ఏది తలచుకొంటే అది అవుతుంది. అంతేగాని ఊరికే, శరీరకష్టం పడితే ఏమాత్రం లాభంలేదు. తెలిసిందా యిప్పటికైనా? అది అదృష్టం యొక్క మహాత్మ్యం. అటువంటి అదృష్టం నాకు కొద్దిరోజులలోనే కలుగుతుందని నాకు గట్టి నమ్మకం వుంది. అప్పుడు మనం యిలాంటి పర్ణకుటీరాల్లో ఉంటామనుకున్నావా యేవిటి? దేదీప్యమానంగా, విద్యుద్దీపకాంతుల్తోటి ధళధళ మెఱుస్తూన్న

బంగారు ఏడంతస్తుల మేడపైన, సుగంధ ద్రవ్య పరిమళాల్లో జలకమాడ్తూ, పరిచారికలు మన రెండు ప్రక్కల సురటీలు వీస్తూంటే, మనమిద్దరం హంసతూలికా తల్పముపైన వొయ్యారముగ కూర్చుండి, రతీ మన్మథుల్లాగ సరస సల్లాపాలాడుకొంటూ, నిర్మలానంద వీచికల్లో యీదులాడ్తూ వుంటాము. అటువంటి అదృష్టదినాలు మనకు కొలదిరోజులలోనే కలుగుతై. కావున యెప్పుడు తొందరపాటు కూడదు. ఓర్పును గలిగివుండాలి. తెలిసిందా! ఇకమీదట నీవనవసర వ్యర్థ ప్రసంగములోనికి దిగక, వంటను శీఘ్రముగ సిద్ధము చేయుము. ఇప్పుడు బోలెడు పొద్దెక్కింది. నాకడుపాకలితోటి దహించుకొని పోతున్నది."

"ఒకపొద్దు తిన్నమ్మ, ఓర్చుకుందిటా, ముప్పూట తిన్నమ్మ మూర్ఛపోయిందిట." అలాగే వుంది మీసంగతి కూడా యిప్పుడు. పోనీ పాపంగదా, ఆకలి కోర్వలేరుగదా అని నేను మీకిందాక అట్టుచేసి పెడితే అది తిని మళ్లీ ఆకలి కోర్వలేక మూర్ఛపోతారేవిటి ? నేను ప్రొద్దుటినుంచి పచ్చి మంచినీళ్లు గూడా గొంతులో పొయ్యకుండా, వంటచేయలేక, పొయ్యిదగ్గిర చస్తూంటే, పైపెచ్చునన్ను సాధిస్తారేవిటి?"

అబ్బబ్బా, మాటపడనీయవుగదా. కొంచెం మాటలంటే గలగలమని రంపల రాకాసిలాగ పట్టుకొంటావు.

నీకాకలిలేదు కామోసు. నాకు దహించుకు పోతున్నది. నువ్వు అనవసరంగా మాట్లాడక దబ్బున పిండాకూడు విస్తట్లో యిట్లా పారేద్దూ నీకు మంచి పుణ్యాం వుంటుంది."

"అదికాదుగాని, నాకాశ్చర్యం వేస్తుంది. పసిపిల్ల వాడిలాగ ఆకలికలా ఓర్వలేక తపించిపోతారేవిటి? కాస్త వంట అయ్యేదాకా ఓర్చుకోలేరూ?"

"నువ్వేమన్నా అనుగాని, ఆకలిబాధకు మాత్రం నేనోర్వలేను. అసలు నాకు ఆకలి అధికము."

"ఔను, పాపం; చాలాకష్టపడ్తున్నారు గాదూ అస్త మానం యింట్లో ఒకమూల కూచొని, చాలు చాలు లెండి. ఎవరైనా నవ్వుతారని గూడ లేకుండా అన్నానికి అలా తపించి పోతారేవిటి?"

"ఓసి, దయలేనిదానా, నీకేం నీకాకలిలేదు కాబట్టి, నెమ్మదిగా గూర్చొని ఎన్ని నీతుల్నో వుపదేశిస్తావ్? నీకేం పనా, పాటా? ఇంత వండడం, పడెయ్యడం అంతేగా. అటు వంటి యప్పుడు నీకు తిన్న అన్నం ఎలా జీర్ణమౌతుంది. నీకు అజీర్ణరోగముంది. నాకేమి అటువంటివి లేవు. శుభ్రంగా వేళకి కరకర ఆకలి అవుతుంది. తృప్తిగా భోజనం చేస్తాను. నీకు మల్లే ఆకలి మందగింపురోగం నాకులేదు. చూడు; నేనెంత ఆరోగ్యంగా వున్నానో."

"చాలు, చాలు, మీ ఆరోగ్యం మీరున్నూ, అదేమో మీరు ఆకలి అనుకొంటున్నారు? మీ రేంపని జేస్తున్నారని మీకలా ఆకలి అవుతుందో చెప్పండి. తినడం కూర్చోవడమేగా? కాకపోతే ప్రొద్దుటిపూట కాస్త స్నానం అయిన తర్వాత అలా పదియిళ్లు తిరిగి ఒకగంటలో బియ్యంతో చెంబు నింపుకొని వస్తారు. కూరా, నారా మీ శిష్యులు తెస్తారుగదా, అటువంటి యిప్పుడు మీకు అన్నం అరగడానికి మార్గంయేది? మీకిది పైత్యపు మంటగాని యాకలికాదు. కాబట్టి ముందు వైద్యుడికి చేయిచూపించుకొని దానికేదైనా మందు పుచ్చుకోండి. అంతేగాని ఆకలి ఆకలి అని యిష్టం వచ్చినదల్లా తెగతింటూ వుంటే ఆఖరికి నాకజీర్ణరోగం అబద్ధం అయినా, మీకజీర్ణరోగం నిజం అవుతుంది."

"చాలు చాలులే. నాడబ్బు నాకు పెట్టడానికి నువ్వు యేడుస్తావేమిటి? నాకొక మూలనుంచి ఆకలి దహించుకు పోతుంటే వేళకింత మెతుకులు పడేయడం పోయి ఊరికే శుష్కవాదాన్ని చేస్తావేమిటి? నీకాకలి లేకపోతే అందరికాకలి లేదనుకుంటావేమిటి?"

"నిజంగా మీకింత యాకలి యుండడం అతి దారిద్ర్యానికి హేతువు. మీకింత యాకలి వుండబట్టి మన కిలాదరిద్రం పీడించుకు తింటుంది. "దరిద్రుడికి ఆకలి యెక్కువన్న" సామెత

వృథాగా పోతుందా ? ఇటువంటి వాళ్ళకి అదృష్టం రమ్మంటే యెక్కణ్ణుంచి వస్తుంది ?"

"ఛీ, ఛీ, శకునపక్షీ, అపశకునపుమాటలాడతా వేమిటి ? నీబోటి దరిద్రపు గొట్టు పెద్దమ్మార్లుంటే మఱి దరిద్రంగాక యింకేముంది ?"

"ఔను నేను దరిద్రపు గొట్టు పెద్దమ్మవారినే. మీ కదృష్టం వచ్చింతర్వాత యింకో అదృష్టవంతురాల్ని పెళ్లి చేసుకొందురుగాని లెండి."

ఓ, తప్పకుండా చేసుకొంటా. లేకపోతే నీబోటి దరిద్ర దేవతని అప్పుడుగూడ నాతలపైన యెక్కించుకొంటా ననుకొన్నా వేమిటి ?"

"ఔతే నేనిప్పుడే వెళ్లిపోతా. మీ రేఅదృష్ట వంతురాల్ని చేసుకొంటారో చేసుకోండి."

"నువ్వుపోతే నాపీడ విరగడై పోయిందన్న మాటే."

*   *   *   *

రామసోమయాజి ఒక ఊరిలో పౌరోహిత్యం చేసుకొంటూ, ప్రొద్దుననే లేచి "భవతీ భిక్షాందేహి" అనే ఉపనయనము నాటిమాట యున్నది సుమతీ' అనిపిస్తూ తన భార్య సోమిదేవమ్మతో గాపురం చేస్తూ ఉండేవాడు.

ప్రొద్దున్నే, సూర్యోదయం కాకముందే లేచి, తన కాలోచిత కృత్యాల్ని తీర్చుకొని శుభ్రంగా స్నానముచేసి, విభూతి రేఖల్ని లలాటమున ధరించి, మెళ్లో రుద్రాక్షమాలల్ని త్రిప్పుకొంటూ, ఏవేవో శివపరములగు మంత్రాల్ని బఠిస్తూ యింటింటికి పోయి, అక్షయపాత్రను నింపుకొచ్చేవాడు. అతనికి కావలసిన కూరనారల్ని తెచ్చేందుకు కొందఱి శిష్యుల్ని గూడా తయారుచేసుకొన్నాడు. ఇక అతనికి రెండోపని యేమిలేదు. కంఠం వరకు భోజనంచేసి, అరుగుమీద, ఏవే వో శ్లోకాల్ని పఠిస్తూ, యజ్ఞోపవితాల్ని తయారుచేస్తూ వుండేవాడు, ఒకొక్కప్పుడు తన గజ్జిపొక్కులను గిల్లు కొంటూ, ఏవేవో భావాల్ని తలచుకొంటూ తనలో తానే మురిసిపోయేవాడు.

అతనికి కాళ్లు గడపలుదాటవుగాని కోర్కెలు మాత్రం కోటలు దాటుతాయి. అతనిలో ఎన్నెన్నో ఆశలు సుళ్లు తిరుగుతూంటాయి. తాను అక్షయపాత్రకి వెళ్లిన ఐశ్వర్య వంతుల యిళ్లన్ని చూసి, తానుగూడా, ఎప్పుడో ఒకప్పు డాలాగే, వారికంటె యెక్కువ యైశ్వర్యాన్ని పొందగలడని, తనకంతటి యదృష్టం కొద్దిరోజులలోనే రాగలదని వూరికే ఉవ్విళ్లూరి పోయేవాడు. ఏడంతస్థుల బంగారు మేడ, పరిచారి కాజనము, హంసతూలికా తల్పము అన్నిటిని ఊహించుకొని,

తాను, తనభార్య ఆమేడలో సకలైశ్వర్యములతో తుల తూగుతూన్నట్టుగాభావించి, ఆభావనామాత్రం చేతనే, తానా వైభవాన్నంతా అనుభవిస్తూన్నట్టుగా తలచుకొని ఉప్పొంగి పోయేవాడు. తనకు రాబోవు అదృష్టాన్ని గురించి భార్యతో జెప్పేవాడు. భార్య అతనియొక్క వెఱ్ఱితనానికి, పేరాశకి యెంతో విసుగుకొని, నవ్వేది. అది అతనికి కోపకారణమై, ఆమెను అనేకవిధాలుగా దూషించడం ప్రారంభించేవాడు. తనయొక్క భావి అదృష్టాన్ని గురించి, తనలో దానే ప్రశ్నించుకొంటూ అదృష్టదీపికను "పక్షీ, పక్షీ, ఫలంచెప్పవే అంటూ" చూసుకొనేవాడు. ఒకటి రెండుసార్లు తనకి అనుకూలంగా ప్రశ్నకు జవాబురాకపోతే, అనుకూలంగా వచ్చేదాక ప్రశ్న వేస్తూనే వుండేవాడు. ఈవిషయమై కొందఱి జ్యోతిష్కులను గూడ ప్రశ్నిస్తూ ఉండేవాడు. వారు ఇతనియొక్క పిచ్చి తనమును గనిపెట్టి ఆలాగే నీకు భగవంతుని కృపవలన కొలది కాలములలోనే గొప్ప యదృష్టము వస్తుందని ఆతన్ని సంతృప్తి పఱుస్తూ వుండేవాళ్లు. ఆతనెప్పుడూ ఆకాశానికి మెట్లు వేస్తూ వుండేవాడు.

అతని భార్య సోమిదేవమ్మకి మాత్రం తన భర్త అలా స్వర్గానికి సోపానాలు కట్టుతూ, "అదుగో అదృష్టం, ఇదుగో అదృష్టం" అంటూ యింట్లో కూచొని గొంతెమ్మ కోరికలు

కోరడం సుతరాం యిష్టంలేదు. పైగా అతనియొక్క పేరాసని చూసి, చాలా కోపగించుకొనేది. అతనెక్కడికైనా పోయి, కష్టపడి యేదైనా డబ్బు సంపాదించుకొనిరాక, ఊరికే యింట్లో తినికూచొని, ఏమీతోచక యిటువంటి గొంతెమ్మ కోరికల్ని కోరుతుంటే ఒళ్లు మండిపోయేది. అవకాశం దొరికినప్పుడల్లా నాలుగు దులిపి పారేస్తూండేది. కాని మన సోమయాజి మాత్రం సామాన్యుడా? మళ్లీ వడ్డీతోసహా భార్యకి ఒప్ప చెప్పుతూనే వుండేవాడు. పాపం; అతనికింతా చేస్తే దినభత్యమే గడవడం కష్టమైపోయింది. కాని తనకంత కంతా అదృష్టం వుందనుకొనేవాడు. సోమిదేవమ్మ మెడలో తన వివాహకాలంనాడు మొగుడుకట్టిన మంగళసూత్రం తప్పితే యింకేమిలేదు. అదిగూడా ఆమెకి చాలా విచారమైంది. పోనీ; నగలు లేకపోతే లేకపోయినాయి, ఒంటినిండ బట్ట, కడుపు నిండ అన్నం చిక్కటయే కరవాయెను. ఒకొక్కప్పుడు సోమయాజుల కెక్కడా యేమి దొరక్కపోతే ఆరోజు పచ్చి పిండి ఫలాహారమే గతి అయ్యేది. అలాంటి సోమయాజులు, ఊరికే లేనిపోని తలకుమించిన కోర్కెలు కోరుతూ, ఏమి కష్టపడకుండా, యింట్లో కూచొని భార్యతో తన భావి అదృష్టాన్ని గురించి అభివర్ణిస్తూంటే అప్పుడు సోమిదేవమ్మకి ఒళ్లు ఎలామండి పోతుందో పాఠకులే గ్రహించాలి.

సోమయాజులకి రాత్రింబగళ్లు, తనకి రాబోయే అదృష్టాన్ని గురించిన తలంపులు జాస్తిఅయినాయి. తానప్పుడే అష్టైశ్వర్యములతోటి తులతూగుతూన్నట్టుగా నటించేవాడు. తనకి బంగారు ఏడంతస్థులమేడ కావాలెనని, హంసతూలికా తల్పం కావాలెనని, అమితమైన ధనరాసు లుండాలెనని యింకా యేవేవో కావాలెనని భగవంతుని ప్రార్థించేవాడు. ఆతని కిదే త్రికాల సంధ్యావందనమై పోయింది.

* * * *

ఆరోజు అలా సోమిదేవమ్మతో బోరాడి, ఆవిడపైని అలిగి, తానే ఆవుడికి వుడకని అన్నమును విస్తరినిండ బెట్టుకొని తిని, ఆరాత్రి దేవాలయ ప్రసాదమును కడుపునిండా భుజించి, భార్యతో మాట్లాడకుండా, తాను ముసుగు బిగించుకొని, భార్య యెంతలేపినా, లేవక గుర్రుపెట్టి నిద్రపోవడం ప్రారంభించాడు. ఆతనిని లేపిలేపి ఆఖరికి విసుగెత్తి, సోమిదేవమ్మ, తన యింటిపనులన్నిటిని చక్కజేసుకొని, వచ్చి యాతనికి కొంత దూరంలో పడుకొన్నది. ఊరికే చమురు ఖర్చు ఎందుకని దీపాన్ని కొంచెం తగ్గించి, తర్వాత కొంత సేపటివఱకు భగవన్నామ సంకీర్తనాన్ని చేసుకొంటూ అలాగే నిద్ర పోయింది.

* * *

రోజుకిరోజు సోమిదేవమ్మకి కోపం జాస్తిఅయిపోయింది.

తన భర్తని అనేకవిధాలుగా చెప్పరాని తిట్లు తిట్టింది. ఆత డేమి సంపాదించి పెట్టలేని వృద్ధుడనీ, ఎందుకూ కొఱగాని వాడనీ, రాశికి రాశి కుంభం పెడితే చెల్లిస్తూ యింట్లోకూచొని, ఊరికే కబుర్లు చెప్పుతూ, పొడుం ముక్కుతో యిల్లంతా చీది అసహ్యం చేస్తూ, గజ్జిపొక్కుల్ని గిల్లుకొంటూ వుంటాడని యింకా చెప్పరాని తిట్లు తిట్టింది. అప్పుడు సహజంగా పౌరుషవంతుడైన సోమయాజి, భార్యని పట్టుకొని నాలగు ఉతికి "పో, అవతలికి, దరిద్రపుముండా, ఇకమీద నాయింటికి రావొద్దు. వచ్చావంటే చంపేస్తా" నంటూ మెడపట్టి వీధి లోనికి నెట్టివేసి, మళ్లీ రాకుండా తలుపులు రెండూ బడాయించు కొన్నాడు. తర్వాత సోమిదేవమ్మ, భర్త తన్నలా పరాభ వించినందుకు అనేక విధాలుగ ఆతన్ని దూషించుకొంటూ తన దారినే తానుపోయింది.

ఆమర్నాటినుండి, భార్యపోయిన విచారం సోమయాజికి అధికమైంది. తాను భార్యని అలా అన్నందుకు చాలా చింతిస్తూ, తనలో తానే పరాభవంచేత క్రుంగిపోతూ, అమిత మైన పశ్చాత్తాపాన్ని పొందాడు. వెంటనే బయలుదేరి భార్య పుట్టింటికి వెళ్లి తానుచేసిన తప్పుకూ చాలా దుఃఖించి, క్షమించమని కాళ్లావేళ్లా పట్టుకొని బ్రతిమాలితే అప్పుడు భార్య ఆగ్రహంతో ఆతన్ని విదలించి కొట్టివేసి, యికమీదట తాను

తన భర్తయింటికి రానని ఖండితంగాచెప్పి, యతనిని అనేక విధాలుగాతిట్టి దిగబారబోసి, చాలా నలుగురిముందు అవమానపఱచి, వీధిలోకి నెట్టి పారేసింది. అంతటితో సోమయాజికి కోపం, విచారం రెండు అధికమై ఆతన్ని ఉన్మాదుణ్ణి గావించినాయి. తనభార్య సోమిదేవమ్మ తన్ను వీడిపోయినది. ఇక తనకి దిక్కెవ్వరు? వండిపెట్టే వాళ్లెవ్వరు? పోనీ ద్వితీయ వివాహ మహోత్సవం జరుపుకుందామంటే, తనబోటి నిర్ధనుణ్ణి యెవళ్లు పెళ్లిచేసుకొంటారు? ఇక తనజీవితం యెలా గడవడం? ఇప్పుడతెడు నిరాధార పక్షి అయిపోయాడు. అప్పుడొంటరిగా ఊరిబయట వున్న ఒక శ్మశానికిపోయి, అక్కడ వుండే ఒక చెట్టుక్రింద కూర్చొని "ఆహా, ధనం లేక పోవడం వల్ల ఎంతటి దుర్దశ సంభవించింది. నిజంగా నాకే గనుక ధనంవుంటే నాభార్య నన్నిలా వదిలి వెళ్లిపోతుందా? నేనెన్ని అన్నా, ఎన్ని కొట్టినా, చెప్పుక్రింది తేలులాగ చచ్చినట్టు పడివుంటుందిగదా. అందువలననే ప్రాజ్ఞులు 'ధనమూలమిదం జగత్! అని అన్నారు. ఆమాట వ్యర్థమౌతుందా? ఇహ పర సౌఖ్యాల రెండింటికి సాధనాంతరం ధనమే. అటువంటి ధనంలేనివాడు వ్యర్థుడు. ఇహ పర సౌఖ్యాల రెండిటికి విదూరుడు. సకల పురుషార్థ సాధనమునకు మూలం ధనమే. అందుకనే ఆధనాన్ని లక్ష్మి అని పూజ్యు లుదహరించడం ప్రారంభించారు. నిజంగా ధనం గలవానియొక్క, వైభవం,

కీర్తి అష్టదిక్కుల్ని వెలిగిస్తూ, ఎల్లప్పుడాతడు నిరతానందాబ్ధి వీచికల్లో మునిగి తేల్తూ వుంటాడుగదా. కాబట్టి నాకు భగవంతుని యనుగ్రహముచేత ఆధనం లభిస్తే నేనీ ప్రపంచము నంతటిని ఒక్క వ్రేలితో త్రిప్పి వేస్తాను. సకల రాజ్యాల్ని నాఆధీనంలో పెట్టుకుంటాను." అని యీవిధంగా అనేక రీతులుగా ఆధనాన్ని గురించి, ఆధనంవలన కలిగే ఆనందాల్ని గురించి తలపోశాడు. అలా తలపోసి, కొంతసేపటికి యేలాగైనాసరే ఆధనాన్ని పొందాలెనని సంకల్పించుకొని, మొదట లక్ష్మీదేవిని గురించి యిలా ప్రార్థించాడు:—

"శ్లో॥ లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం
శ్రీరంగధామేశ్వరీం,
దాసీభూతసమస్తదేవవనితాం
లోకైక దీపాంకురాం,
శ్రీమన్మందకటాక్షలబ్ధవిభవ
బ్రహ్మేంద్రగంగాధరాం,
త్వాం త్రైలోక్యకుటుంబినీం
సరసిజాం వందే ముకుందప్రియాం"

అని యీరీతిగ శ్లోకముల వెంబడి శ్లోకములను పఠిస్తూ శ్రీస్తుతిని చేశాడు. కాని యేమిలాభం లేకపోయింది. కాని పట్టుదల మాత్రం వీడలేదు. ఆశ్మశానంలోనే విభూతిని

పూసికొని పద్మాసనా సీనుడై కూర్చొని, కళ్లు మూసుకొని, రుద్రాక్షమాలను త్రిప్పుకొంటూ, తన భ్రూమధ్యంలో పరమాత్మ స్వరూపాన్ని నిలిపి శివుణ్ణిగూర్చి తపస్సుచేయడం ప్రారంభించాడు. అన్నోదకాలు లేకుండా, రాత్రింబవళ్లు కొన్ని రోజులవఱకు అలాగే తదేక నిష్ఠతో తపస్సు చేశాడు.



అప్పుడొకరోజున, ఆతని తపస్సునకీశ్వరుడు చాలా సంతోషించిన వాడై, తనభక్తునియొక్క యిష్టాన్ని నెఱవేర్చడానికి నందివాహనం మీదెక్కి, చర్మధారియై త్రిశూలమును చేతగొని, విషసర్పముల హారాన్ని వేసుకొని, తన మూడునేత్రములతో, జటాజూటములో గంగను చంద్రుణ్ణి ధరించి, యీశ్వరుడు ఆ సోమయాజియొక్క జ్ఞానదృష్టికి సాక్షాత్కరించాడు. అప్పుడా సోమయాజి యానందానికి మితిలేదు. ఆనందంచేత చిందులుద్రొక్కడం ప్రారంభించాడు. ఆశివుని అనేకవిధాల స్తోత్రముచేసి, సాష్టాంగ పడ్డాడు. అప్పు డీశ్వరుడు, అతనిని సాదరముగా లేవనెత్తి, అతికరుణార్ద్ర హృదయుడై "నీభక్తికి మెచ్చాను. నీవు ఏదైన వరం కోరుకో. దానిని తప్పక యిస్తాను." అని అన్నాడు.

ఆమాట వినేటప్పటికి ఆసోమయాజ్జి కేలా వుంటుందో రాయడం అశక్యం. ఇదివఱకునుంచి బంగారు ఏడు అంతస్థుల మేడ, రత్నమణిమయధనరాసులు ఇంకా యేమేమో తలంపుకు వొచ్చాయి. కాని యివన్ని కోరితే "అమ్మో, యిన్ని కోర్కెల్ని కోరితే ఎలాగ. ఒకటే కోరికను కోరుకుంటే అది యిస్తాను." అని యీశ్వరుడంటాడేమో అనుకొని "ఓ అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా, ఆదిమధ్యాంతరహితా" అని స్తోత్రంచేసి "దేవా, నేను తలచుకొన్నదల్లా నెఱవేరాలి; అదే నాకోరిక" అన్నాడు. అప్పుడీశ్వరుడు కొంచెం యోచించి "సరే" అని అంతర్ధానమయ్యాడు.

* * * *

తర్వాత సోమయాజి వాళ్ల ఊరుకుతిరిగి ఊరుబయట నిలుచొని తనయొక్క వరమాహాత్మ్యాన్ని పరీక్షిద్దామనుకొన్నాడు. అప్పుడీశ్వరుని కొంతసేపు ధ్యానంచేసి, తర్వాత "నాకీ శూన్యప్రదేశంలో ఒక బంగారు ఏడు అంతస్తులమేడ కావాలి" అని తలచుకొన్నాడు. వెంటనే ధగధగ మెఱుస్తూ ఏడంతస్థుల బంగారుమేడ అక్కడ తయారయింది. అప్పుడతని ఆశ్చర్యానందాలకి మితిలేదు. వెంటనే తానామేడలో ఏడవ అంతస్థుమీద ఉండాలె ననుకొన్నాడు. అతడు కోరినట్లుగానే ఆతత్క్షణం ఏడవ అంతస్థుపైకి వెళ్లాడు. అమితానందంతో ఆ ఏడవ అంతస్తుపైన పచారీచేస్తూ, నలువంకల పరీక్షించాడు.

అంతా పెద్దమైదానం. అప్పుడు ఆమైదానం అలా వుంటే బాగుండలేదనుకొని, ఆప్రదేశం అంతా ఒక చక్కని, వివిధ ఫలవృక్షతరులతాదుల పరిమళాల్తో గూడిన ఉద్యానవనం అయిపోవాలనుకొన్నాడు. వెంటనే ఆమైదానం, సోమయాజి తనయొక్క వరప్రభావాన్ని యెంతో ఆశ్చర్యపడుతుండగా ఒక చక్కని ఉద్యానవనం క్రిందమారింది. అప్పుడతడావుద్యాన వనంలోకిపోయి విహరించి, పిమ్మట మేడలోకి వచ్చాడు. కాని పరిచారికా జనము కావద్దా? అనుకొని, పరిచారికా జనమును కోరాడు. వెంటనే వింజామరలు వీస్తూ తనకి రెండుప్రక్కల పరిచారికలు నిలబడివున్నారు. వాళ్లని చూసి, తనయొక్క వరప్రభావానికి లోపలమెచ్చుకొంటూ వాళ్లపైన తన అధికారం అంతా ఛలాయిస్తూ, వాళ్ల కాపని యీపని ఫరమాయించడం ప్రారంభించాడు. ఒకళ్లు కాళ్లు గుద్దేవాళ్లు, ఒకళ్లు ఒళ్లుపట్టేవాళ్లు యిలాగ వాళ్లంతా తయారయ్యారు. అప్పుడతడు నిజంగా దేవేంద్ర వైభవం అనుభవిస్తున్నాడు. ఇక తనకుమించినవాడు ఏలోకంలోను లేడనే మహాగర్వం అతనిలో పొడసూపింది. అప్పుడు తాను పండుకొనేందుకు ఒక హంసతూలికా తల్పం కావాలె ననుకొన్నాడు. వెంటనే అదిగూడా ప్రత్యక్షం అయింది. ఆ హంసతూలికా తల్పం మీద అతను పరుండి "ఇవన్నీ వుండి యేమిలాభం? స్త్రీలేనిదే యివన్నీ ఏవిధంగా రాణిస్తాయి?" అని తలపోశాడు.

ఇక తన దరిద్రపు పెళ్లాన్ని దరిచేర్చ కూడదనుకున్నాడు. అప్పుడు త్రిభువన సుందరిని, రంభ మేనకలను తలదన్నిన దానిని, ఒక జగన్మోహినివంటి పడుచును కోరాడు. వెంటనే




యీ పడుచు, తన సౌం దర్య కాంతిచేత ధగధగ మెఱిసిపోతూ ఆతనికళ్లని మిఱుమిట్లు గొల్పింది. అప్పుడతని యాశ్చర్యానికి మితిలేదు. ఒక్కసారి ఆ ఆశ్చర్యంలో "ఇది భూతంకాదు గదా" అనుకొన్నాడు. వెంటనే యీ




స్త్రీ ఒక భీకరాకారం దాల్చి, పొలికేక లేసుకొంటూ ఆతనియెదుట భూతాకారంతో నిలుచుంది. దానిని చూసి సోమయాజి అపరిమిత భయంతో వణుకుతూ "ఇది నన్ను మ్రింగుతుందేమో" అనుకొన్నాడు. వెంటనే ఆభూతం సోమయాజిని మింగింది.

అప్పుడు సోమయాజి "అమ్మో, చచ్చా చచ్చా, భూతం" అని కేక వేశాడు. అప్పుడు అక్కడే పడుకొన్న సోమిదేవమ్మ ఫులిక్కిపడి, ఆతనిని లేపుతూ "ఏవిటి? ఏవిటి?" అని అడిగింది. అప్పుడు సోమయాజి కళ్లు తెరిచి చూశాడు. తనమీద చేయివేసి, ఆతురతను చూపుతున్న తనభార్య కళ్లను చూశాడు. వెంటనే భార్యను కౌగలించుకొని, ముద్దులాడి తనయొక్క కలసంగతి యావత్తు చెప్పాడు. సోమిదేవమ్మ నవ్వింది. సోమయాజి, నవ్వుతో "నాపేరాశయే పెనుభూతమైంది" అని అప్పటినుంచి భార్య చెప్పినట్లు కష్టపడి డబ్బును సంపాదించి హాయిగా సంసారం గడిపాడు.

# ౬

“ అన్యాయార్జితం విత్తం సహమూలం వినశ్యతి ”

“ఏమండోయ్, యింట్లో బియ్యంలేవు, పప్పులేదు, చింతపండు వుప్పు మెరపకాయల దగ్గరనుంచి అన్ని అయిపోయినాయి. కట్టెపుల్లలుగూడా లేవు.”

“ఓసి దండుముండా, మొన్న మొన్ననే కాదటే అన్నీ తెచ్చి నీమొఖాన తగలేశింది. ఇంతలోనే అన్ని యెలా అయిపోయాయ్. చూడబోతే నువ్వు నాకొంపకి రాక్షసి లాగున్నావ్? లేకపోతే యేమైనా బియ్యం అవి అమ్ముకొని డబ్బు చేసుకొంటున్నావేమిటి ?”

“ఏం మాటలండీ యివి? ఇక్కడికి ఒక నెలరోజులు కావస్తోంది అన్ని తెచ్చి, అవైనా నేను పొదుపుగా జరుపుతే యిందాకా వొచ్చాయి. లేకుంటే అప్పుడే ఖాళిఅయేవి.”

“ నీదుంపతెగ. నీది బ్రహ్మరాక్షసి పొట్టలాగుంది. నువ్వేదో నాకొంపని కూల్చేదానివిలాగ కనబడుతున్నావు ”

“ఇదుగో యికమీ రిలాటి మాటలన్నారంటే నేను సహించేదాన్ని కాను”

"సహించకపోతే నూతిలో పడిచస్తే మంచిది. ఒక్క సారి పీడ విరగడై పోతుంది."

ఆలాగె చస్తాలెండి. పాపం; నేనుండి మీడబ్బును లూరికే దిగమింగేస్తున్నాను కామోసు."

"ఔను; నాడబ్బంతా నీమొఖాన్నే పోస్తున్నాను. నువ్వు కొద్దిరోజులలో నన్ను బికారివాణ్ణిచేసి, మల్ల చిప్ప చేతికిచ్చేట్టు ఉన్నావు."

"ఏమిటండి, పోనీగదా, అని పూరుకొంటూన్నకొద్ది మీపని శ్రుతిమించి రాగాన్ని పడ్తుందే?"

"ఊరుకోక యేంచేస్తువే తెంపిముండా. అట్టే మాట్లాడావంటే మెడనులిమివేసి నూతిలో పాడేస్తాను."

"మీకంత శరీరాయాసం అక్కర లేదు. ఆపని నేనే యెప్పుడో చేసుకొంటానులెండి. అంతకంటె మీరు నాకేం చేస్తారు? మీతో సంసారం చేయడంకంటె పాడునూతిలోపడి చస్తేమేలు. నేను కాపరానికి వొచ్చినది మొదలుకొని చూస్తూన్నానుగదా, "అయ్యో పాపం; దానికి చీరెలులేవు, రవికలులేవు" అన్నపాపాన్ని పోయారూ? ఇంతవటకూ మా పుట్టింటివాళ్లిచ్చిన చీరెలతో కాలక్షేపం చేశాను. మీకళ్లార

నేను యిలా బికారిదాన్నిలాగ చినిగిపోయిన పేలికను కట్టుకొని నల్గురిముందట తిరిగుతుంటే చూస్తూవూరుకుంటే ఆఅవమానం మీకుగాదూ? మెళ్లో ఒక మంగళసూత్రం తప్పితే వెత్తే ఒక్క ముక్కపుడక భవిష్యమేమి పెట్టగలిగారు? మీరింత వడ్డీల పైన వడ్డీలువేస్తు, బీదవాళ్లదగ్గఱ నిర్దాక్షిణ్యంగా అంతడబ్బు సంపాదించి కూడా నాకు కడుపునిండ అన్నం ఒంటినిండ గుడ్డ యివ్వడానికి 'డబ్బులేదో డబ్బులేదో' అని బీద అఱుపులు, అరుస్తారేం? అంతడబ్బు ఎక్కడ తగలడి పోయింది? పోనీ, నాకు లేకపోతే పీడానాడా కూడాపోయింది. మీరైనా కడుపునిండతిని, ఒంటినిండా గుడ్డకట్టుకోకుండా ఏభై అతుకుల ఒక కొల్లాయిగుడ్డని నడుముకు చుట్టుకొని, వెయ్యి, చినుగుల మూడుముళ్లు అంగోస్త్రాన్ని పైనవేసుకొని ఆపూటకి గతి వాళ్లాగ వుండడానికి మీ మనస్సెట్లా వొప్పింది. ఇంత డబ్బును చేర్చిపెట్టి, ఏంచేస్తారు? మనం పోయేటప్పుడు ఈ డబ్బును మనతో తీసుకువెళ్లముకదా. అన్యాయంగా బీద వాళ్ల నోళ్లుగొట్టి రెట్టింపుకు రెట్టింపుగా వడ్డీతోసహా ధనాన్ని లాగుతూ, ఆడబ్బును ఇనపపెట్టెలో పెట్టి పూజచేస్తూ సంపతోపడ్తూవుంటే మాత్రం అది యెన్నాళ్లు మనదగ్గిర నిలుస్తుంది? ఎప్పుడో ఏ దొంగలపాలో, ఏతోడుబోతుల పాలో అవడం తథ్యం. "అన్యాయార్జితం విత్తం, సహామూలం వినశ్యతి" అనే పెద్దలవాక్యం, వూరికే పోతుందా?"

"ఓసి మాలమాదిగ వెట్టిపీనాది! బుడబుక్కల, లంబాడీ, ఖాండ్ల, తూండ్ల, బూండ్ల పింజారీ! యిక నువ్వు నా యింట్లోంచి నడువు. ఇంక ఒక్క నిమిషమైనా నాయింట్లో నిన్ను వుండనివ్వను. నీవెధవముండ ఉపన్యాసాలు నాదగ్గిర పనికి రావు. ఈక్షణమే నువ్వు పుట్టింటికి ప్రయాణంగట్టు. లేకపోతే నిన్ను జుట్టుపట్టుకొని అవతలికి యీడ్చివేస్తా. నువ్వు నన్ను సర్వనాశనం చేయడానికి నా కొంపలో జేరావు. ఎరక్కపోయి నిన్ను పెళ్లిచేసుకొన్నాను. ఇక నువ్వు నా డబ్బుని దొంగలించి యెప్పుడైనా నీపుట్టింటికి ప్రయాణంగట్టే దానివే. ఇప్పటికే ఎంతచేర్చావో తెలీదు."

"ఏవిటండీ, మంచిచెప్తే అలా కోపగించుకొంటా రెందుకు ?"

ఓసి కుక్కా! మంచియేవిటే, నీమంచీ నువ్వూ తగలడా? నాడబ్బును ఏలాగైనా నువ్వు అపహరించడానికి ప్రయత్ని స్తున్నావ్? ఇకమీదట నేను నీవంటిదొంగని ఒక్కక్షణ మైనా నాయింట్లో వుంచను. పద; లేకుంటే మెడపట్టి గెంటివేస్తా."

"నేనెక్కడ పోలేను?"

" ఎక్కడికా ? పుట్లోకి "

" అంతే "

౧౩౯

"అంతేలేదు గింతేలేదు. నువ్వో దొంగముండవి. నీబోటి దొంగముండల్కి నాయింట్లో స్థానంలేదు."

"దొంగముండ, దొంగముండ అంటారేవిటి? మీ దగ్గిర ఏం దొంగలించా నేవిటి?"

"ఇంకేం కావాలి. ఆబియ్యాం, పప్పు అవన్నీ దొంగ తనంగా అమ్ముకొని డబ్బు చేసుకోవడం చాలదూ?"

"రామ, రామ."

"రామ, రామలేదు. కృష్ణ, కృష్ణలేదు. నీ గజకర్ణ గోకర్ణ, టకటొంకు టాటోటులన్నీ కట్టిపెట్టు. ఇకమీద మీ యింటికి నడువు."

"మరి యిలాంటివారు నన్ను పెళ్ళిచేసుకొన్నా రెందుకు?"

"నువ్వో దొంగముండవని తెలీక"

"దొంగముండనో, దొరముండనో, నేనెలాగైనా మీ భార్యనుకాబట్టి నాకు మీ యింట్లో సగం అధికారం వుంది."

"నువ్వో నాభార్యవు కావు. నిజంగా నాడబ్బునంతా దొంగలించడానికి భార్యగా వొచ్చిన దొంగముండవు."

"'డబ్బో, డబ్బో', అని పడియేడుస్తా రెందుకు? డబ్బు మిమ్మల్ని ఉద్ధరిస్తుందా? అది శాశ్వతమా? డబ్బు ఖర్చు

పెట్టబడతుందని భార్యని వొద్దనే మూర్ఖుడెవడైనా వుంటాడా ప్రపంచంలో."

"మాలముండా! మర్యాదలేకా, గిర్యాదలేక 'ఏడుస్తారు, ఏడుస్తారు, అని అంటావ్? పో, నాయింట్లోంచి."

అని డబ్బుకి ప్రాణానికి లంకెవేసుకొని, బీదవాళ్లదగ్గిర అన్యాయంగా సగానికి సగం వడ్డీవేసి, డబ్బును లాగేస్తూ, అందఱిచేత "ఏం అన్యాయపు ముండాకొడుకురా యీశరణం. ఈ డబ్బంతా కూడబెట్టి, కూడబెట్టి పొట్టకైనా తినకుండా ఆఖరికి ఏదొంగలపాలో చేసి చస్తాడురా పాపపు ముండా కొడుకు" అని అనిపించుకొంటూ, పిల్లికి బిచ్చంగూడా వేసి యెఱుగని పిసినిగొట్టు లింగయ్య, తనభార్య కామమ్మని జుట్టు పట్టుకొని, కాళ్లవ్రేళ్లాక్రుమ్మి వీధిలోకి తఱిమివేసి, యెంత బ్రతిమాలినా, యింట్లోకి రానీయకుండా తలుపులు బిడాయించుకొన్నాడు. అప్పుడు ఆవూళ్లో వుండేవాళ్లంతా కామమ్మని



చూసి జాలిపడి "పాపిష్టి ముండాకొడుకు, భార్య వుంటే తిండి బెట్టవలసి వొస్తుందని యింట్లోంచి తఱిమివేశాడు. పాప మా యిల్లాలిని యింత వుసురుబెట్టిన తర్వాత

వాడేం బాగుపడ్తాడు! అని అందఱు అనేకవిధాలుగా ఆపిసిని గొట్టు లింగయ్యని తిట్టారు. వాళ్లందఱూ ఆమెను ఓదార్చి, తలకొక కొంతడబ్బును చందావేసి, ఆపెను పుట్టింటికి రైలెక్కించి పంపేశారు.

కామమ్మపుట్టింటివాళ్లు తమకూతురొంటరిగా రావడం చూసి, ఆమెవల్ల యావద్వృత్తాంతాన్ని తెలుసుకొని, తమ బుద్ధిలోపమై 'బాగాడబ్బు వున్నవాడుగదా, పిల్లసుఖపడ్తుంది గదా' అని కామమ్మను లింగయ్యకి యిచ్చినందుకు ఎంతో దుఃఖిస్తూ ఆతన్ని అనేక విధాలుగా తిట్టారు. తర్వాత కొన్నాళ్లకు ఎన్నో ఉత్తరాలు లింగయ్యకు, కామమ్మను తీసుకొని వెళ్లమని రాశారు. కాని వాని నన్నిటిని లింగయ్య బుట్టదాఖలు చేసి కిక్కురుమనకుండా వున్నాడు. తర్వాత తమ కూతురిపోరువల్ల, తండ్రి లింగయ్యదగ్గరకు వొచ్చి ఏవయ్యా, అల్లుడుగారూ! ఏమిటి నీభార్యని అలా పంపేశావ్? ఏదైనా లోపంవొస్తే సద్దుకుపోవాలిగాని, అలా పండువంటి సంసారాన్ని పాడుచేసుకొంటారా? మీరు చిన్నవారు గనుక నా నేను చెప్పడానికి. మీరే బాగా యోచించండి. లోకంలో ఎంత అవమానమో భార్యని వొదిలేశాడంటే. అందులోను తిండిబెట్టలేక భార్యని వొదిలేశాడంటే అంతకన్న అవమానం యింకేం కావాలి? కాబట్టి నామాటవిని మీఅహంకారాన్ని

విడిచిపెట్టి మళ్లీ మీభార్యని మీరేలుకోవాలి. అది నాకెంత కూతురైనా ఎన్నాళ్లు నాయింట్లో వుండగలదు? అలావుంటే లోకం మనల్నిచూసి పకపక నవ్వదూ? ఇప్పుడు కామి మీకోసరం చాలా తపించిపోతుంది. కామే నన్నిక్కడికి పంపింది. కాబట్టి కామి తెలీక ఏవైనా తప్పుల్ని చేస్తే వాటిని క్షమించి మళ్లీ మీదగ్గిరకి తీసుకోవాలి. కాబట్టి నేను పెద్దవాణ్ణి. నామాట మీరు ఆదరించాలి." అని అన్నాడు.

ఈమాటలు వినేటప్పటికి లింగయ్యకి కెక్కడలేని యాగ్రహం కలిగింది. 'పీడ వొదిలిందిగదా. మనం యిక చీకుచింత లేకుండా డబ్బు ఖర్చులేకుండా కాలక్షేపం చేయ వచ్చుగదా అనుకొంటే మళ్లీ దాపురించిందిరా దేవుడా' అను కొని మామగారిని చూసి "చాలు చాలు లేవయ్యా నీధర్మ పన్నాలన్ని కట్టిబెట్టు. ఈ కల్లి బొల్లి కబుర్లన్ని ఎవడైనా పిచ్చిముండాకొడుక్కి చెప్పు. నీకూతురి బుద్ధులు, నీబుద్ధులు నువ్వు పొగడుకోవాలి గాని యింకోడు మెడమీద తలకాయ వుండేవాడెవడు పొగడడు. మీదంతా దొంగముఠా. మీలాగుననే మీకూతుర్ని గూడా దొంగదాన్నిక్రింద తయారు చేశారు. నాదగ్గిఅ ఏదో డబ్బు వుందని భ్రిమపడి మీపిల్లనిచ్చి, మీపిల్లద్వారా నాడబ్బును దొంగిలింపచేసి,

ఆడబ్బుతో మీరు హాయిగా సంసారం గడుపుతూ నన్ను మాత్రం బికారివాణ్ణిచేసి, నాకొంప కూల్చడానికి తలపెట్టారు. మీ యింద్రజాల మహేంద్రజాలా లన్నీ నాదగ్గిర కావు. మీరు చాలా శ్రమపడి యిక్కడికొచ్చారుగానిండి. ఇక వెంటనే దయచేయండి మర్యాదగా. మీదొంగ మొఖాలు నాకిక కనుపించనీయకండి. ఆదొంగముండ, మీకూతురుని యింట్లోవుండే బియ్యం పప్పు మొదలైనవి అమ్ముకొని డబ్బు చేసుకొంది. అటువంటి దొంగపెళ్లాం యిక నాకక్కరలేదు. ఇకమీదట మీరుగాని, మీకూతురుగాని నాగడప తొక్కారంటే కాళ్లు విరగగొట్టి అవతలికి తన్ని తగిలేస్తాను; తెలుసునా? అంతవరకు రానిచ్చుకోకుండ గౌరవంగా మీ యింటికి మీరుపోయి, మీయమ్మాయితో యీసంగతులన్నీ చెప్పి హాయిగా కాలంగడపండి." అని ఒక పెద్ద ఉపన్యాసం యిచ్చి, ఆయన్ని బయటికి వెళ్లిందాకా పోరి, తర్వాత తలుపుల్ని లోపలబిడాయించు కొన్నాడు.

పాపం; దెబ్బలు తప్పి, అల్లుడివల్ల తటిమివేయబడి, ఆవృద్ధాప్యంలో తన కూతురికంతటి దుస్థితి కలిగినందువల్ల దుఃఖస్తూ, అల్లుణ్ణి మనస్సులో అనేక విధాలుగా దూషిస్తూ వీధిలో నడిచిపోతున్నాడు. అప్పుడు మధ్యాన్నం ఒంటిగంటయింది. అన్నం గూడాలేదు. స్నానంగూడా చేయలేదు.

ఏమో అల్లుడున్నాడుగదా, అంత అన్నమైనా పెట్టకపోతాడా అనుకొన్నాడు గాని, పిడికెడన్నం పెట్టడానికి యేడుస్తాడని తనం మెవ్వడూ అనుకోలేదు. అప్పుడతనికి ఆకలి దహించుకు పోతోంది. ఎండ సుడివడుతోంది. ఆ చెవులోగాడ్పు ఈ చెవులోకి కొట్టుతోంది. అక్కడ హోటలన్నా లేదు భోజనం చేద్దామంటే. ఆతడు నిలవలేక పోయాడు. కాళ్లు తడబడుతున్నాయి. అప్పుడు ప్రాణం శోషవొచ్చి మునసబు గారి అరుగుమీద పడిపోయాడు. అప్పుడు కొంత సేపటికి ఆయన బయటికి వొచ్చి చూసి, "అయ్యో పాపం, వృద్ధ బాటసారి మెవరో" అనుకొని ఆయనగొంతులో కొంత నీళ్లుపోయించాడు. అప్పుడాతనికి కొంత తెలివివొచ్చి మెల్లిగా లేచి కూర్చొన్నాడు. అప్పుడు మునసబుగారు ఆతన్ని ఓదార్చి, మెల్ల మెల్లగా ప్రశ్నలువేసి, జరిగిన సంగతంతా తెలుసుకొని, "మీరు లింగయ్య మామగారా, పాపిష్ఠి ముండాకొడుకు అన్యాయంగా అంతడబ్బు పాపం పెరిగినట్టుగా పెరిగిపోతోందే, మామగారికి మీకు, ఒక్కపూట పిడికెడన్నం పడెయ్యలేక పోయాడా? అయ్యోపాపం; ఇంత వృద్ధాప్యంలో మీకెంత దుఃఖం కలగ జేశాడండి వీడు. బంగారంవంటి మహాయిల్లాలైన మీకూతుర్ని యీ పిసినిగొట్టువాడి కెందుకిచ్చారండి?" అని అనేక విధాలుగా పిసినిగొట్టు లింగయ్యను దూషించి, ఆయనకి కొన్ని పళ్లు ఫలాహారం చేయించి, తర్వాత తన

బండిమీద వాళ్లవూరు పంపించాడు. ఈసంగతంతా విని కూడా లింగయ్య, యేమాత్రం మనస్సులో జాలి అనేది లేకుండా, పైపెచ్చు మామని "దొంగముండాకొడుకు దొంగ యెత్తు వేశా"డని చెప్పి, ఆయన్ని చెప్పరాని మాటలు, తిట్టి దిగబారబోశాడు. లోలోపల యిక తనకేమి ఖర్చులేదను కొని, తన వడ్డీవ్యాపారాన్ని యదివరలకు కంటె ద్విగుణీ కృతోత్సాహంతో చేసుకోవచ్చునని, తనలోతాను అమితా నందాన్ని పొందాడు.

* * * *

పిసినిగొట్టు లింగయ్య ఒక గ్రామకరణం. ఆవూళ్లో కల్లా అతడొక్కడే చదువు తెలిసినవాడు. మంచి వ్యవహార వేత్త. నియోగి బ్రాహ్మణుడు. వాడిజుట్టు వీడిజుట్టు ముడి పెట్టి, వాళ్లని కోర్టులకీడ్పించి, దానికని దీనికని అమాయి కులగువాళ్ల దగ్గిరనుండి అపారమైనడబ్బును గుంజేసి, ఇప్పుడొక యించు మించుగా లక్షరూపాయలపై చిలుకు ఆసామి అయ్యాడు. పాపం; ఆవూళ్లోకల్లా ఆయనే చదువు తెలిసిన వాడవటంవల్ల, ఆతడు మంచి వ్యవహారవేత్త అనడం వల్ల, ఆతన్ని ఆశ్రయించుకొని ఆవూళ్లోవాళ్లుండేవాళ్లు. లోపల వాళ్లకికోపమైనా, బయటికిమాత్ర మతడేమి బుడ్డ ముంచుతాడో అని భయపడి ఆతనికి లొంగివుండేవాళ్లు. అతడు ఫోర్జరీలు, దొంగలెక్కలు వేయడం, దొంగసాక్ష్య

మివ్వడం మొదలైన విషయాల్లో బాగా ఆరితేరిన ఘటం. వడ్డీవ్యాపారంవల్ల అమితమైన డబ్బును సంపాదించాడు. సగానికి సగం వడ్డీ అధికంతో బీదవాళ్ల డబ్బును అన్యాయంగా లాగేశేవాడు.

కాని యేంలాభం? అతనికెన్ని లక్షలున్నా, ఆతని ధర్మపిండాలు, గుళ్లో ఫలహారాలు తప్పవు. అతుకులతో గూడిన చిన్న తుండు గుడ్డను మొలకు చుట్టుకొని, ఆపూటకి గతిలేని వాడిలాగ బయట తిరుగుతూ వుండేవాడు. ఎక్కడో అక్కడ తిష్ఠలేశేవాడు.

కాని అతని దురదృష్టంవల్ల పెళ్లానికి తిండికోసరం నెలకి పదిరూపాయలు ఖర్చుపెట్టవలసి వచ్చింది. ఆపది రూపాయలలో ఏమీ మిగల్చకుండా ఆతనిభార్య ఖర్చుపెట్టుతుంది. ఇక తానేలా బ్రతకడం? నెలకు పదిరూపాయలు తిండిక్రింద ఖర్చుపెట్టితే, కొంప గుండం అయిపోతుంది కాని యింకేమైనా వుందా? ఆపదిలూపాయలు మాత్రం ఎందుకు ఖర్చుపెట్టాలె ననుకొన్నాడు. అదిగాకపోయిన ఆతనిభార్య కామమ్మ, ఒకమాసమునకు, పాపం; ఎంతో కష్టపడుతూ పిసినిగొట్టు లింగయ్య పదిరూపాయలిస్తే, నెల అయిపోయే టప్పటికి మళ్లీ పదిరూపాయలు కావలంటే ఆమె ఎటువంటి గుణం కలిగి ఉంటుందనుకోవాలి? పిసినిగొట్టు లింగయ్య

ఆమెను గురించి ఏమనుకోవాలి? ఆమె ఆపదిరూపాయల్లో కొంత మిగుల్చుకొంటూన్నదో లేకుంటే కొన్న బియ్యం, పప్పు మొదలయిన వాటిలో కొంత అమ్ముతోందో అని ఆత డనుమానపడ్డాడు. కామమ్మ అలా దొంగతనం ప్రారంభించిం దనుకొన్నాడు. అటువంటి దొంగపెళ్లాం అతనికెందుకు? ఆపెనుంచితే తన డబ్బునంతా దొంగిలించేస్తుంది, కాబట్టి త్వరితంగా విడాకులిప్పించాలి. ఆఖర్చు తగ్గిపోతుంది. ఆపది రూపాయలు వడ్డీకివేస్తే బోలెడంత డబ్బు అవుతుంది. కాబట్టి కామమ్మని తరిమివేశాడు. అప్పుడు హాయిగా సర్వకాల సర్వావస్థలయందు తన యినప పెట్టెయందు గూర్చుండి, ఆ డబ్బును లెక్కపెట్టుకొంటూ, దానికింకా కొంత చేరిస్తే, 'అంత అవుతుంది యింత అవుతుంది' అని మురిసిపోయాడు. దానికోసరం తీవ్ర ప్రయత్నాలు సాగిస్తున్నాడు.

*   *   *   *

పాపం; భర్తని వొదిలిపెట్టి కామమ్మ యెంతకాలం పుట్టింటిలో వుంటుందికాని తనను, తనతండ్రిని అంత అవమాన పఱచిన భర్త ముఖం యెలాచూడడం! అయినప్పటికి భార్య లకు భర్తతోడిదేలోకంగదా! పిసినిగొట్టు లింగయ్య యెంతపాపి, దుర్మార్గుడైనా తనభర్త. తాను అతనికి భార్య. కాబట్టి, తాను తనభర్త దగ్గరవుండాలి. కాని తన నన్ని మాటలాడి, చెప్పరాని తిట్టుతిట్టి, నడివీధిలో నలుగురిముందఱ

అవమానపఱచి, 'తనగడప త్రొక్కవద్దని, తలుపులు బిగించు కొన్న తనభర్త, నేడు తాను అతనిదగ్గిరకి పోతే యింట్లోకి జేరనిస్తాడా? పాపం; తన తండ్రిని, అంతముసలి పండున్ను, అక్కడికి వెళ్లితే, నానామాటలాడి, కొట్టడానికిగూడా సిద్ధమై దొంగముఖం అని దూషిస్తూ, బయటికి నెట్టి, తలుపులు బిడాయించు కొన్నటువంటి జాలి అంతఃకరణలు లేని ఆపిసినిగొట్టు లింగయ్య, తనభర్త తనను మళ్లీ జేర్చుకొంటాడా? పోనీ, తా నాతని కాళ్లావేళ్లాబడి, బ్రతిమాల్తూ, ప్రాధేయపడ్తూ, దీనంగా యేడుస్తూ వుంటే తనభర్త హృదయం కొంచెమైనా కరగదా యేమిటి? అంటూ పోయి చూద్దాం. ఈవిధంగా కామమ్మ తన భర్తదగ్గిఱకి వెళ్లడానికి పరిపరి విధాల ఆలోచించింది. ఆఖరికి ఏమైనా సరే భర్తదగ్గిరకి వెళ్లాలి అని నిశ్చయం చేసుకొని, ఒకరోజున, తాను తన భర్తదగ్గిరకి వెళ్తానని, తన తల్లిదండ్రుల్తో చెప్పింది. వాళ్లిద్దఱు "ఒద్దు, ఒద్దు" అని అనేక విధాలుగా వాదించారు. హోరుమని యేడ్చారు. తానుగూడా వాళ్లతోబాటు కొంతసేపు ఏడ్చి, తర్వాత "ఎవరికర్మాని కెవరేం చేస్తారు?" అని వేదాంత వాక్యాల్ని పలికి, వాళ్ల చేత ఆశీర్వాదాన్ని పొంది తన భర్తయింటికి పయనమై పోయింది.

* * * *

"ఎవరు? నువ్వా!"

"ఔను"

"మళ్లీ ఎందుకొచ్చావు?"

"నాభర్త పదసేవకి"

"నీ దొంగమొఖం చూపించవొద్దని చెప్పలేదూ?"

"నేను దొంగను కాను. అగ్నిసాక్షిగా వివాహ మాడిన మీభార్యను; మీపదదాసీని."

"ఛీ; పో."

"నేను పోను."

"సిగ్గులేదూ?"

"నాభర్త యింటికి నేను రావడంలో సిగ్గుపడవలసిన పనిలేదు."

"ఓసి, పిశాచపుముండా. నువ్వొక్కడి భార్యవు, నేనొక్కడి భర్తను; నీకూ నాకూ సంబంధంలేదు."

"అన్నంతమాత్రాన సంబంధం తీరదు. ఇది ఋణాను బంధం"

"ఓసి, టక్కులాడి! మర్యాదగా పోకపోతే తన్ని తగిలేశేస్తాను."

"నేను పోను."

"పోతే; నేను వెళ్లగొడ్తా."

అంటూ లింగయ్య, ఒక కర్రబట్టుకొని ఒళ్లుపై తెలీ కుండా గుడ్డను బాదునట్లుగా కామమ్మను బాదాడు. అప్పుడు కామమ్మ ఒంటినిండ రక్తమయమైంది. గాయములు పడ్డాయి. అలా బాధపడ్తూ "ఇప్పటికైనా, నేనెటువంటిదాన్నో తెలుసు కోండి. నాకు మీపదసేవనాభాగ్యాన్ని దయచేయండి" అని కన్నీరు కారుస్తూ, ఆతని పాదాలపైనబడి హీనస్వరంతో ప్రార్థించింది. ఇనుమైనా కరుగుతుందిగాని, యినుముకంటె కఠినమైన పిసినిగొట్టు లింగయ్యాహృదయం కరగలేదు. తన కాళ్లపైన బడివున్నదాన్ని కాళ్లతోదన్ని జుట్టు పట్టుకొని బయిటికీడ్చెను.

"పోతే, మీకన్నిటికంటె డబ్బే ప్రధానమా?"

"ఔను."

"అన్యాయార్జితం విత్తం సహమూలం వినశ్యతి"

అని అంటూ, గాయముల బాధమఱచి; శక్తిస్వరూపిణి యై రౌద్రాకారంతో అక్కడనుండి ఎక్కడికో వెళ్లిపోయెను. ప్రజలందఱుద్రేకులై, లింగయ్యను కొట్టబోయిరి గాని, మునసబుగారు వొచ్చి ఆపుచేసిరి.

* * * *

అమావాస్యరాత్రి, కన్ను పొడుచుకొన్నా కళ్లు కనబడ డంలేదు. అప్పుడప్పుడు అక్కడక్కడ కుక్కల మొరుగుడు, కీచురాళ్ల ధ్వనితప్ప అంతా నిశ్శబ్దంగా వుంది. రాత్రి ఒంటి



శ్యామల్రావు సుందరరావు లిద్దఱు సమాన వయస్కులు. రూపాల్లో గూడ యిద్దఱు అన్నదమ్ముల్లాగ గనబడేవారు. చిన్నప్పటినుంచి ఒకేవూళ్లో ఒకే స్కూలులో చదువుకొంటూ ఒక క్లాసు తప్పకుండా ప్యాసవుతూ వొచ్చారు. వీళ్ల యిళ్లుగూడా వొకదానినొకటి ఆనుకొని వుండేవి. హైస్కూలులో చదివినన్నాళ్లు యిద్దరు ఒకటిగాజేరి చదివేవాళ్లు. ఎక్కడికైనా షికారుకు వెళ్లవలసివొస్తే యిద్దరుకలసి వెళ్లేవాళ్లు. వీళ్లిద్దఱి స్నేహంచూసి తోడివిద్యార్థులంతా చాలా ఆశ్చర్య పడేవాళ్లు. వీళ్ల తల్లిదండ్రులు గూడా వీళ్ల యిద్దఱి స్నేహంచూసి యెంతో మెచ్చుకునేవాళ్లు. వాళ్లిద్దరు గర్వంలేక తమ తల్లిదండ్రుల యాజ్ఞానువర్తులై మెలగుతూ ఉండేవాళ్లు.

వీళ్లిద్దరు స్కూలుఫైనలు ప్యాసయినట్లుగ తెలిసింది. వీళ్లిద్దఱికి వెయ్యిన్నూటపదహార్లు కట్నం యిచ్చి పిల్లల్ని యిస్తామంటూ ప్రతివాళ్లు వీళ్లిద్దఱి తల్లిదండ్రుల చుట్టుతిరిగేవాళ్లు.

వీళ్లిద్దటి ద్వారా వీళ్ల తల్లిదండ్రు లొకరికొకరికి అపరిమితమైన స్నేహం కుదిరింది. శ్యామలుని తండ్రి యేవిషయమైనా సుందరరావు తండ్రితో సంప్రదించి యతని సలహా తీసుకోందే చేయడు. సుందరుని తండ్రి కూడా అంతే. ఇలా తమ పిల్లవాళ్లకి సంబంధాలపైన సంబంధాలు రావడంచూసి, ఆ విషయమై శ్యామల్రావు సుంద్రావుల తండ్రు లిద్దరు కలిసికొని, తమ పిల్లవాళ్లకెప్పుడు పెళ్లిచేద్దామని చాలాసేపు చర్చ చేశారు. ఆఖరికి యెలాగైతేనేం వాళ్లకి "శుభస్యశీఘ్రం" మ్మంటూ పెళ్లిచేద్దామని నిశ్చయించుకొన్నారు. కాని పిల్లవాళ్లేమంటారో అని అడిగారు. వారు తాము బి.ఏ. ప్యాసయితేనే గాని పెళ్లిచేసుకోమన్నారు. అప్పుడు వారితల్లిదండ్రులు తాము వృద్ధులవుతున్నామని, తమ చేతులారా వాళ్లయొక్క వివాహాన్ని చేసి, కళ్లారచూసి ఆనందిద్దామని కుతూహలంగా వుందని యింకా యేమేమో చెప్పారు. అప్పుడు శ్యామల్రావు సుందరరావులు తమ తల్లిదండ్రుల కెదురాడలేక, వాళ్లకిష్టం లేకపోయినా వివాహాలకి ఒప్పుకున్నారు. అప్పుడు వాళ్ల తల్లిదండ్రులు వాళ్లిద్దరిని చూసి చాలా సంతోషపడ్డారు.

* * * *

ఒకరోజు సాయంకాలం శ్యామల్రావు సుంద్రావు లిద్దరు షికారుకువెళ్లి ఒక ప్రశాంతస్థలంలోకూర్చొని యీ క్రింది విధంగా సంభాషిస్తున్నారు.

" శ్యామల్! వాట్ డూయు థింక్ ఆఫ్ అవర్ మారే జెస్? మనకింత యంగు ఏజిలో" ఫ్యామిలీలైన్ యేవీలేక హాయిగా చదువుకొనవలసిన దినాల్లో మారేజెస్ చేయడం, మన తల్లిదండ్రుల దంత వైజుపద్ధతికాదు. దిస్ యీజ్ మై ఒపీనియన్. వాట్ డూయుసే?"

"నువ్వు చెప్పింది రైటేగాని వుయి కాంటాక్ట్ గో ఎగెన్స్ట్ ది డేర్ విల్. వాళ్లుగూడా యిప్పుడు ఓల్డుఏజిలో వున్నారు. కాబట్టి నాచ్యురలుగా వాళ్లకా అభిలాష వుంటుంది. కాబట్టి వాళ్లకి మనయొక్క యింప్లిసిట్ ఒబీడియన్సు తప్పకుండా చూపించాలి. అదిమన బౌండెన్ డ్యూటి."

"ఎస్; నువ్వు చెప్పిన ఆర్గ్యుమెంటు చాలా సౌండుగా వుంది. కాబట్టి మన ఎల్డెర్సును ప్లీజ్ చేయడానికోసరం మనం మారేజి చేసుకోవాలి. దట్ యీన్ అవర్ డ్యూటి, కాని క్షమించు నిన్నొకటి అడుగుతాను. నిజంచెప్తావ్?"

" ఏమిటది?"

"సప్పోజ్ నువ్వు మీఫాదర్ చేత ఏపిల్లలైనా సెలెక్టు చేసుకొనమని కోరబడుతావనుకో. అప్పుడు నువ్వు ఏవిధ మైన గరల్ని వైపుగా సెలెక్టు చేసుకుంటావో చెప్పు."

" నువ్వో"

"నేనా; ఏమి యింగ్లీషు ఎడ్యుకేషన్ వరల్డ్ లి నాలెడ్జి లేని బ్రూట్‌ని, కంట్రీ గరల్‌ని గాక, కొంతవరకు ఇంగ్లీషు ఎడ్యుకేషన్ వుండి, ధారాళంగా చదవడం, వ్రాయడం, మాట్లాడడం నేర్చుకొని, వరల్డ్ లి నాలెడ్జి కలిగివుండిన ఫాషనబిల్ బ్యూటిఫుల్ లేడిని పెళ్లి చేసుకోవాలని వుంది."

"బట్ ఎక్స్క్యూజ్ మి. ఐ బెగ్ టు డిఫర్ ఫ్రమ్ యు."

"ఒపినియన్సు డిఫర్ కావడములోనే ఒరిజినాలిటీ వుంది. కాబట్టి నీవోపీనియనుని నువ్వు చెప్పు."

"నాకు పటాటోపం పనికిరాదు. ఇంగ్లీషు ఎడ్యుకేషనంటే తలకాయనొప్పి. ప్రపంచ జ్ఞానం తమకే వున్నట్టు పోజు చేయడం నాకుగిట్టదు. డ్రస్సుల్లో చాలా సింప్లిసిటీ నాకుండాలి. మాడరన్ సివిలిజేషను అంటే నాకు సరిపడదు. నగలాడంబరాన్ని నేను హేట్ చేసేవాణ్ణి. ఇటువంటివేమి లేకుండా సింపిల్‌గా వుండే ఇన్నోసెంటు కంట్రి గరల్ని పెళ్లి చేసుకోవాలని వుంది."

"ఇట్ యీజ్ మె పిటీ. నువ్వు ట్వెంటియత్ సెంచరిలో వుండికూడా ఎప్పుడో పురాతనపు మాటల్ని మాట్లాడడం వింటే చాలా ఆశ్చర్యం వేస్తూంది."

"అదేవిటో నాకు ఓట్లుడేసే గోడ్లను దినాలులాగ కనిపిస్తున్నాయి."

"సరిలే. ఇప్పుడిదంతా మనం కోరుకోవడం గొం తెమ్మ కోరికల్లాగ వుంది. ఏమైనా మన ఒపీనియనుకి మన ఎల్డెర్సు ఒపీనియనుకి జతపడొద్దూ?"

"ఔను. నువ్వు చెప్పింది నిజమే 'మాన్ ప్రపోజెస్, గాడ్ డిస్పోజెస్' అన్నట్లు మన తల్లిదండ్రులయొక్క అభిప్రాయ లెలావున్నాయో!"

*　　　*　　　*

"తానొకటి తలచిన దైవమొకటి తలచు" నను సామెత ప్రకారమే శ్యామల్రావు సుందర్రావుల తల్లిదండ్రుల యొక్క యభిప్రాయాలకు తమ యభిప్రాయాలకు పరస్పరవై రుద్ధ్యభావం యేర్పడింది. శ్యామలరావుకి, సుందరరావు కోరిన గుణాలుగల భార్యవొచ్చింది, సుందరరావుకు శ్యామ ల్రావు కోరిన గుణములుగల భార్యవొచ్చింది. అప్పుడు శ్యామల్రావు సుందరరావులు తమ దురదృష్టాల్కి చాలా దుఃఖించారు. కాని యేంచేస్తారు? పెద్దవాళ్లమాట కెదు రాడలేదు. కాని యింకో ఆశ్చర్యం ఏమిటంటే, వీళ్లకిలాగే వీళ్లభార్యల యొక్క మనోభిప్రాయాలు కూడా ప్రతికూలిం చాయి. శ్యామల్రావుభార్య, కమలం, ఎప్పుడూ నిరాడంబర

జీవనంగల భర్తనే కోరినది. సుందరరావు భార్య, లలిత నవ నాగరికపు యువకుణ్ణి భర్తగా కోరింది. కాని భగవంతుడు వాళ్లకి కూడా ప్రతికూలం అయ్యాడు. ఈలాగున ఆ రెండు జంటలు ఒకళ్లు అభిరుచులకు ఒకళ్లు భార్యభర్తలుగా కుదిరారు. ఏమాత్రం సంతోషం అన్నదే యెఱుగరు.

*   *   *   *

వేసవికాలం సెలవులు అయిపోయినాయి. మదరాసులో పచ్చయప్ప కాలేజిలో సీట్లుదొరికాయి. వెంటనే వాళ్లు పట్నానికి ప్రయాణం కట్టారు. కాని వాళ్ల తల్లిదండ్రులు, కొత్తగా వివాహం అయినవాళ్లు గనుక తమ భార్యల్ని వొదలలేరనియు, అదేగాకపోయినా మదరాసులో హోటలు తిండి వాళ్లకి పడదనియు, వాళ్లతోకూడా వాళ్ల భార్యల్ని పంపారు.

అప్పుడు వాళ్లు మదరాసులోని మింటుస్ట్రీటులో వొక డాబాయిల్లును ముప్పైరూపాయలకు అద్దెకు తీసికొని, దానిని రెండు భాగములుగా జేసి, ఆ రెండు భాగాల్లోను రెండుజంటలు కాపురం చేయడం ప్రారంభించారు. శ్యామలరావు సుందరరావులు యథాప్రకారంగా తమ చదువుల్ని సాగించారు. కాని వారిద్దఱువాళ్లతో వాళ్లేం మాట్లాడుకుంటారోగాని, తమతమ భార్యల్తో అంతగా మాట్లాడినట్లు కనుపించదు.

శ్యామల్రావు సుందరరావు లిద్దఱూ కలిసి బీచికి వెళ్లివొస్తూ వుండేవాళ్లు. ఒకప్పుడుగూడా భార్యల్ని తమవెంట తీసుకు వెళ్లేవాళ్లుకారు.

శ్యామల్రావు తన పడకగదినిండా చిత్రవిచిత్రములైన ప్రేమచిత్రాల్ని తగిలించి, రంగురంగుల గాజుపూసల్ని గది గుమ్మానికి కట్టి యింకా అనేకవిధాలుగా అలంకరించాడు. ఒక స్ప్రింగు మంచము, దానిపైన మెత్తనిమొఖమల్ పరుపు, దానిపైన మల్లెపువ్వువంటి దుప్పటి, చుట్టూ దోమతెర వుంటాయి. ఇంతేగాకుండ అతని బాబ్డ్ హెయిర్, సినిమా సైడ్ కట్టింగ్సు, రిస్టువాచి, రిమ్‌లెస్ స్పెక్టేక్స్, ఆతని సిల్కు సూట్సు యివన్నీ అతనియొక్క గుండ్రని అందమైన మొగాన్కి మఱింత మెఱుగు పెడ్తున్నాయి. అవి హెజులైన్ పోస్ట్లేలుగావు, అవి హెయిర్ ఆయిల్సుగావు, అవి సెంట్లుకావు, అదివైటు రోజు వినోలియ సోప్పులుగావు. నవనాగరిక శిఖామణికుండ వలసిన లక్షణాలన్నీ శ్యామలరావులో తాండవించడం ప్రారంభించాయి. అసలే శ్యామలరావుకి నవనాగరికం అంటే చాలా యిష్టం. అందులో యిక నవనాగరికానికి ఆలవాల మైన పట్నవాసంలో వుంటే యిక ఆతని నవనాగరికపు దర్జాకి అంతు వుంటుందా? కొంచెం వైటుహార్స్ సిగరెట్లనుగూడా అలవాటుచేయడం ప్రారంభించాడు.

ఈతనిలో యిలా మార్పులు కలగడం, సుందర్రావుకి ఆశ్చర్య విచారాల్ని కలిగించింది. శ్యామలరావు నిష్కారణంగా చెడిపోతాడేమో అనుకొన్నాను. ఒక్క త్రాగుడు మినహా తక్కిన అన్నిగుణాలు వున్నాయి. సుందర్రావు మట్టుకు యథాప్రకారమైన క్రాపునే గలిగి, శుభ్రమైన తెల్లని యేడుమూళ్ల ధోవతి, తెల్లని లాల్చీ, తెల్లని పైకండువా వేసుకొని కాలేజీకి వెళ్తూవుండేవాడు. అతనియొక్క నిరాడంబర జీవనాల్ని చూసి, అందరు అతణ్ణి పెద్దమనిషిక్రింద భావించేవారు. ఆతనియొక్క సలహాలనుకూడా తీసుకొనేవాళ్లు.” అతడింటివద్ద గూడ నిరాడంబరంగానే వుండేవాడు. ఒక నవారుమంచము, ఏవో రెండుమూడు పటాలు మాత్రమే అతని పడకగదిలో వుంచాడు. ఆతనికేవిధమైన దురభ్యాసం లేదు. ప్రొద్దుననే లేచి శరీరవ్యాయామం చేసేవాడు. జ్వరం, తలకాయనొప్పి అని యెఱుగడు. మంచి ఆరోగ్య స్థితిలో వున్నాడు. ఆతనింటికి ఎవరైనా పెద్దమనుష్యులు రావడం పోవడం జరిగేవి. శ్యామల్రావు యింటికి గూడా ఆతనియింటి నవనాగరికపు దొరలే వొచ్చేవారు. వారు సుందర్రావును చూసి, అసహ్యించుకొనేవాళ్లు. కాని సుందరరావుయొక్క రూపం సహజంగా శ్యామలరావుకంటే చాలా సౌందర్యంగా వుంటుంది. సుందరరావుయొక్క అందమంతా ఆతని విశాలనేత్రాల్లో తాండవిస్తూవుంటుంది.

శ్యామలరావు తనభార్యకి చీరెలు, నగలు, యింకా యేవేవో నవనాగరికపు వస్తువులన్నింటిని కొనెను. ఆమెను నవనాగరికపు యువతిగా చేసేద్దామని అతనివూహా. కాని కమలం వానినంతగా ధరించేదికాదు. అతడెన్ని ఘోషనులు చెప్పినా ఆయువతి మామూలు నిరాడంబరముగలదానినే ధరించేది. ఆమెను సిల్కు చీరెను కట్టుకొనమంటూ డాతడు. ఆపె తెల్లనిచీరె, తెల్లనిరెవికె ధరిస్తుంది. పౌడర్లను, సోపులను వాడమంటాడాతడు. ఆపె పసుపును, సున్నిపిండిని వాడేది. కామినియా హెయిర్ ఆయిలు తలకు రాసుకోమంటే, కొబ్బరినూనె రాసుకుంటుంది. ఈవిధంగా శ్యామలరావుకి ప్రతివిషయంలోను ప్రతికూలమైంది. ఆతని అభిప్రాయాలు, అభిరుచులు, నవనాగరికపు దొరవేషం, ఆడంబరం ఇవి అన్ని ఆమెకిష్టము లేకపోయినాయి. తనభర్త కూడా సుందరరావులాగ నిరాడంబరంగా వుంటే చాలాబాగుంటాడని కమలం ఊహ. అందువల్ల అప్పుడప్పుడు అతనికి చూచాయగా చెప్పేది. కాని అతడు ఆగ్రహావేశుడై ఆమెని చావమోదేవాడు. సుందరరావు అడ్డుపడేవాడు. అప్పుడు శ్యామలరావుకి సుందరరావుమీాద చాలా కోపంవొచ్చి యేదో తూలనాడితే, సుందర్రావు తప్పుకుపోయేవాడు. కాని శ్యామలరావు సంగతికి మాత్రం సుందరరావు చాలా విచారించాడు. శ్యామలరావు షోకుల్లోపడిపోయి చదువు సంగతికూడా మరిచి

పోయాడు. ఎప్పుడూ ఏసినిమాకో, నాటకానికో వెళ్లుతుండే వాడు. సుందరరావు కాలేజీవొదలగానే యింటికివొచ్చి బీచికి వెళ్లేవాడు. లలిత, సుందరరావు చెప్పిన హితోప దేశాన్నంతా పెడచెవినిబెట్టడం ప్రారంభించింది. అతని యొక్క శాంతస్వభావాన్ని చూసి, పిచ్చిముండావాడనుకొంది. అతనియొక్క నిరాడంబరత్వాన్ని, ఏమికొనక పోవడాన్ని చూసి లుబ్ధుడనుకొంది. ఆతనిని తాను చీరెలు నగలు యింకా యేవేవో కోరితే, అవియన్ని వ్యర్థాడంబరాలంటూ ఆతడు ఉపదేశిస్తే అదియంతయు వ్యర్థప్రలాప మనుకొంది. ఆతన్ని ప్రతిరోజూ 'అదికావాలి, ఇదికావాలి, అంటూ, సినిమాకి తీసుకువెళ్లమని, నాటకానికి తీసుకువెళ్లమని వేపుకు తింటూండేది. అతడు "నావల్లకాదు" అనేవాడు. దాని కతనిని అనేకవిధాలుగా దూషిస్తూ, సూటీపోటీ మాటలంటూ, సాధించడం ప్రారంభించింది. కాని సుందరరావు వానినన్నిటిని శాంతంగా ఓర్చుకొనేవాడు. శ్యామలరావు, సుందరరావుతో "ఏమోయ్ నువ్వు పల్లెటూరి గబ్బిలాయి, లాగుంటే నీపెళ్లాన్నిగూడా అట్లా ఉండమంటావేమిటి? ఈవయస్సులో కాకపోతే యింకెప్పుడు షోకులు చేసుకుంటావేమిటి?" అని సలహాయిచ్చేవాడు. కాని ఆతడు చెప్పడానికెల్లను తలకాయ ఝూపుతూ చిరునవ్వు నవ్వేవాడు. అలా సలహాయిస్తుంటే, లలిత, శ్యామలరావుయొక్క నవనాగరికత్వాన్ని చూసి

యెంతో మెచ్చుకొనేది. తనుతరఫున తనభర్తలో ఆతడలా వాదిస్తుంటే, లలిత చిరునవ్వు నవ్వుతూ, వోరచూపులతో భర్తకి తెలీకుండా శ్యామలరావును చూసేది. ఒకటిరెండు సార్లు లలిత తనను చూస్తూన్నప్పుడు శ్యామలరావు చూశాడు. తనయొక్క నవనాగరిక సౌందర్యానికి లలిత ముగ్ధత్వం చెందింది అనుకొన్నాడు. అప్పటినుంచి అవకాశం చిక్కినప్పుడెల్లా ఒక చిరునవ్వు ఒక క్రీగంటిచూపు విసిరేవాడు. దానికి సమాధానం లలితకూడా యిచ్చేది. దానితో శ్యామలరావు హృదయం ఆనందంతో త్రుళ్లిపడింది. "ఆహా, లలిత నిజంగా తెలివిగలది. ప్రపంచజ్ఞానంగలది. ప్రేమ అంటే అర్థము చేసుకోగలిగేది. కొంచెం యింగ్లీషువిద్యా సంపర్కం గూడా గలిగివుంది. ఇటువంటిభార్య, నేను కోరింది. కాని భగవంతుడు అనుగ్రహించాడు కాడు. ఆహా, నిజంగా లలితవంటి చమత్కారపు మనిషి, తెలివిగలది వేఱొకర్తె వుండదు. నిజంగా యీలలిత నాకు భార్యకావలసింది. లలితే నాభార్యఅవుతే నాఆనందం అపారం. నాసౌఖ్యం అమేయం. నాసంసారం స్వర్గం." అని యీరీతిగా భావించడం ప్రారంభించాడు. క్రమక్రమమేణా మోహాంధకారము అతని కండ్లను క్రమ్ముచున్నది. ఒకొక్కసారి లలితను అమాంతంగా కావులించుకుందామనే టంతటి యున్మాదంలో వుండేవాడు. కాని స్నేహితుని తలచుకొని కొంచెం తమాయించేవాడు.

ఇదివరకు లలిత అంతగా తనకు కనబడేదికాదు. ఇప్పుడు తనకు కనబడుతోంది. కనబడడమేగాకుండా చిరునవ్వును, క్రీగంటి చూపుల్ని విసురుతోంది. తనలో వొక యవాచ్యమైన ఆనందసుధను గల్పిస్తోంది. లలితయొక్క ముఖబింబోదయము కాగానే, శ్యామలరావుయొక్క హృదయముప్పొంగేది.

తనభర్తలో యీలాటి మార్పుల్ని కమలం చూసింది. ఏకారణంచేత తనభర్త అలావున్నారో అనుకొంది. ఇప్పుడు శ్యామలరావు కాలేజికి, తఱుచుగా వెళ్లడం మానేశాడు. సుందరరావు కారణము అడిగాడు. కాని ఏతలకాయనొప్పో, ఏకడుపునొప్పో అని సమాధానం చెప్పేవాడు. కమలం అతనికి అనేక ఉపచారాలు చేయబోయేది. కాని కమలాన్ని చీదరించుకొంటూ, దూషిస్తూ పాదతాడనం చేసేవాడు. అది కమలానికి దుస్సహం అయిపోయింది. అయినదానికి, కాని దానికి కమలాన్ని కొట్టుతూవుండేవాడు. అలా కొట్టుతూన్నప్పుడు మాటవరుసకైనా లలిత, కమలాన్ని ఓదార్చేదికాదు. ఇప్పుడు లలిత యిదివరకు మళ్లీ కమలంతో మాట్లాడడంలేదు. ముక్తసరిగా మూడు పెడసరం మాటలు అని ఊరుకుండేది. లలితకు తనమీద యింతటి కోపకారణం ఎందుకా అనుకొంది. తానేమి లలితయెడల తప్పుచేయలేదే. అలాంటి అప్పుడు

లలిత తనతో మాట్లాడకుండా ఉండడానికి కారణం కనబడదు. అందులో మఱీ ఆశ్చర్యం యేమిటంటే లలిత తనతో మాట్లాడడం మానేసిన నాటినుండి తనభర్త తనను బాధించడం జాస్తిఅయిపోయింది. అయినా తనమాట వినలేదేమో అని భర్త తన్ను అలా హింసిస్తున్నాడనుకొని ఆతడుచెప్పిన ప్రకారం పోకులుచేయడం మొదలుపెట్టింది. కాని అదిచూసినప్పుడు తనభర్త మఱింత భగ్గుమనేవాడు. కమలం కారణానికై రాత్రింబగళ్లు విచారించడం మొదలుపెట్టింది.

సుందరరావుకు గూడా శ్యామలరావు విషయంలో కొంచెం సందేహం తట్టింది. ఒకవేళ తానతనిని కొంచెం కఠినంగా మందలిస్తున్నాడని కోపం వొచ్చిందేమో అనుకొన్నాడు. ఇప్పుడు ప్రాణస్నేహితుడు, బాల్యస్నేహితుడునగు శ్యామలరావు తనతో సరిగామాట్లాడకున్నాడంటే సుందరరావుకి చాలా కష్టమైంది. అనేకసార్లు శ్యామలరావును కోపకారణం అడిగాడు గాని సరిగా ప్రత్యుత్తరం చెప్పలేదు. అతనికంతా అయోమయంగా కనిపించింది. అట్లే రాత్రింబగళ్లు ఆలోచించడం ప్రారంభించాడు. కాని ఆలోచన తెగలేదు. ఇప్పుడు తనభార్య లలిత తనని ఎందుకూ కొఱగాని వాణ్ణిగా కట్టేని, యీమాటా ఆమాటా అంటూ చిరాకుపడేది. ఇది అంతా అతడు యోజించుకొన్నాడు. తనస్నేహితుడు తనతో

మాట్లాడుట మానివేసిననాడే తనభార్య గూడా తనతో మాట్లాడుట మానివేసినది. ఇది తలచుకొంటే అంతా ఆశ్చర్యంగా కనబడింది. తనభార్యకి తనమీద అంత ఆగ్రహం యెందుకో తెలియలేదు. కారణం తనభార్యని అడిగాడు. కాని చెప్పలేదు. అతడు మొఖలక్షణములనుబట్టి మానసిక తత్త్వములను కనిపెట్టడంలో నేర్పరికాబట్టి, తన భార్యమొఖంలో ఒకవిధమైన మార్పునుగాంచి "అదియెందుకా?" అని ఆలోచించడానికి ప్రారంభించాడు. అయినా అదేవిటో కనిపెట్టలేక పోతామా అనుకొన్నాడు. కాని తాననుమానపడ్తున్నట్లుగా బ్రహ్మదేవుడికైనా తెలియనీయలేదు.

*   *   *

మామూలుగా ప్రొద్దున్న పదిన్నరగంటలకు భోజనం చేసి కాలేజీకి వెళ్లేముందు సుందరరావు శ్యామలరావును కూడా పిలచాడు. శ్యామలరావు మామూలు సాకునుచెప్పి ఆపూటకు రాలేనన్నాడు. తర్వాత సుందరరావు కాలేజికి వెళ్తానని పుస్తకాలు పట్టుకుని యిల్లువెడలి వచ్చాడు. సుందరరావు వెళ్లగానే లలిత తనకురులను చక్కగా క్రాపులాగు దువ్వి తలలో పూలుపెట్టుకొని చక్కని చీరనుధరించి షోఫ్ బాడి రవికతో అటూ యిటూ నాల్గుసార్లు పచారీ సాగించింది. కమలం మామూలుగా భర్త తనకుయిచ్చే

ప్రహారణాలిసి పుచ్చుకొని వంటయింటిలోనే పడుకుంది కాని కమలానికి భర్తయొక్కయు లలితయొక్కయు చేష్టలు చూచాయగా అనుమానాన్ని కలుగజేశాయి. అందువల్ల మెల్లాగైనా నిజాన్ని కనిపెట్టాలని తనలోతాను దృఢపరచుకొంది. గాఢనిద్రపోతూవున్నట్లుగా కళ్లు మూసుకుంది.

ఒక అరగంటసేపటికి శ్యామలరావు మెల్లగా భార్య దగ్గరకువచ్చి నిద్రపోతూవుందో లేదో అని పలికించాడు. నిద్రపోతోంది అని బాగా దృఢంచేసుకుని తర్వాత సంతోషంతో బయటకువచ్చి సుందరరావు గదిలో తనకోసరమై నిరీక్షిస్తూవున్న లలిత దగ్గరకు వెళ్లాడు. అప్పుడు లలిత యేదో పరధ్యాన్నంమీద వుండగా వెనకప్రక్కగాపోయి రెండుకళ్లును మూశాడు. అప్పుడు లలిత "అబ్బా! తెలుసు వదలండి" అని బాధనభినయిస్తూ అతని రెండుచేతులని తన రెండు చేతులతో పట్టుకొంది. అప్పుడు శ్యామలరావు వదలివేశాడు.

"లలితా, నేనున్ను సుందర్రావున్ను మా వివాహాలు కాకముందు మేము కోరే భార్యలు యెటువంటివాళ్లు అయి వుండాలో అంతా చెప్పుగున్నాము. అప్పుడు నేను నీవంటి ఇంగ్లీషువిద్య తెలిసిందాన్ని ప్రపంచజ్ఞానం కలదాన్ని నాగరికిత అంటే యేమిటో గుర్తుయెరిగినదాన్ని భర్యగా కోరాను.

ఆతడు నిరాడంబరమైన ఉడుపులను ధరిస్తూ నాగరిక సంపర్క మన్న మాటే తెలియక 'యెద్దు మొద్దు యేలరావు' అన్నమాదిరి ఉండే మూర్ఖురాలైన భార్యను కోరాడు. కాని దైవము ఓర్వలేక నేనుకోరిన భార్యను అతనికి, అతనికి కావలసిన భార్యను నాకు అంటగట్టాడు. నాకు కమలానికి ప్రతివిషయ ములోను పరస్పర భేదాభిప్రాయం ఉంటుంది. కమలాన్ని నేను యెంతమాత్రమున్నూ ప్రేమించడములేదు. నేను మొట్ట మొదటినుంచి త్రికరణ శుద్ధిగా నీవంటిదానినే ప్రేమిస్తూ వున్నాను. ఇప్పటికి దైవం నాకు అనుకూలించి నిన్ను నాకు యివ్వడము మా మహాభాగ్యం. నేను, నువ్వు నాస్నేహితుడి భార్యవని యెన్నోసార్లు యెంత ప్రయత్నించినా నాహృదయం నీ ప్రేమపాశాలచేత నీవద్దకు యీడవబడింది. తర్వాత యేమికానున్ననుసరే, నిన్నుమాత్రం నేను విడువను. నువ్వు నాప్రేయసివి, నేను నీప్రియుడను" అని లలితతో శ్యామల రావు తనప్రేమనంతా నివేదించాడు. లలితకూడా తాను నవనాగరికపు యువకునినే యెప్పుడూ కోరానని కాని దైవం ప్రతికూలించడమువల్ల తద్విరుద్ధంగా జరిగిందని, నిజంగా తన భర్త సుందరరావుకు తగినభార్య నీభార్య ఔతుందికాని నేను కాను. అని చెప్పింది. ఆ చివరమాటకు శ్యామలరావు మనస్సు చివుగుమన్నది కాని లలితయొక్క ప్రేమాలింగన చుంబనాదుల పారవశ్యంచేత అంతా మరచిపోయాడు. అలా

వాళ్లిద్దరు మైమరచి పారవశ్యంలో ఉండగా అడుగులో అడుగు యిడుకొంటూ తన వంటయింటి తలుపును తీసుకుని కమలం వాళ్లిద్దరియొక్క చేష్టలనీ చాటుననుండి తొంగిచూచింది.



అప్పుడు ఆమెహృదయం బరువెక్కి దుఃఖం చేత వివశత్వంచెంది కంఠం రుద్ధమై కన్నులు అశ్రుపూరితాలై చైతన్యంలేని కీలుబొమ్మలాగు అక్కడే అలాగే నూలబడిపోయింది.

ఇంతలో చాటున నూలబడివున్న కమలముమీద ఒక వ్యక్తియొక్క నీడపడింది. అప్పుడు కమలం ఉలికిపడి తల పైకి ఎత్తిచూచింది. అలాగే కండ్లనెంబడి నీళ్లుకారుస్తూ యేమేమో చెప్పబోయి చెప్పలేక అదరుతూవున్న పెదవులతో కంపిస్తూ ఆవ్యక్తివంక చూస్తున్నది. అప్పుడావ్యక్తి కమలాన్ని యేదో ప్రశ్నవేయ బోయాడు. కమలం వూరుకోమన్నట్టుగా సంజ్ఞచేస్తూ ఆగదివైపుగ తన వ్రేలినిచూపింది. అప్పుడు ఆవ్యక్తి మెల్లగాపోయి గదిలోకి తొంగిచూచి చప్పున వెనక్కి తిరిగి నిస్తబ్ధుడై నీరసుడయిపోయాడు. ఆతన్నిచూచి కమలం దీనత్వాన్ని తెలియజేస్తూవున్న చూపులతో లాలిస్తూ ఆతని

వంకకు మెల్లగావచ్చింది. అతడు కమలం చూపులలోని నిష్కాపట్యాన్ని ఒకవిధమైన ఉత్కృష్టభావాన్ని చదివాడు. అప్పుడు అతనికళ్లల్లో నూతన కాంతి ఉద్భవించింది. అప్పుడు కమలముయొక్క దృశ్యం ఆతని కళ్లను మిరుమిట్లు గొల్పుతూ ఆతన్ని మంత్రబద్ధుడిలాగ చేసివైచింది. అలాగే వెర్రివాడి లాగ కమలంయొక్క అమాయికపు విగ్రహాన్ని చూస్తూ నిల బడ్డాడు. కమలం ఆతనియొక్క మనోభావాల్ని గుర్తించినదై మెల్లిగా ఆతనిచేయి పట్టుకుంది. ఆకమలం చేతితాకుడు సుందరరావుయొక్క శరీరంలోకి ఒక విద్యుచ్ఛటను పంపి అతన్ని వూపివైచింది. ఆవిద్యుత్ప్రసారధాటికి సుందరరావు సహించలేక కమలాన్ని వూతచేసుకొన్నట్టుగా రెండు చేతు లను పెనవైచి ఆలాగే పట్టుకున్నాడు. కమలం ఆతని దృఢ బాహు పరిష్వంగనంలో అలాగే వుండిపోయింది. ఈవిధంగా ఒక పావుగంట సేపటివరకు గదిబైట శ్యామలరావుయొక్క భార్య సుందరరావు కౌగిటి పంజరములోను, సుందరరావు యొక్క భార్యగదిలో మంచముపైన శ్యామలరావుయొక్క కౌగిటి పంజరంలోను చిక్కుకొని స్వర్గానందాన్ని అనుభవిస్తూ ఉన్నారు. అప్పటికి కాఫీ సమయమైంది. లోపలనుండి శ్యామలరావు కాఫీతాగటానికని బయటికివచ్చాడు. ఆతని వెనకాలే లలితకూడా వచ్చింది. ఇంకా కమలం సుందర రావులు యీలోకానికి రాలేదు. ఈలోకాన్నంతా మరిచి

పోయి అవ్యక్తానందంలో మునిగిపోయి తన్మయత్వంచేత నేత్ర ములను మూసుకొని ఒకరి భుజముపైన ఒకరు ఒదిగివున్నారు. అలాంటి స్థితిలో వాళ్లిద్దర్ని లలితా శ్యామలరావులు చూసి నిర్విణ్ణులైపోయారు. ఒక్కసారి కోపంతో శ్యామలరావు "ఓసీ," అని అరిచాడు. వెంటనే ఉలిక్కిపడి కమలం వెనక్కి తిరిగిచూచింది. కమలాన్ని శ్యామలరావు ఉరిమిచూస్తున్నాడు. సుందరరావుని తన చెదురు కళ్లతో లలిత చూస్తూంది. లలిత ను సుందరరావు తీక్ష్ణమైన నిశ్చలములైన చూపులతో చూస్తూన్నాడు.



"సుందరా, యేమిది!"

"తుక్కుకాటుకు చెప్పు దెబ్బ" అని సుందర్రావు చెప్పగా లలితా శ్యామ లులు సిగ్గుచేత తలకాయ వంచుకొని అలాగే నిల బడిపోయారు. కమలం సుందర్రావులు ఒకరిచేయి ఒకరుపట్టుకొని వేరొక గదిలోనికి వెళ్లిపోయారు.

---

౮

అవధాని అనుమానమే అంతానికి కారణము.

"ఈ కాలంలో అన్నీ విపరీతాలె. ఎక్కడ చూచినా క్రొత్త క్రొత్త విషయాలే కనబడుతూ ఉన్నాయి. లేకపోతే యేమిటండి యీ అన్యాయం. ఆడదానికినచ్చిన తర్వాతనేగాని పెళ్లికుదుర్చరాదట, పెద్దమనుషి అయితేనే గాని పెండ్లిచేయరాదట. ఇటువంటి విపరీతాలన్నీ బయల్దేరుతూ ఉన్నాయి. 'వినాశకాలే విపరీతబుద్ధిః' అన్నారు. మునుపటి దినాలలో ఏదో పెద్దలువెళ్లి పెండ్లికుదర్చడం పిల్లకి యీడు తప్పకుండా ఉన్న దినాలలో హాయిగా పెండ్లిచేస్తూ ఉండడము మామూలు. అటువంటి పెద్దరికమంతా పోయింది. ఈరోజుల్లో చూడండి మనబోటివాళ్లం వెళ్లి పిల్లనడిగితే మొట్ట మొదట అమ్మాయి యిష్టంకావాలని, ఆతర్వాత తల్లి దండ్రుల యిష్టం అవాలనీ యేమేమో లేనిపోని అడ్డాలు యెన్నో యేకరువు పెడతారు. పిల్లను యిచ్చి పుచ్చుకోవడములో మగవాడి యిష్టంతో సరిపోదట. ఆడదాని యిష్టం కూడా ఉండాలట. నిజంగా యిలాగు ఆడదానికి అధికారం కాని యిచ్చామంటే యింకయేమన్నా వుందా, మనకొంపలు ముంచివేస్తారుగాని! అన్నన్నా యిదియేదో పోయేకాలం

దగ్గరకు రావడముచేతనే యిలాగు మనవాళ్లు ఆలోచనలు చేయుడము వచ్చింది" అంటూ రామావధాని అరుగుమీద కూచొని లెక్ చెర్లు కొడుతూ వుంటాడు ప్రతి ఉదయమున్ను. అతనివయసువాళ్లే ఆచుట్టూమూగి కూచొని రామావధాని అనిన ప్రతిమాటకున్ను తలలు ఊపుతూ వుంటారు వాళ్లంతా. అతనికి యిదివరలో యిద్దరు భార్యలు ఒకరివెనకాతరవాత యింకొకరుగా ప్రాణాలు వదిలారు. రామావధానికి పెండ్లి చేసుకొనడమంటే అదిచాలా సూక్ష్మమైనపని. ఆడపిల్ల అతని దృష్టిలో ఒక ఆటవస్తువు. అందువల్లనే అతను ఆడవాళ్ల వ్యవహారాలు వచ్చాయి అంటే మహా చులకనగా మాటా డుతూ వుంటాడు.

రామావధాని మొదటిభార్య గర్భంధరించి వున్న సమయాని ఆగ్రహంచేత ఆమె ఉదరముమీాద తన్నడమువల్ల పాపం ఆమె ప్రాణాలు వదలింది. ఇంక రెండవ దఫా పెళ్లి చేసుకున్నాడు. రెండవభార్య తులశమ్మ మొదటినుంచీ ఒక యువకుణ్ణి ప్రేమించినప్పటికి డబ్బేప్రధానంగా చూచుకొంటూ ఉండే తల్లిదండ్రులు తులశమ్మను రామావధానికి అమ్మివేశా రు. తులశమ్మ కొన్నాళ్లు కంటికి మింటికి యేకధారగా యేడ్చి యేడ్చి ఆఖరుకు యింక ఆయువకుడి చిత్రాన్ని తన హృదయఫలకం మీాదనుంచి పూర్తిగా తుడిచివేసుకుని రామా

అవధాని అనుమానమే అంతానికి కారణము.

వధానినే భర్తగా గైకొని యెలాగో ఒక లాగు కాలంనెట్టి వేద్దామనుకుంది కాని రామావధాని సామాన్యుడా? ఆమెను పెట్టరానన్ని యిబ్బందులపాలు చెయ్యడము మొదలుపెట్టాడు. జడ వేసుకోవడము వేశ్య లక్షణముకాని సంసారులకు పనికి రాదనేవాడు. తాను యింటినుంచి బయటకు వెళ్లిన మరుక్షణాన్నే ఆమె నగలన్నితీసి పెట్టెలో పెట్టుకొని యెటువంటి సింగారింపున్ను లేకుండా ఉండాలనుకొనేవాడు. ఆమెకు యింటిలో యెటువంటి స్వాతంత్ర్యాన్ని గాని యిచ్చేవాడు కాదు. వంటల దగ్గరనుంచి సహా ఆమె కట్టుకునే చీరల పద్ధతి దగ్గరనుంచి సహా అతను చెప్పినదే చెయ్యాలి కాని యేమాత్రపు దారితప్పడము జరిగినా ప్రహరణాలు తప్పేది కావు. ఇటువంటి నిర్బంధ జీవితము గడపవలసి వచ్చినందుకు ఆమె చాలా విచారించింది. కొన్ని నెలలు యెటువంటి విసుగుదలకూడా లేకుండా ఓపికతో ఊరుకుంది. అటువంటి సమయంలోకూడా రామావధాని ఆమెను యేదో వొకటి అంటూవుండేవాడు. దేనికన్నా కొంతహద్దు నియమము వుంది. అటువంటిదాన్ని దేనినీకూడా రామావధాని పాటించేవాడు కాడు. ఉదయము లేచిందిమొదలుకొని రాత్రి పదిగంటలవరకు ఆమెను సాధిస్తూనే ఉండేవాడు. ఆఖరుకు విసిగెత్తిపోయింది తులశమ్మకు. ఆమె మనస్సుకు సుఖమనేదే లేదు. ఇంక యెక్కువకాలం వోపికతో వుండలేకపోయింది.

అంచేత ఒకరాత్రి తులశమ్మ రామావధాని పెట్టిన నగలన్నీ అతని ముఖాన్న విసరివేసి యింక యీ యింటిలో వుండలేనని అంటూ రాత్రి రాత్రియే యిల్లువిడచి వెళ్లిపోయింది. ఆమె యెక్కడ వుందో యేమైందో నేటికికూడా యెవ్వరికిన్నీ తెలియదు.

ప్రస్తుతం రామావధాని యింకొక పిల్లను పెళ్లిచేసుకో వాలని ప్రయత్నిస్తున్నాడు. ఇప్పుడిప్పుడే పిల్లల తండ్రిలు వివాహవిషయాలలో పిల్లలయొక్క అభిప్రాయం తీసుకొంటూ ఉండడమువల్ల రామావధానికి పెండ్లి మునుపటి అంత త్వరగా కుదరకపోయింది. అందువల్లనే, అతను అంత తీవ్రంగా విమర్శించడము జరిగింది.

ఆఖరుకు దేశాలుగాలించివేసి ఒక దామోదరుణ్ణి పట్టాడు. అతనే సుబ్బన్న శాస్త్రులు. సుబ్బన్న శాస్త్రులు మహా నగరంలో ఒక చిన్న ఆఫీసు తెరిచిపెట్టుకున్నాడన వచ్చును. ముసలివాళ్లకు పిల్లలను కుదర్చడమే అతనిపని. అతను నిత్యము అదేపనిమీద తిరుగుతూ వుంటాడు. ఇవ్వాళ మదరాసులో వున్నాడంటే రేపటి సాయంత్రానికి అతను మధురలోవుంటాడు. మళ్లీ అమర్నాడే చూస్తే కంచిలో వుంటాడు. ఇలాగుననే అతను సంవత్సరములో అధమము మూడువందల ముప్ఫయి దినాలు టూరింగ్ మీదనే ఉంటాడు.

అటువంటి సమయంలో వృద్ధులు మద్రాసులోవచ్చి అడ్వా న్సులతో సిద్ధంగా కొన్నినెలలకాలం వడిగాపులు పడి వుంటారు. అదిగాక పెద్దమెట్టు ప్రాంతాన్ని ఒకయిల్లు అద్దెకు తీసుకొని అక్కడ అక్కడా పెండ్లిపేరిట అమ్మబడేటటువంటి పిల్లలనందరిని తీసుకొనివచ్చి నిల్వచేస్తాడు. ఇంక అయిదవ పదిదాటిన యువకులు అంతావచ్చి తమ రూపరేఖా విలాసా లకు తగినటువంటి పిల్లలను యేరి చెల్లించవలసిన మొత్తాలను చెల్లించుకొని పెండ్లిచేసుకుంటారు.

ఈమహానుభావుని ధర్మమా అంటూ రామావధానికి మూడవపిల్ల కుదిరింది. ఆమెతండ్రిచేతుల్లో రామవధాని పన్నెండువందల రూపాయలు, సుబ్బన్నశాస్త్రికి మూడువందల ఫీజు సమర్పించి రామావధాని యింటిలో ఆడదిక్కు కల్పించు కున్నాడు.

తన మూడవభార్య యింటికి రావడముతోనే మహాలక్ష్మి అన్నపేరు తీసివేసి సీతమ్మ అని నామకరణం చేశాడు. తన పేరు రాముడిపేరు అవడముచేత తన భార్యపేరు సీతమ్మవుంటే ఆకాలంలో సీతారాములు యెలాగు వుండేవారో యీదినాల లో తాము అలాగు ఆదర్శప్రాయమై నటువంటి జీవితము గడపవచ్చునని అతని ఉద్దేశం.

భర్త అంటే రామావధానివంటి వాడే భర్త అని లోకులు చెప్పుకోవాలి అని అతడు తనలోతాను అనేక మారులు అనుకొనేవాడు. అందుకోసం ముందుగా కొన్ని ప్రయత్నాలు యేర్పాటులు చెయ్యవలసివుంది అనుకొని రామావధాని మొట్టమొదట దొడ్డిగోడలు మునుపటికన్న యెత్తుగా పెట్టించాడు. ఇదివరలో యింటిప్రక్క నూతిలో నీళ్లుతోడుకుంటూ ఉండేవాడు. ఇది బాగాలేదు, సీతమ్మ నీళ్లకని బయటకు వెళ్లడమువల్ల అనేక అనర్థాలు వున్నాయని ఆభూమిలో చాలా లోతు త్రవ్వితేనే గాని నీరుపడదు అని యెందరు చెప్పినప్పటికి పట్టుబట్టి బ్రహ్మాండమైనంత లోతుగల నూతిని త్రవ్వించాడు. రోడ్డువైపునకు వున్నటువంటి కిటికీలకు మేకులు దిగగొట్టించాడు. చావడిమధ్య తలుపులు తీసి వుంచడము యెంతమాత్రమున్ను శ్రేయస్కరముకాదని దాన్ని అలాగే మూసివుంచి ప్రక్క తలుపునే సింహద్వారంగా ఉపయోగించడము మొదలుబెట్టాడు. ఎవరితోనన్నా మాటలాడవలసిన పనివుంటే తానే స్వయంగావెళ్లి వాళ్లతో వాళ్ల వాళ్ల యిండ్ల దగ్గరనే మాటలాడి వచ్చేవాడు కాని యింటికి ఒక్కర్ని కూడా రానిచ్చేవాడు కాడు. తాను వైదికపు బ్రాహ్మడైనప్పటికి యించుమించుగా పరదా పద్ధతిలో వుంచేవాడు సీతమ్మను.

సీతమ్మకు మొట్టమొదట భర్తవర్తన కొంచంకూడా అర్థమయ్యేది కాదు. వీధిలో యేదన్నా సందడి ఔతూవుంటే ఆమె అదియేమిటో చూడాలన్న కుతూహలంతో పరుగెత్తుకుని రాబ్రయత్నించేది కాని రామావధానిమాత్రం కళ్లు యెర్రజేసి అదమాయించి లోపలకి పంపేవాడు. అందువల్ల పెండ్లి అయిన దగ్గరనుంచిన్నీ సీతమ్మకు ప్రపంచం అంటే యేలాగు వుంటుందో తెలియదు. సీతమ్మ యిలాగు ఒకయేడాది అత్తవారి యింటగడపి మళ్లీ పుట్టింటికి వెళ్లింది. ఆమె ఒక్కమారుగా నరకమునుంచి స్వర్గములో పడినట్లు అయింది. ఆమె తనివి దీరా తన పుట్టింటివద్ద సుఖంగా ఆటలు ఆడుకున్నది. తాను యిన్నినాళ్లును పుట్టింటినివదలి అత్తవారి యింటివద్ద అనుభవించిన కష్టాలను యేకరువు పెట్టింది. మళ్లి వెళ్లమంటే తానువెళ్లనని ఆమె పట్టుబట్టింది. ఈసంగతి యెలాగునో ఒకలాగు రామావధానికి తెలిసింది. ఈమారువస్తే యింక సీతమ్మను పుట్టింటికి పంపగూడదనుకున్నాడు రామావధాని. సరే, సీతమ్మ పెద్దమనిషి అయింది అన్నవార్త రాగానే దగ్గర ముహూర్తము నిర్ణయించి, రామావధాని అత్తవారి గ్రామానికి వెళ్లి ఆ అడ్డుకూడా తీర్చుకుని పిల్లను యింటికి తీసుకు వచ్చాడు.

ఇన్ని కట్టుదిట్టాలు చేసినప్పటికిన్ని అతను మాత్రం

సీతమ్మ బలంగా ఎదగాలని కోరుతూవుండేవాడు. అందు కోసం అని అతను మంచిలేహ్యాలు, మురబ్బాలు, హల్వాలు మొదలైనటువంటివి తెచ్చి రాత్రులలో పెడుతూవుండేవాడు. ఇంకతానన్నా, తలకు మంచి అగరునూనె వ్రాసేవాడు. శరీర దృఢత్వానికని బాదంపప్పు, గోధుమరొట్టెలు ఒకటి రెండు ఇంగ్లీషు మందులు తింటూవుండేవాడు. ఇలాగు ఒకయేడాది గడపాడు. ఈయేడాది కాలంలోను సీతమ్మ అవధానికోరిక ప్రకారం కండబట్టింది. మునపటికన్నా చాలా బలిసింది. ఆమెకు అప్పుడే పెండ్లియెందుకు చేసుకోవడం సంసారము అంటే యేమిటో మొదలైనటువంటి విషయాలన్నీ తెలియ వచ్చాయి.

ఇంకొక యేడాది కాలంగడిచింది. దానితో సీతమ్మలో నిండుజవ్వనం ప్రవేశించింది. అప్పుడు సీతమ్మకు తన దుస్థితి అంతా తెలిసిపోయింది. తన యీడునకు తగినటువంటి వానికి యిచ్చి వివాహం చెయ్యడము మాని మూర్ఖులైనటువంటి తల్లి దండ్రులు తన్ను అన్యాయంగా యీవృద్ధబకానికి కట్టి పెట్టారని గ్రహించింది. ఆమెలో అప్పటినుంచి ఒక వింత మార్పు కలిగింది. మునుపటికిమల్లే చురుకుగా యింటి పనులను చక్కబెట్టేదికాదు. ఇదవరలో భోజనానంతరము సీతమ్మ కొంతసేపు దీపంవద్దకూచొని తమలపాకులకు సున్నము

వ్రాసి మడుపులుచిలకలు తయారుచేసి యిచ్చేది. అటు వంటి పద్ధతి అంతా పూర్తిగా మారిపోయింది. ఆమె భర్త భోజనానంతరము యేదో యింతతిని వెంటనే కటికినేలమీద పరుండి దీర్ఘంగా ఆలోచనచేస్తూ ఆఖరుకు యేఅర్ధరాత్రి సమయానికో నిద్రపొయ్యేది.

ఈ మార్పులను కనిపెట్టినటువంటి రామావధాని యీామెను యిదేసమయంలో మహాజాగ్రత్తగా చుస్తూ వుంకాలి, భయంలోవుంచాలి అని నిశ్చయించుకొని 'మెదిలితే మరామేకు' కదలితే మరామేకు అన్నట్టుగా అడుగడుగుకు తప్పులు కనిపెడుతూ ఉండేవాడు. సీతమ్మ లోలోన కుంగి పోతూ యింకముందు యేలాగువర్తించడమా అని ఆలోచిం చింది దీర్ఘంగా. ఆమెకు యెటువంటి అవకాశంగాని యీా ప్రపంచంలో న్యాయాన్ని అనుసరించి లేదని తెలిసింది. ఇంక యేమాత్రపు స్వేచ్ఛకు కడంగినప్పటికా ప్రపంచంలో మర్యాదవుండదు సరేకదా న్యాయంకూడారాదు అనుకొని ఆఖరుకు రామావధానితోనే యేలాగో ఒకలాగు కాలం గడపుదామనుకొని నిర్ణయించుకుంది. అలా నిర్ణయించుకొన్న మర్నాటినుంచి సీతమ్మ భర్తకు అనేకములైనటువంటి ఉప చారాలు చేస్తూవుండేది. ఈమార్పునుకూడా రామావధాని కనిపెట్టాడు కాని యేమిలాభం! అతనికి అడుగడుగుకు అనుమానమే వేస్తున్నది. సీతమ్మ యిలాగు సవినయంగా

వర్తించడముచూచి 'అతివినయం ధూర్తలక్షణం' కాగూడదా అనుకున్నాడు. అందుకోసం అతడు యిదివరకు మల్లే సాయంకాలములలో బయటకు వెళ్లడముకూడా మాను కున్నాడు. సీతమ్మను కాపలా కాస్తూ కాలంగడపడమే అతని ముఖ్య కర్తవ్యంలా అయింది. భర్తయొక్క అనుమానపు హృదయాన్ని భార్య గ్రహించింది. సీతమ్మను ఒక్కమారుగా శోక దుఃఖాలు రెండున్ను ఆవరించుకున్నాయి. మనం ఇంత వినయవిధేయతలతో మెలగుతూ సౌఖ్యాలను అన్నింటినీ వదలుకున్నప్పటికీ రామావధాని అనుమానిస్తూ వుండడము ఆమెకు యెంతమాత్రమున్ను యిష్టములేదు. ఈపద్ధతి క్రమేణా తగ్గపోతుందేమో అని ఆమె కొంతకాలము కనిపెట్టు కుందికాని లాభము లేకపోయింది. రామావధాని అను మానము దినదినాభివృద్ధి పొందుతూనేవుందేకాని తగ్గడములేదు. ఆఖరుకు యింక భరించి వుండలేక సీతమ్మ భర్త తన్ను అడ్డు ప్రశ్నలు వేయగా చూచి "యిలాగు అనుమానించడమువల్ల యెంతమాత్రమును లాభములేదు, నన్ను అనవసరంగా అను మానించి మీరు కట్టుకునే మూటయేమిటి. ఇంక నన్నాలే మీరు యీపద్ధతి కట్టిపెట్టి నామీద యెటువంటి అను మానమున్ను లేకుండావుంటే మనమిద్దరమున్ను, యీజీవ యాత్రను యెటువంటి కష్టములేకుండా గడపివెయ్యవచ్చును" అని చెప్పింది.

అవధాని అనుమానమే అంతానికి కారణము.

కాని ఆమాటలవల్ల రామావధానిలో మార్పుగలుగు తుందా? రామావధాని అంతటి పెద్దవాడు. మగవాడు ఒక్క ఆడదానిమాటలకు లొంగిపోవడమా! ఆమె చెప్పేదిన్నీ తాను వినేవాడున్నా! ఏమి అన్యాయం !! రామావధాని తన మామూలుపద్ధతి ననుసరించి సీతమ్మను చీటికిమాటికి యేదో ఒకటి అంటూనే ఉండేవాడు. అందువల్ల ఆమె చాలవరకు కష్టపడేదికాని యీకార్య క్రమం ప్రతిదినమున్ను సాగుతూ ఉన్న కారణంచేత ఆమె ఆఖరుకు రామావధాని యేమన్నప్ప టికీ లెక్క కొనకుండా వుండేది. అలా అని ఆమె యెంత మాత్రమున్ను హద్దుదప్పి సంచరించేదికాదు.

ఇలా ఉంటూవుండగా కాట్రావులపల్లి గ్రామంలో ఉన్న తన మేనల్లుడు వెంకటశాస్త్రి పొలంవిషయమై కోర్టుకు రావలసివచ్చింది. ఆకోర్టు పనిమీద పెద్దాపురం మొదటి దఫా వచ్చినప్పుడు రామావధాని మేనల్లుడని చాలా గౌర వించాడు. కాని అతడు యెప్పుడు బయటకు పోతాడా అని మాత్రం లోపల అనేక విధాలుగా తిట్టుకొనేవాడు.

వెంకటశాస్త్రి కోర్టుపనిమీద ప్రతివారము పెద్దాపురం రావలసిన అవసరం యేర్పడ్డది. తనకు రామావధానికి వుండే టటువంటి దగ్గరబంధుత్వమువల్ల బయట పూటకూటి యింట్లో దిగితే 'మేనమామ వూళ్లో ఉండగా పూటకూళ్ల యింటి

వద్ద దిగడము ఏమిటయ్యా' అని నలుగురు అనిపోతారేమో అని వెంకటశాస్త్రి రామావధాని యింటికే వెళ్లాలి. అదీ గాక యిదివరలో ఉండిన స్పర్ధలు ఒకటి రెండు యేండ్లక్రితమే నశించినాయి, అవి మళ్లీ బయల్దేరడము అంటే వెంకటశాస్త్రికి యెంతమాత్రమున్ను యిష్టంలేదు. ఈ కారణాలవల్ల ఏదో ఒకలాగు రామావధాని యింటిదగ్గరనే బసచేస్తూ యేలాగున్నా వాళ్లకింత ముట్టచెప్పదామనుకున్నాడు.

కోర్టు పనిమీద వెంకటశాస్త్రి మూడునెలలలో పదమూడు మారులువచ్చి రామావధాని యింటివద్ద బస చేశాడు. అతను వచ్చాడంటే రామావధాని పైకి అతనితో చక్కగానే మాటలాడేవాడుకాని లోలోన అతన్ని యెన్నో విధాల శపిస్తూవుండేవాడు. స్వతహా, వెంకటశాస్త్రి అందగాడు. అందుకుతోడు అతడు ధనవంతుడు. అందులోను వారానికి ఒక్కసారివంతునవచ్చి యింటివద్ద తిష్టవేస్తూన్నాడు. ఎటునుంచి యెటువస్తుందో అని మహాచింతలో చిక్కాడు రామావధాని. ఆతనికి యెంత ఆలోచించినా యేమిన్ని తట్టడములేదు. ఆఖరుకు ఒక్కటే మార్గం ఈగ్రామంనుంచి యింకొక వూరువెళ్లి పోవడమే.

సరే, ఆఖరుకు స్థిరపరచుకున్నాడు. పొలాన్ని అమరకానికి యిచ్చాడు. ఇంటిలోవున్న ఆవును, దూడను, రైతుకు

వప్పజెప్పాడు. సరే యేదోపనివున్నదని చెప్పి రామావధాని సీతమ్మను వెంటబెట్టుకొని, రాజమహేంద్రవరం వెళ్లాడు. రాజమహేంద్రవరంలో తనకు పరిచయస్థులు యెవ్వరూలేరు. అందువల్ల తనయింటికి ఏజీవికూడారాడు. అందుకుతోడు పొలం అంతా అమరకానికి యిచ్చివేయడమువల్ల అతనికి పని అసలేలేదు. బాగా భోజనముచేసి యిరవై నాలుగు గంటలు యింటిదగ్గరనే కూచొని కాలంగడపవచ్చును. అన్నివిధాలా రాజమహేంద్రవరము కాపురం తనకు చాలామంచిది అని తోచింది. ఐనప్పటికి ఆమెను భయపెట్టకుండా వదలడము యెంతమాత్రమున్నూ మంచిదికాదని అనుకున్నాడు. ఆ కారణముచేత రామావధాని, మజ్జిగవాడు పాలవాడు వచ్చిన సమయాలలో తప్పాలా యివ్వడానికన్నా పాలు అందుకొనడానికన్నా సీతమ్మ బయటకు వచ్చిందంటే ఆమరుక్షణాన్నే తలవాచేటట్టు చీవాట్లు పెట్టేవాడు. ఇరుగు పొరుగు వాళ్లు యిదివిని యెందుకా మహాయిల్లాలును యీాముసలాయన అనవసరంగా కేకలువేస్తాడు అనేవారు. రాజమహేంద్రవరంలో రామావధానికి అన్నీ అనుకూలంగానే ఉన్నాయికాని నీళ్లసంబంధమైన చిక్కు తటస్థించింది. ఇంటిలోని నూతినీళ్లు ఉప్పగా వుంటాయి. వాటిని వాడుకకు ఉపయోగించవచ్చు, యింక త్రాగడానికి? ఇదే మహా కష్టమయిపోయింది రామావధానికి. మంచినీళ్లు యెంతకష్టంగా వాడుకొన్నప్పటికీ

దినానికి ఒకబిందెడు అన్నా కావాలి. అందువల్ల సీతమ్మ ప్రతిరోజు ఒక్కమారు ఆమె గోదావరికివెళ్లి నీళ్లుతీసుకు రావాలి. అందువల్ల అదికూడాలేకుండా చేద్దామనుకున్నాడు కాని తగిన అవకాశం కనపడదాయెను. నీళ్ల బ్రాహ్మడు తెచ్చిన నీళ్లు త్రాగడము రామావధానికి మొదటినుంచి అలవాటులేదు. అదిగాక యింటిలోకి నీళ్ల బ్రాహ్మడు రావడమే. మొట్టమొదటి దినాలలో చీకటిపడిన తర్వాత తానే స్వయంగాపోయి భుజాన బిందెవేసుకొని వచ్చేవాడు కాని ఎన్నాళ్లని ఆముసలితనంలో నీళ్లుమోసుకొని రాగలడు. చీకటిలో మెట్లు దిగుతూ ఒకనాడు పడడముతో తాను స్వయంగా నీళ్లుతెచ్చే వ్యవహారం కట్టుబడి పోయింది. సీతమ్మయే నీళ్లు తీసుకొని వచ్చేది. సీతమ్మ నీళ్లకు బయలుద్దేరింది అంటే రామావధానికూడా యింటికి తాళంవేసి తానుకూడా ఆమెకు కొంత దూరంలో నడుస్తూవుండేవాడు. ఇది కొన్నాళ్లవరకు సీతమ్మకు తెలియదుకాని ఒకనాడు పొరుగు యింటి రాజాబాయమ్మ వచ్చి మాటలాడుతూ మధ్య హాస్యరసంగా "ఏమమ్మామీఆయన నీవు నీళ్లకువెళ్లితే తలుపుతాళంవేసుకుని నీవెంటనే వస్తాడు. ఆయనకు యింకయేమన్నా పనిలేదా" అని అంది. దానితో సీతమ్మకు ఆసంగతికూడా తెలిసింది. సీతమ్మకు యీసంగతి మహావిచారానికి కారణం అయింది. ఆమెకు మొక్కడలేని దుఃఖమున్ను కలిగింది. తన్ను గురించి

యిరుగు పొరుగు వాళ్లంతా చాలా చెడ్డగా చెప్పుకొంటారని ఆమె అనుకుంది. సీతమ్మ యెంతటి శాంతమైనదైనప్పటికీ యిటువంటి అపవాదులు వస్తూఉంటే భరించి వూరుకోలేక పోయింది. నాటి సాయంకాలమే ఆమె రామావధానితో మీరు యిలాగు నన్ను అనుమానిస్తూ వెంటబడి రావడము వల్ల నలుగురు యేమనుకుంటున్నారో తెలుసునా? నేను వచ్చి సుమారు మూడుయేళ్లు అయింది, యింకా నన్ను మీరు అనుమానిస్తూ వుండడము న్యాయమా? ఎంచేత యిలాగు చెయ్యడం, నలుగురిలో నన్ను అవమర్యాదపాలు చెయ్యడమే మీ ముఖ్య ఉద్దేశమా? అని గట్టిగా అడిగింది. రామావధాని అటువంటి ప్రశ్నావళికి సరియైన సమాధానం యిస్తాడని యెవరు నమ్మగలరు? అతను స్త్రీలయెడ సహజంగావున్న అనుమానాలను వెళ్లగక్కాడు. స్త్రీ నమ్మదగినటువంటివస్తువు కాదు. ఆమెను యెల్లప్పుడూ కాపలాకాస్తూనే వుండాలి, లేకపోతే యేసమయాన్ని యెటువంటి పొరచేస్తుందో చెప్పలేము. అందువల్ల ఆమెని అదుపు ఆజ్ఞలలో వుంచడానికి మగాడు ప్రయత్నించాలి. నేను యిప్పటి దద్దమ్మలలాంటి వాడనుకాను. ఆడవాళ్లను తవ్వి పాతివేస్తాను. అంటూ మహా దీర్ఘమైన ఉపన్యాసం యిచ్చాడు. దానితో సహజంగా సౌఖ్యవర్తనం కల సీతమ్మలో ఒకవిధమైనటువంటి తిరుగుబాటుతనం ఉదయించింది. ఇంతకాలం యెటువంటి కపటమున్ను లేకుండా

వర్తించినప్పటికి, రామావధాని తనకు అవమర్యాద కలిగించే టందుకు తోడ్పడినను. అతనికి నామంచితనం గాని నాసత్య మార్గ వర్తనంకాని నాత్యాగంకాని యెంతమాత్రమున్ను పనికి వచ్చిందికాదు. ఇంకయేది దారి, ఐనా నాగురించి యింకా యేమేమి చెప్పుకొంటూ ఉన్నారో లోకులు తెలుసు కొనాలి అనుకొంది సీతమ్మ.

మళ్లీ ఒకదినం రాజాబాయమ్మ సీతమ్మ యింటికి వచ్చింది. ఆసమయానికి భుక్తాయాసంవల్ల రామావధాని గుర్రుపెట్టి నిద్రపోతూ వున్నాడు. అటువంటి సమయంలో సంగతులు అన్నీ తెలుసుకొనవచ్చు ననుకొని సీతమ్మ ఆ యిరుగు పొరుగువారు తన్నుగురించి యేమని చెప్పుకొంటూ వున్నారో తెలియజేయమని అడిగింది రాజాబాయమ్మను. రాజాబాయమ్మ మొట్టమొదట చెప్పలేదు కాని తర్వాత "సీతమ్మ! నీవు యింత యెక్కువగా అడుగుతున్నావు కాబట్టి చెబుతున్నాను, నిన్నుగురించి యీవీధిలో అనేకమంది అనేక విధాల చెప్పుకొంటూ వున్నారు. నీవు రామావధాని ఉంచుకొన్న మనిషి అని కొందరనుకొంటున్నారు. నీవు దుష్టవర్తన కలదానివి కనుకనే భర్త యిరవై నాలుగు గంటలూ కాపలా కాచుకొంటూ కూచుంటున్నాడని అంతా అనుకొంటున్నారు. ఇవి ముఖ్యమైన విషయాలు. ఇంకా చిల్లర సంగతులు

చాలా ఉన్నవి. వాటి విషయమై నీవు అంతయెక్కువగా ఆలోచించ నవసరంలేదు" అని ముగిచింది. సీతమ్మ కళ్లెమ్మడి కన్నీళ్లు గంగాప్రవాహంలా ప్రవహించాయి. పాపం, మంచి చెడ్డలు కనిపెట్టిన రాజాబాయమ్మ సీతమ్మను దగ్గరకు తీసుకొని ఆమెను ఓదార్చింది. కాని గౌరవానికే లోపంవస్తుంటే యెంతటి ధైర్య హృదయమైతేనేమి కలంగిపోకుండా వుంటుందా?

రాజాబాయమ్మ యింటికి వెళ్లిపోవడానికి లేచింది, సీతమ్మ కళ్లుతుడుచుకొంటూ వుంది, ఆసమయాన్న రామావధాని నిద్రమేల్కొని వాళ్ల నిద్దరిని చూచాడు. అతనికి రాజాబాయమ్మమీద అపరిమితమైన ఆగ్రహం కలిగింది. కాని ఆసమయాన్న యేమనడం? రాజాబాయమ్మ యెప్పుడు యిల్లు విడిచి వెళ్లుతుందా యెప్పుడువచ్చి తన ఆగ్రహాన్నంతటిని సీతమ్మమీద చూపుదామా అని రామావధాని కనిపెట్టుకుని వుండి రాజాబాయమ్మ గడపదిగడముతోనే సీతమ్మ దగ్గరకు వెళ్లి, "ఏమే, ముండా! నీవు ఆచెడ్డదానితో స్నేహం చెయ్యడము మొదలుపెట్టావా? కొంపలుతీసే దుంపకున్ను నీకున్ను యేమి స్నేహం. ఇంకొకమారు ఆమె గడపయెక్కని ఏం చేస్తానో అని గద్దించాడు. అసలే అంతకుముందు విన్న సంగతులవల్ల కుంగిపోయి వున్న సీతమ్మకు రామావధాని

గలినపుమాటలు శూలాలలాగు తగిలాయి. కాని దుఃఖము పార్లివస్తూ వుండడముచేత ఆమె రామావధానికి సమాధానం యివ్వడము మానివేసింది.

నాటినుంచి సీతమ్మ మునుపటివలె ఉదయమునుంచి సాయంత్రమువరకు వంటయింటిలో రుచియైన పదార్థాలు చేయడముతోనే గడపడము మానివేసింది. ఆమె ముక్తసరిగా ఒక కూర, పప్పు, చారుతో భోజనము పెట్టదలచుకొని మొదటి రోజు అలాగు చేసింది. భోజన ప్రియుడైనటువంటి రామావధానికి ఆభోజనము యెంతమాత్రమున్ను సరిపడలేదు. "ఏమే, నీవొళ్లు పొగరుబట్టి పోయిందా? లేక యెవడో తుంటరితో పోవడానికని రాజాబాయమ్మతో ప్లానులు వేయడములో వంట సరిగ్గా చెయ్యడానికి అవకాశం వుండకుండా వుందేమిటి?" అన్నాడు. తనభర్త తనశీలాన్ని సంశయిస్తూ వుండడము సీతమ్మకు మహాకష్ట కారణమైంది. ఆమె స్పష్టంగా యిటువంటి దుర్మార్గపు వాక్యాలు వినడానికి యిదే మొదటి దఫా. అందులోను తనకు కొంత మనోశాంతి కలిగించడానికి అప్పుడప్పుడు తనయింటికి వస్తూవున్న రాజాబాయమ్మను అనరానిమాటలు రామావధాని అంటూ వుండడము చూచి సీతమ్మ సహించలేక పోయింది. "నన్ను అంటే అన్నారుకాని ఆపవిత్రురాలను పట్టుకు అలాగుతిట్టకండి

అవధాని అనుమానమే అంతానికి కారణము.

అందువల్ల లేని పోని పాపం మనకువచ్చి చుట్టుకుంటుంది అంది సీతమ్మ. ఏమంటున్నావు? ఆదండుముండు మహాపతివ్రత అంటావా! బాగానేవుంది. ఈమారు గడపత్రొక్కనీ ఏంచేస్తానో." అంటూ కూరలులేవని, సీతమ్మను తిడుతూనే భోజనము ముగించాడు.

పైవిషయం జరిగిన మూడవనాడు రామావధాని యింటికి రాజాబాయమ్మ వచ్చింది. ఆమె మెట్టుయెక్కుతూ వుండడము చూచి రామావధాని ప్రత్తికాయలంతటి గ్రుడ్లను బయటకు త్రెచ్చుకొని "ఈరోజునుంచీ మాగడపత్రొక్కవద్దు" అన్నాడు. పాపం రాజాబాయమ్మ నిర్ఘాంతపడిపోయింది. ఆమె అలాగు అవమానింప బడుతూవుండడము చూచి సీతమ్మ కళ్ల నీళ్లుగ్రుక్కుకొంటూ బిరబిర మెట్లు దిగివచ్చి తిరిగియింటికి వెళ్లిపోతూవున్న రాజాబాయమ్మ దగ్గరకు వచ్చి చేతులు పట్టుకొని "తల్లీ! ఆయనమాటలకు కోపగించవద్దు, నీవు నాతల్లివంటి దానివి. నన్ను క్షమించాలి" అంటూ బ్రతిమాలింది." రాజాబాయమ్మ నీళ్లురాలుస్తూ "అమ్మా, నాకు యేమిన్నీ విచారంలేదు, మీఆయనకు ఆగ్రహంవస్తే నీవుయేం చెయ్యగలవు. నీమీదనాకు యెప్పటికీ చెడ్డ అభిప్రాయం వుండదు. 'ఏసమయానన్నా సరే నీకు సహాయం కావాలంటే నన్నుమాత్రం మరచిపోకు' అంటూ సీతమ్మ కళ్లతుడిచి తాను యింటికి వెళ్లిపోయింది.

సీతమ్మ ఇంటిలోనికిరాగానే రామావధాని కర్రబట్టుకు సిద్ధంగా నిలబడి "ఏమే ఆముండతోకలసి వీధిలో కూడాబడుతున్నావా" అంటూ అకర్రతీసుకొని కొట్టాడు. దెబ్బతో పాపం సీతమ్మ నేలపడిపోయింది. ఆమె అలాగు నాలుగు గంటలవరకు పడ్డతావునుంచి కదలలేదు, అందువల్లనన్నా ఆ మూర్ఖుడి హృదయం కరగలేదు.

ఆనాడునుంచీ సీతమ్మమీద రామావధానికి అనుమానం యెక్కువ అయింది. వంటయింటిలో పనిపూర్తి అయిందనగానే ఆమెను ఒక గదిలోవేసి తాళంవేశేవాడు. తర్వాత తనయింటూ చుట్టూ యెవ్వాళ్లో తుంటరులు తిరుగుతూ వుండాలని భావించి రామావధాని యింటికి చుట్టూరా, తిరుగుతూవుండేవాడు. ఆఖరుకు ఒకనాడు సాయంకాలం యిద్దరు యువకులు దారినిపోతూ అరుగు మీద కూచున్న రామావధాని కేసి తీక్ష్ణంగా చూచి యేమోవాళ్లల్లో వాళ్లు అనుకొంటూ వెళ్లిపోతూవుంటే రామావధాని వాళ్లని అనుమానించి గబగబా మెట్లుదిగి వాళ్లదగ్గరకు వెళ్లి "యితరుల పెళ్లాలిని ఆసించి తప్పుదారిలోకి దించేవాళ్ల పెళ్లాలు తప్పకుండా వ్యభిచార జీవితం గడపుతారు" అన్నాడు. మొదట ఆయువకులు నవ్వుకొంటూ పిచ్చివాడని వాళ్లదారిని వాళ్లు పోతూవుంటే రామావధాని వాళ్లని వెంటాడుతూ

"నాకాపిచ్చ; నాకుకాదు యింకొకడి భార్యకోసం ఆసపడి వాడియింటి చుట్టూ కుక్కల్లాగు తిరుగుతూవున్న మీకు పిచ్చ గాని నాకుపిచ్చా" అంటూ అడ్డుతగిలాడు. ఏదో తొందర పనిమీద పోతూవున్న ఆయువకులు రామావధానిని చిదగ దన్ని వెళ్లిపోయారు. తాను తినిన తన్నులవల్ల రామావధాని ఆగ్రహం మరింత యెక్కువ అయింది. బిరబిర లోపలికి వెళ్లి సీతమ్మను బంధించివున్న గది తలుపులు తెరిచి కళ్లు యింతింత చేసుకుంటూ మూలనున్న కఱ్ఱ తీసుకుని "ఏమే



యింటిచుట్టూ రసికులను తిప్పించడమే గాక నన్ను తన్నించడానికికూడా సిద్ధమయ్యావా?" అంటూ కఱ్ఱతో పాపము సీతమ్మను గొడ్డును కూడా బాదనన్నంత తీవ్రంగా బాదాడు.

ఆ మూర్ఖుడి ఆగ్రహానికి సీతమ్మ బొబ్బలువేస్తూ నేల పడిపోయింది. ఇల్లంతా రక్తమయమైంది. సీతమ్మ కేకలు ఆలించిన యిరుగుపొరుగు వారంతావచ్చి తలుపు తియ్యమంటే రామావధాని తియ్యలేదు. ఈసందడి విన్న రాజాబాయమ్మ కూడా వచ్చింది. ఇంతలో పోలీసువారు వచ్చి తలుపులు

బ్రద్దలుగొట్టి లోపల ప్రవేశించారు. రామావధాని గుడ్డలకు రక్తము వుండడముచూచి యేదో దారుణం జరిగివుంటుందని తలచి రాజాబాయమ్మ యింటిలోకివెళ్లి నేల రక్తపు మడుగులో పడివున్న సీతమ్మను చూచింది. ఆమె గొల్లుమంటూ అందర్నీ పిలిచింది. వారి సహాయాన్నె ఆమెను యెత్తి మంచముమీద వేయించింది. ఠానాకు నడుఅంటూ పోలీసులు రామావధానిని ముందుకు తోస్తూవుంటే "నాపెళ్లాన్ని కొట్టుకొనడానికి నాకు హక్కువుంది, మధ్యను అడ్డురావడానికి మీరెవరు" అంటూ ధిక్కరించాడు. "ఏడిచావులే, అధికారముకూడా ఆలావుంచి ముందునడు" అంటూ చేతులకు చేడీలు తగిలించి రామావధాని మెడమీద చెయ్యివేసి బయటకు గెంటివేశారు. డాక్టర్ వచ్చి కట్లుకట్టిన మెవరి యిళ్లకు



వాళ్లు వెళ్లారు. రాజాబాయమ్మ కళ్ల నీళ్లు బెట్టుకొని సీతమ్మను తనయింటికి ఆస్థితిలోనే తీసుకువెళ్లింది. అర్ధరాత్రి వరకు ఆమె కదలలేదు మెదలలేదు. రాజాబాయమ్మ సీతమ్మను వదలి వెళ్లలేదు. అర్ధరాత్రికి నెమ్మదిగా కళ్లు కొంచెం తెరిచింది సీతమ్మ. రాజాబాయమ్మకు సంతోషం కలిగింది.

తల్లిలాగు మహాప్రేమగా తలదువ్వుతూ వుండగా దాహం అన్నట్టుగా పెదిమెలు మెదిపింది సీతమ్మ. రాజాబాయమ్మ పాలుపోసింది. కొంతసేపటికి సీతమ్మకు మాటలాడే శక్తి వచ్చింది. "మూర్ఖుడైన నీభర్త నిన్ను చంపయత్నించాడా" అని రాజాబాయమ్మ అడిగితే "లేదు కొట్టాడు" అంది సీతమ్మ. తర్వాత సీతమ్మ ముద్దుపెట్టుకోమంది. దానితో రాజా బాయమ్మ హృదయం నీరై పోయింది. ఆమె మాతృ ప్రేమ నంతా కురిపిస్తూ సీతమ్మను ఆలింగనంచేసుకొని శిరము ముద్దు పెట్టుకుంది. అప్పుడు "అమ్మా" అంది సీతమ్మ.

"ఏమమ్మా, తల్లీ!"

"అమ్మా" అంటూ నవ్వింది సీతమ్మ కళ్లుమూసుకుంది. అంతటితో ఆమె ఆఖరు.

* * * *

ఇంక రామావధాని న్యాయాధికారిచే విచారింపబడి ద్వీపాంతరవాస శిక్షకు పాత్రుడయ్యాడని పాఠకులకు వేరే చెప్పనవసరంలేదు.

౬

మోహనాంగి మోసం.

పగలస్తమానం చలాకీ అన్నదే లేకపోయినప్పటికి ఆమెరక వీధిలోమాత్రం చీకటిపడేసరికి యెంతన్నా రద్దీగా వుంటుంది. మునిసిపలు లాంతర్లకు దగ్గరగావున్న రెండు కిళ్లీ దుకాణాలున్ను మంచి సుందరంగా అలంకరింపబడి అగరు వత్తులు సెంట్లు వీటితో గుమ్ముమెత్తిపోతూ వుంటాయి. అంతేగాక సోడాబుడ్లలో సారాయిపోసి రహస్యంగా యీ వర్తకం సాగుతూ వుంటుంది రాత్రిఅంతాను. అందువల్ల యేఅర్ధరాత్రి వేళనన్నా సరే సారాయి కావాలంటే ఆవీధిలో తప్పకుండా దొరుకుతుంది, అదిమాత్రం నిజం.

చీకటి పడిందన్న దగ్గరనుంచి వీధిఅంతా గుమ్మెత్తి పోతూవుంటుంది. మేడలుమీద డాబాలుమీద వేశ్యలు మహాసుందరంగా అలంకరించుకొని యిటూ అటూ తిరుగుతూ వుంటారు. వేశ్యమాతలు నల్లమందు మాత్రలు బిగించి యిళ్ల గుమ్మాల దగ్గరకునుకుపాట్లుపడుతూ కూచొని వుంటారు. గోడలకు తగిలించబడిన దీపాలు ఆయిళ్లకువచ్చి అంతా పోగొట్టుకొని బయటపడేవాళ్ల ప్రాణాలలాగు మిణుకు మిణుకు మంటూ వుంటాయి. కాని చీకటి యెక్కువఅయిన

కొద్ది వీధిలోని రద్దీ ఎక్కువ అవుతుంది. సరసులు రక రకాలుగా సింగారించుకొని ఒయ్యారంగా నడుస్తూ ప్రతియింటి వైపునా చూస్తూ తమకు నచ్చిన వేశ్యల యిళ్లల్లో దూరుతూ వుంటారు. ఇలాగు వచ్చేవాళ్ల పొయ్యేవాళ్ల రద్దీ రాత్రి పన్నెండు గంటలవరకు సాగుతూనే వుంటుంది.

మెరకవీధి కంతటికి పేరుసంపాదించింది మోహనాంగి. స్వతహాగా మోహనాంగి అందమైన విగ్రహమే. ఆమే శైశవచరిత్ర మహావిచిత్రమైనది. అందువల్ల మొదట ఆమె చరిత్రను తెలుసుకొనడము ఉత్తమం.

మోహనాంగి తల్లిగా ప్రస్తుతం పరిగణింపబడుతూ ఉండిన మంజువాణి యౌవనదశలో అంత అందకత్తె కాక పోయినా హావభావ విలాసాలతోటి చాలమందిని వలలో వేసుకొంటూ లెక్కలేనన్ని విటులను ఆకర్షిస్తూ వుండేది. అందువల్ల త్వరలోనే ఆమెకువున్న యౌవనము కొంచెంకూడా మాయమయింది. ఒళ్లంతా రోగాలకు చిక్కి పాడైపోయింది. ఆరోగాల బాధను భరించలేక ఆమె త్రాగుడు ప్రారంభించింది. ముందు బ్రాందీ, తర్వాత సారాయి, ఆఖరుకు కల్లు ఈవిధంగా ఒకరకంనుంచి యింకొక రకానికి డబ్బు తక్కువ అయినకొద్ది దిగుతూ రావడము మొదలుబెట్టింది. ఎంత యెంతో నాటు వైద్యం చేయించింది కాని ఆమందులు గుణం యేలా యిస్తవి?

ప్రొద్దున్న మందు తీసుకోవడము మధ్యాహ్నము త్రాగడము సాయంత్రము ఆస్థితిలో ఉన్నప్పటికి వచ్చే ఒకరిద్దరు విటులతోను కాలంగడపడము మాత్రము మానేదికాదు మంజువాణి. ఆఖరుకు ఆమె కాలుతీసి కాలుపెట్టలేని స్థితివచ్చింది. శరీరం కుళ్లిపోతూ వుంది. ఇంక యెంతకాలం ఆబాధ భరిస్తూ అవినీతిమార్గాన్ని అనుసరించగలదు? అంచేత ఒకనాడు బండి కట్టించుకొని సామర్లకోట వెళ్లి రైలుయెక్కి రాజమహేంద్రివరంపోయి వైద్యశాలలో చేరింది. అక్కడ పాపం డాక్టర్ జాలివహించి యెక్కువ శ్రద్ధతో ఖరీదైన మందులను అన్నింటినీ యిస్తూ క్రమేణా వ్యాధులను నివారణచేశాడు. రెండున్నర నెలలు అయ్యేసరికి మంజువాణి తేలుకున్నది. కాని చెక్కిళ్లు దిగజారాయి. కళ్లు లోతుకు పోయినాయి. ముఖం వెలవెలబోయింది. మునుపటిలాగు చకచకమని చురుకుగా నడవలేదు. ఈస్థితిలో మంజువాణి మళ్లీ పెద్దాపురం చేరింది. ఆమెకు యేలాగు బ్రతకడమా అనిపించింది. ఆమెకు ఈప్రపంచంలో ఒకయిల్లూ, ఐదు యకరాల పొలము తప్ప యింకయేమిన్ని లేవు. పొలముమీద వచ్చేదానితో కాలం గడపుదామా అంటే మూడుయేండ్లనుంచిన్నీ వర్షాలు యెగగొట్టినాయి. అందుమీద వాటివల్ల గవ్వకూడా రావడములేదు. తర్వాత తనకు ముందుముందు సేవచెయ్యాలన్నా కులవృత్తిపోకుండా చెయ్యాలన్నా ఒకపిల్లనితెచ్చి పెంచాలి.

అదే తాను చెయ్యావలసిన ముఖ్యకార్యం అనుకుంది మంజువాణి. అంచేత యేలాగో వాకలాగు భూమిని ఐదువేల రూపాయలకు అమ్మివేసి ఆడబ్బును నమ్మకంగల ఆవూరి మునసబునకు అప్పుగా యిచ్చివేసి అందుమీాద నెలనెలకు వచ్చే వడ్డీని తెచ్చుకుని కష్టంగా గడపుకొంటూ ఉండేది. మంజువాణి మునుపటికిమల్లే త్రాగకపోయినా యిప్పటికి కూడా వదలకుండానే యెక్కిస్తున్నది సారాయి?

మంజువాణి కులసాంప్రదాయాన్ని, అనవాయితిని తప్పించకుండా వుండడానికి ఒకపిల్లను సంపాదించాలి. అందు కోసం అనేకమందితో చెప్పింది. కాని ఆరుమాసాలు గడచి నప్పటికి యెవ్వరూ పిల్లను జతపరచలేదు. ఆఖరుకు యేలాగు నన్నా తానే యీకార్యానికి పూనుకోనాలి అనుకుంది. ఆమె దీర్ఘంగా ఆలోచించింది. ఆమెకు బాలవితంతువులు జ్ఞాపకం వచ్చారు. ఏలాగునన్నా ఒక్క పిల్లను లంకించుకోనాలను కొని ప్రతిరోజు పదిగంటలుదాటిన తర్వాత బయల్దేరేది. సత్రవుల పొలిమేరలు మొదలైనటువంటి ప్రదేశాలు చూడ డానికి సాయంకాలాలలో పాడుపడిన యిళ్లు, పెద్దతూములు, మొదలైనటువంటి తావులను వెతకుతూ వుండేది.

విసుగు విరామంలేకుండా మూడు నెలలు గడపింది. మంజువాణి మాత్రం నిరుత్సాహ పడలేదు. ఒకనాడురాత్రి

పదకొండు గంటలు దాటుతుంది. మంజువాణి ఒకపాడుయింటి ప్రక్క వస్తూవుంటే ఆమెకు చంటిబిడ్డ అరవులు వినబడి హఠాత్తుగా ఆగిపోయినాయి. ఆమె వీధిగుమ్మము వైపునకు వెళ్లి చూచింది. తలుపు తాళంవేసివుంది. ఆయింటిలో ఒక యేడాదినుంచి యెవ్వరూ కాపురం ఉండడము లేదు. అందువల్ల వీధితలుపు బంధింపబడి వుండడము లోపలినుంచి చంటిబిడ్డ అరవులు బయల్దేరటము ఆమెకు అనుమాన కారణం అయింది. ఆమె బిరబిర ఆయింటి వెనకభాగానికి వెళ్లి దొడ్డిగుమ్మం తోసింది నెమ్మదిగా. లోపల గడియవేసి నట్టుగా వుంది. తలుపు తట్టితే ప్రమాదముంది. ఆమె యేంచెయ్యాడం గోడయెక్కి లోపలికి వెళ్లడమంటే అది సాధ్యము కానిపని, గోడలు బ్రహ్మాండమైన యెత్తుకువున్నాయి. అది యెక్కడానికి వీలులేదు. ఇంక యెలాగు చూచినప్పటి కిన్నీ ఆమె ద్వారంగుండానే లోపలికి వెళ్లాలి. ఏమయితే అయింది అని ఆమె తలుపుకొంచెం తోసింది. లోన గడియా లేదు యేమీ లేదు. ఆతలుపులు చాలా పాతబడి చెదలుపట్టి వుండడముచేత అవి కదలలేదు. నెమ్మదిగా వాటిని సద్దు లేకుండా తోసి లోపలికి వెళ్లింది మంజువాణి. లోపలఅంతా అంధకారబంధురమై వుంది. ఆమెకు దారికనబడడము లేదు, తెన్ను కనబడడము లేదు. అగ్గిపుల్ల వెలిగించి దారిచూచు కొంటూ నెమ్మదిగా ముందుకు వెళ్లింది. ఇంటియొక్క వెనుక

భాగం చేరింది అన్నమాటే గాని ఆమె చెవులకు యెటువంటి శబ్దమున్ను వినబడలేదు. భ్రిమలోపడ్డానా అని కొంతసేపు ఆమె అనుకుందికాని అలాయెందుకు అనుకోవాలి, నేనుస్పష్టంగా చంటిబిడ్డ కేకలువింటేనే అనుకుని మళ్లీ ఒక అగ్గిపుల్ల ముట్టించి ఒక్కొక్క గదిలోకిన్ని వెళ్తూ చూడడము మొదలుబెట్టింది. ఆఖరుకు ఒక చిన్న గదిలో మంజువాణి ఆసతీర్చే పసిబిడ్డ



కనబడ్డది. ఆబిడ్డను చూడగానే ఆమె ముందుకు పోయి మగబిడ్డో లేక ఆడబిడ్డో అని తహాతహా పడుతూ ముందుకు వెళ్లి పరీక్ష జేసి ఆడబిడ్డ అనడముచేత అపరిమితానంద భరిత అయింది. ఈబిడ్డకు కొంత దూరంలో గాలికి ఆరిపోయిన క్రొవ్వొవత్తి వుంది, దాన్ని ఆమె వెలిగించింది. ఆదీపపు కాంతితో ఆపసిబిడ్డ ముఖం దీక్షతో చూచింది మంజువాణి. నిద్దురపోతువున్న ఆలేగందు ముఖం సత్యస్వరూపంలాగు యెట్టి చింత, కపటము, తలంపు లేకుండావుంది. మంజువాణి సంతోషంతో ఆబిడ్డను చేతుల్లో యెత్తుకుంటూ వుండగా యేదో ఘల్లుగల్లుమన్నది. ఇదియేమా అని అదరిపడి క్రింద

చూచేసరికి బిడ్డతోపాటు మంజువాణికి ధనంకూడా లభించింది. ఆబిడ్డ ప్రక్కనే ఆమెను కనిన నిర్భాగ్యపు తల్లి ఒక కాసుల మాలను వదలింది. దానిలో చిన్న చీటివుంది. అదివిప్పి "నేనొక నిర్భాగ్యపు బాలవితంతువును నేనుకడుపార రహస్య ముగా కనిన యీ ముద్దుబిడ్డను పెంచుకొనలేని దానను. ఇక్కడనున్న బిడ్డ కేకలు వినివచ్చి జాలివహించి బిడ్డను పెంచుకొనువారికి కృతజ్ఞతగా యీ కాసులమాలను వదలు చున్నాను. బిడ్డను పోషించి సౌఖ్యపెట్టి సౌఖ్యపడుడు.

ఇట్లు,

నిర్భాగ్యపు బాలవితంతువు.

అని యీ ఉత్తరాన్ని చదివి మంజువాణి ఆకాసులమాలను బిడ్డను తీసుకుని ఆకటికి చీకటి సమయంలో నిండు మనస్సుతో యిల్లు చేరుకున్నది. ఈలేగందువుకే మంజువాణి 'మోహ నాంగి' అని నామకరణంచేసి పెంచి పెద్దవాన్ని చేసింది. ఇది మోహనాంగి పూర్వగాథ. మోహనాంగియొక్క అందంచూసి ఆవీధిని పోతూవుండే రసికులంతా వూటలూరిస్తూ వుండేవారు. ఆమెను తమవశం చేసుకోవాలి అని కోరనివారు ఒక్కరన్నా వాళ్ళలో వుండేవారుకారని చెప్పితే అతిశయోక్తికాదు.

మోహనాంగికి యీడువచ్చింది. ఆమె సంగీతము, నాట్యము బాగా నేర్చుకున్నది. ఆమెకు కత్తిపెండ్లి యెప్పుడు

చేస్తావని అందరు పదేపదే వచ్చి అడుగుతూ వుండేవారు. ఇదుగో చేస్తా అదుగో చేస్తానని కొందరితోను, నేమేదండి అది పసిబిడ్డ, యేం కడుపాళ్లు గట్టిపడిన తర్వాత చేస్తానని మరి కొందరితోనున్ను, యేమో దానియిష్టము యిప్పటివాళ్లు మన మాటలు వింటారా అని డబ్బులేని మరికొందరు రసికులతోడ నున్న చెపుతూ మంచి అవకాశానికని ఆమె కనిపెట్టుకొని చూస్తూవుంది.

ఆఖరుకు రాజ్యం లేని రాజుల అబ్బాయి వెంకటరాజు తహతహపడి తాతలనుంచి వస్తున్న కుటుంబగౌరవాన్ని గంగకలిపి యింకొక వేపారిపంతులుతో కన్నెరికపుకట్నం గురించి వేలంపాటబెట్టి ఆఖరుకు నాలుగువేలు యిచ్చేటందుకు నిర్ణయించుకొని కన్నెరికము తనకు దక్కజేసుకున్నాడు.

మోహనాంగి కొన్ని దినాలు బడిలో చదువుకొని వున్న కారణంచేత నలుపురిలాగా తానకూడా పెండ్లి చేసుకోవాలి అనుకొన్నది కాని ఆమె ఉద్దేశాలు సాగినవికావు. ఆమె పెంపుడు తల్లి మంజువాణి అనేకవిధాలు చెప్పింది. ముందుముందు జీవితం చాలా హైన్యమై పోతుందని అందుచేత యిప్పుడే జాగ్రతపడడము ఉత్తమమని న్యాయమైన జీవితము గడపడము యిహపరసౌఖ్యాలు లభిస్తవని తన బడిలోని ఉపాధ్యాయురాలు చెప్పినదని ఆమె మంజువాణితో అనేక విధాలు అనేక మారులు చెప్పిందికాని అందువల్ల యెటువంటి ఉపయోగమున్ను కనబడలేదు. అయ్యో మనకులంవాళ్లు

కన్నెరికం చేసుకుని కులవృత్తి చేసుకోకపోతే యేకుతరాల వాళ్లు నరకంలోపడి మలమల మాడిపోతారు కాని యింక ఏమన్నావుందా, యీనాటికి నీవువచ్చి వాళ్లని అందర్నీ స్వర్గంనుంచి ఒక్కమారుగా నరకంలోకి త్రోయడానికి ప్రయత్నిస్తున్నావు గాని యింక యేమన్నా వుందా, అంటూ నెత్తిబాదుకొంటూ మంజువాణి సమాధానం యిచ్చింది.

పాపం నిజమేమో అనుకుంది మోహనాంగి. నిర్ణయ దినాన్ని భాజాభజంత్రీలు మంజువాణి యింట మ్రోగినాయి. కత్తిపెళ్లి మహోత్సవాయమానంగా సాగిపోయింది. ఎప్పటి కన్నా ఆమెతో హాయిగా వుందామనుకున్న విటశేఖరులు అంతా ఆపాయంత్రం మంజువాణి యింటికివచ్చి కత్తిపెళ్లి సమయాన చదివింపులు సాగించారు. మంజువాణి ముసి ముసి నవ్వులు నవ్వుతూ ఆబహుమతులను అందుకొంటూ చాలా సంతోషించింది.

ఇంక మోహనాంగి మేళాలకు వెళ్లడము మొదలు



పెట్టింది. ఆమె అభినయం చేస్తూవుంది అంటే యువకులు యీగలు ముసిరి నట్టుగావచ్చి మూగుతూ ఉండేవారు. ఆమె సహజంగా సౌందర్యవతి, అందుకుతోడు పాటకత్తె

కూడాను. మోహనాంగి తివాచమీద కూచొని పాట పాడుతూ అభినయం చేస్తూవుంటే, యెదట కూచున్న సరసులు పరవశులు అవుతూ బలేబలే అని తలలూపుతూ కేకలువేస్తూ వుండేవారు. ఆమెచే వాళ్లంతా గంధం రాయించుకుని రూపాయలు సమర్పించుకొంటూ వుండేవాళ్లు. ఏనాడు మేళానికి వెళ్లినా మోహనాంగి అధమము ముప్పై రూపాయలకు తక్కువతో తిరిగి యింటికివచ్చేది. ఈవిధంగా ఆమె యొక్క "ఖ్యాతి" చాలాదూరం వ్యాపించిపోవడమువల్ల అనేక గ్రామాలనుంచి అనేకమంది వచ్చి ఆమెకు తెచ్చిన లొడ్డులొస్కు అంతా సమర్పించుకొని పోతూవుండేవారు.

నాలుగుయేళ్లు గడిచేసరికి మోహనాంగి కొంతవరకు స్థితిమంతురాలు అయింది. ఆమె యింటిమీద యిదివరకు వున్న డాబా తీయించి నాలుగు గదులు ఒకహాలుగల మేడ వేయించింది. ఆ మేడమీద అంతా చలువరాతి చిత్రమైన పలకలువేసి అమర్పించింది. గోడలకు శృంగారం వొలకుతూ వుండేటటువంటి పటాలు వేలాడగట్టించి. మంచి తివాచీలు, సోఫాలు అమర్పించింది. నిజంగా ఆమేడ ఇంద్ర భవనము అనవచ్చును.

'కరణం కొంపకాలితే గ్రామస్థులకే కష్టం' అలాగునే మోహనాంగి మేడవేయించి దాన్ని మహాచక్కగా అలం

కరించింది అంటే అందువల్ల నష్టంపొందేది సరసులేతప్ప వేరెవ్వరులేదు. ఇదివరకు మల్లే సాధారణమైన ముడుపులు చెల్లిస్తే మోహనాంగి అంగీకరించేదికాదు. ఆమె ఒక్కొక్కడి దగ్గరనుంచి యేభై లు, వందలు గుంజడము ఆరంభించింది.

మోహనాంగికి వేశ్యలయొక్క టక్కులు అన్నీ పూర్తిగా యిప్పటికి తెలిసిపోయినాయి. ఏయేవిధాల వర్తిస్తే డబ్బు లాగవచ్చో పూర్తిగా తెలుసుకుని మహాచాకచక్యంతో డబ్బులాగుతూ వుండేది. కృష్ణం అనే దాన్ని గౌరవిస్తూ పూజిస్తూ వుండేటటువంటి చిల్లర షాహుకారువస్తే అతనికి తగినట్టుగా తమవిందులు, మిఠాయి మొదలైన వాటినుపయో గించడములో మహాకృష్ణంగా వుంటూ అతని దగ్గరవున్న పైకాన్ని మాత్రం ఖాళీచేసేది. విభూతి పెండ్లికట్టు ధరించి శ్రోత్రియుంగా శివభక్తుడువస్తే మోహనాంగి మెడలో రుద్రాక్షమాల పెద్దదాన్ని వ్రేలాడవేసుకుని చేతులకు సన్నని రుద్రాక్షల పేరును తగిలించుకుని విభూతి నొసటనురాసుకుని శివభజన కీర్తనలు పాడుతూ మధ్యమధ్య మహాదేవ శంభో, గంగాధరా, సద్గురు అంటూ మహాదీక్షతోవున్నదానిలాగు వర్తించేది. ఇంక వైష్ణవ మతస్థుడు వచ్చాడంటే నొసటన సన్నని సిందూరపు రేఖదిద్ది గోడకు వ్రేలాడగట్టిన పంగ నామాల బొమ్మకు, తిరుపతి వెంకటేశ్వరుల బొమ్మకు మ్రొక్కి

"రామానుజా రామానుజా, హరేరామ హరేరామ, శ్రీ పార్థసారథీ, పండరి ద్వారకాపురివాసా" అంటూ కీర్తిస్తూ నిదురపోయేది. తర్వాత యింక విష్ణులీలలు, శ్రీకృష్ణ కర్ణామృతములోని కొన్ని శ్లోకాలు యేకరుపెట్టుతూ అతన్ని వలలో వేసుకొనేది. ఈవిధంగా సమయానుకూలమైన నటు వంటి వర్తన మంచి చాకచక్యము కలిగి సంచరిస్తూ వుండడము వల్ల మోహనాంగికి రాబడి యెక్కువ అయింది.

మోహనాంగి ఒకనాడు సాయంకాలం షికారుకు బయల్దేరింది. గుర్రపుబండి పైకప్పుతీయించివేసి అందులో కూచొని వెళ్తూవుంటే ఆమెను చూచి గుటకలు వెయ్యని విటులులేరు. ఆమె చక్కగా శింగారించుకొని వెళ్తూవుండడము చూచిన శంకరరావు నిజంగా పరవశుడై పోయాడు.

శంకరరావు చూపునకు రూపసి, అతనికి మంచి ఆస్తి, మహాపతివ్రత ఐనటువంటి పెండ్లాము. అతడు మోహనాంగి యొక్క తళుకుబెళుకులు చూచి ఆమెవలలో తగుల్కొన్నాడు. ఆమెను చూచిన దగ్గరనుంచి ఆమె మీదకే పోయింది మనస్సు అంతా. ఒకటి రెండు దినాలలో శంకరరావు చేయవలసిన యేర్పాటులు చేసుకున్నాడు. వేసవికాలం అది, ఒకరోజున జేబులో యిన్ని నోట్లు వేసుకుని ఒంటరిగా సందుదోవ లమ్మట దారిబట్టుతూ మోహనాంగి యింటికి వెళ్లాడు. ఇతని

జాడ అల్లంతదూరంనుంచే కనిపెట్టిన మంజువాణి యెవడో విలాసపురుషుడు వస్తున్నాడని చెప్పింది మోహనాంగితో. మోహనాంగి మేడమీద కిటికిలోనుంచి శంకరరావును చూచి వేగంగా యింటిలో చేయవలసిన యేర్పాటులు అన్నీ చేయించింది. ఇటువంటి సమయంలో శంకరరావు మోహనాంగి యిల్లుచేరాడు. మోహనాంగి రెండుచేతులు జోడించి అతనికి నమస్కరించి మేడమీదకు తీసుకువెళ్లి సోఫామీద కూచోబెట్టి కొంతసేపు ముసిముసినవ్వులు నవ్వుతూ సిగ్గునభినయిస్తూ కూచుంది. తర్వాత సంగీతం అంటే మీకు యిష్టమా అంటూ అడిగి తెలుసుకొని లోపలికివెళ్లి వీణబట్టుకొనివచ్చి తివాచి



మీద కూచొని కిన్నెర కంఠంతో పాడడము మొదలుపెట్టింది. అలాగు ఆమె అర్ధనిమీలిత నేత్రాలతో చూస్తూ పాడుతూ వుంటే శంకరరావు పరవశుడై పోయాడు. ఆమె యిదివరకన్నా యెక్కువ అందంగా కనబడింది ఆసమయంలో. ఇటువంటి స్త్రీతో మైత్రివల్ల తనకు అపరిమితమైనటువంటి సౌఖ్యం అలవడుతుంది అనుకున్నాడు. సరే మొదటి

దినం తాంబూలం తీసుకుని పళ్లెంలో యేభై రూపాయలు ఉంచాడు. తర్వాత శంకరరావు లేచివస్తూవుంటే మోహానాంగి నవ్వుతూ నమస్కరిస్తూ మీవంటి రసికులు మమ్ము ఒకకంటితో చూస్తూవుండకపోతే మేమేలాగు బ్రతుకుతాము. మీరు వస్తూ పోతూవుండాలని నా ప్రార్థన. సంతోషంతో ఉప్పొంగిపోతూవుండిన శంకరరావు 'యెంతమాట, నేనుతరుచు వస్తూవుంటాను' అంటూ మెట్లుదిగి వెళ్లిపోయాడు.

శంకరరావు నాటినుంచి రెండురోజులకు ఒకమారు వంతున మోహానాంగి యింటికి వెళ్తూ సంగీతము వింటూ వెళ్లినప్పుడల్లా యిరవై యైదు రూపాయలకు యెప్పుడు తక్కువ మొత్తము సమర్పించకుండా వచ్చేవాడుకాడు. ఇలావుండగా ఒకనాడు శంకరరావు పూలమొక్కల ప్రక్కనవేసిన తివాచి మీద కూచున్నాడు. మోహానాంగివచ్చి యెదుట కూచున్నది. దాసి ఫలహారంపు పళ్లెం తెచ్చి యెదట వుంచింది. మోహానాంగి శంకరరావును ఆరగించమన్నది. మొట్టమొదట శంకరరావు మొగమాట పడ్డాడుకాని ఆఖరుకు ఆఫలహారాలను ఆమెతోపాటుగ ఆరగించి తమలపాకులు వేసుకున్నాడు. అప్పటికి సూర్యుడు పూర్తిగా అస్తమించాడు. ఇంక యింటికి వెళ్తానని లేవబోతూ వుంటే మోహానాంగి అతనిచెయ్యి పట్టుకొని "నేను అభినయంచేసి చూపెడుతాను ఒక్క నిమిషం

కూచోరూ?" అని నవ్వుతూ అంది. సరే ఆసుందరాంగి మాటలు యింకతోసి వెయ్యగలడా! సరే అని కూచున్నాడు. మోహనాంగి తన విద్యనంత ప్రదర్శిస్తూవుంది. ఆమెచేసే అభినయంయొక్క అర్థం గ్రహిస్తూ ఆహా, యేమి తెలివి తేటలు అంటూ లోలోన ఉప్పొంగి పోతూవున్నాడు శంకరరావు. ఇలాగు ఒకగంట పాడింది. ఆఖరున ఒక జావళిపాడటానికి ప్రారంభించింది. "సమయము మంచిదిరా సరసుడ లేచిరరా" అని యెత్తుకుంది మోహనాంగి. ఆమె ఆజావళిపాడుతూ చక్కని అభినయం చేస్తూ చేయిపట్టుకొని లాగుతూ, అతని హస్తాలకు గంధంపూస్తూ యెన్నోవిధాల అతని మనస్సున కరిగించివేసి "సమయము మంచిదిరా సరసుడ లేచిరరా" అంటూ చేయిపట్టుకొని లేవదీసి శయ్యామందిరములోకి తీసుకువెళ్లి మంచముమీద కూచోబెట్టింది. అంతటితో తానామెతో పూర్తిగా సౌఖ్యాలు అనుభవించాలి అనుకున్నాడు. అతనిలో కలిగిన ఉద్రేకంవల్ల ఆమెను దగ్గరకు చేయిబట్టి లాగుకొని ముద్దు పెట్టుకొన్నాడు. తర్వాత రెండు వందల రూపాయల నోట్లు అందించాడు మోహనాంగికి. అటువంటి సమయంలో "మోహనాంగి మోహనాంగి" అని పిలుస్తూ యింకొక ఆయన లోపలకు వచ్చాడు. అతని పేరు శివయ్య. బియ్యపు వర్తకుడు. పదివ్రేళ్లకు పదిఉంగరాలు తగిలించుకొన్నాడు. చెవులకు కమ్మలు తగిలించుకున్నాడు. శిల్కు

షర్టు వేసుకుని పైన శిల్కుకంకువా వేసుకున్నాడు. ఇలా వచ్చిన శివయ్యకు మోహనాంగి మంచందిగి ఒక కుర్చీవేసి "దయచేయండి" అని మర్యాద చేసింది. అతను కుర్చీమీద కూచొని మంచముమీద కూచున్న శంకరరావును చూచి అగ్గిఅయ్యాడు. అతనికి లోపల ఆగ్రహం కుతకుతలాడి పోతూ వుంది. అంచేత "మోహనాంగి యివ్వాళ రాత్రి నేను యిక్కడ వుంటాను" అన్నాడు. "అయ్యో, వీరు యీ రాత్రికి యిక్కడనే ఉంటారు, తమరు రేపు దయచెయ్యండి" అంది మోహనాంగి.

"అదంతా పనికిరాదు పనులన్నీ చక్కబెట్టుకొని యివ్వాళ కులాసాగా గడపుదామని మేమువస్తే నీవు యిలా చెప్పడము బాగాలేదు. ఆయన యెంత యిచ్చాడో అంతకన్న యెక్కువ యిస్తాను. వారిని పంపివెయ్యి" అన్నాడు. శివయ్య.

"కాదండి, మీకు యింతపట్టుదల వద్దు"

"అదంతానాకు తెలియదు. ఆయన యెంతయిచ్చాడో చెప్పు"

"ఆ! ఆవిషయం యెందుకులెండి. వారు రెండు వందలు పళ్లెంలో వుంచారుకాని"

"సరే నేను మూడువందలు యిస్తాను, ఆయన్ని వెళ్ల మను" అంటూ శివయ్య మూడు నూరు రూపాయలనోట్లు ఆమెకు అందించబోయాడు.

శంకరరావుకు ఆగ్రహం ఎక్కువ అయింది. తన మీదకు పోటీకి వస్తున్నాడనుకొని యేలాగునన్నా సరే యివ్వాళ్ల మోహనాంగిని వదలకూడదనుకొని, నీవు మూడు వందలు యిస్తే నేను నాల్గువందలు యిస్తానని" మరి రెండు నూరు రూపాయల నోట్లుతీసి మంచముమీద వేశాడు. శివయ్య మాత్రం సామాన్యుడా? ఐదువందలన్నాడు. ఏడు వందలన్నాడు శంకరరావు.

ఇదేవిధంగా పాట వెయ్యిరూపాయల వరకున్నూ ఎక్కిపోయింది. ఆఖరుకు శివయ్య తలవ్రేలవేసుకొంటూ మెట్లుదిగి వెళ్లిపోతూవుంటే అతన్ని చిన్నబుచ్చడానికని శంకర రావు మోహనాంగిని దగ్గరబెట్టుకొని కూచున్నాడు. ఆసమ యాన్ని మోహనాంగి ప్రేమ అంతా శంకరరావు మీదనే ఉన్నట్లుగా నటిస్తూ నిజంగా యివ్వాళ మీరు తెగువచేసి నామర్యాద కాపాడారు" అంది మెల్లగా. ఇంక యీ మోహనాంగి తన్నే ప్రేమించింది అనుకొంటూ శంకరరావు ఆరాత్రి మోహనాంగి యింటగడిపి ఉదయమే యిల్లుచేరు కున్నాడు.

ఆమర్నాడు నుంచి శంకరరావు వర్తకంలో చాలా మార్పు కలిగింది. అతనికి యింటిలో భార్యమీద కొంత చికాకు పుట్టింది. వేళకు భోజనమునకు రావడము మాని వేశాడు. స్వయంగా అంతవరకు వ్యాపారం చూచుకొంటూ వున్న అతడు అది తప్పించి వ్యవహారమంతా గుమాస్తాలకు ఒప్పజెప్పి తాను దినానికి ఒకపూటవంతున మోహనాంగి యింటి దగ్గరనే కాలం గడపడమునకు మొదలుపెట్టాడు. మోహనాంగి వలలోచిక్కిన శంకరరావు ఒక్కమాసం దినాలలో కళాకాంతులు లేకుండా చేసుకున్నాడు. అతడు బలహీనుడయిపోయాడు. అందుచేత మోహనాంగి అందిస్తూ వుండగా బ్రాందికాయలు పంపివెయ్యడము ప్రారంభించాడు.

ఒకటిన్నర నెల దినములలో శంకరరావు పదివేల రూపాయలు పాడుచేశాడు. తప్ప తాగి యింటికివచ్చి భార్యను చావమోదుతూ వుండేవాడు. ఆమహాయిల్లాలు శంకరరావుపెట్టే కష్టాలకన్నింటికి ఓర్చుకొంటూ దినాలు గడపుతూ ఉండేది. వేశ్యసంపర్కము వుంటే ఉండవచ్చును కాని త్రాగుడుమాత్రం మానమని ఆమె యెన్నోవిధాలు బ్రతిమాలి చూచిందికాని లాభము లేకపోయింది.

మంజువాణి త్వరత్వరగా క్షౌరం చెయ్యమని మోహనాంగిని తొందరచేయుడము ఆరంభించింది. మోహనాంగి

కూడా ప్లానులు వేస్తూనే వుందికాని ఊరుకోలేదు. ఒకనాటి మధ్యాహ్నం శంకరరావు తప్పతాగి మోహనాంగి దగ్గరకు వచ్చి "యేది యిలారా! అని చేయిపట్టుకు లాగుతూవుంటే మోహనాంగి దూరంగాపోయి "మీయింటికి వెళ్లి మన ప్రయాణం యేర్పాటులు అన్నీ చేసివస్తేనే కాని నన్ను ముట్టవద్దు" అని ఉద్రేకం కలిగించింది. అతడు అనేకవిధాలు ప్రాధేయపడ్డాడు కాని లాభంలేక పోయింది. అంచేత అతిక్క సమయంలో శంకరరావు యింటికివెళ్లి పెట్టెలో నున్న ఐదు వేల రూపాయలు భార్యయొక్క నగలూ వద్దంటున్నప్పటికి తీసుకొని పోయాడు మోహనాంగి దగ్గరకు. మోహనాంగి శంకరరావునే హృదయపూర్వకంగా ప్రేమించివేసినట్టుగా ఆవచ్చిన శంకరరావును కౌగలించుకొని యింటిలోకి తీసుకు వెళ్లింది. మర్నాడు సాయంత్రం ఊటీకి ప్రయాణం అని అనుకొంటూ యిద్దరూ నిద్రపోయారు.

ఊటీలో ఒక బంగాళా అద్దెకు తీసుకుని యిద్దరు కూలి వాళ్లను నియమించి వారిద్వారా కావలసిన పనులనన్నిటినీ చేయించుకుంటూ యిద్దరూ సుఖంగా వున్నారు. శంకర రావు భార్య నగలన్నీ మోహనాంగి ధరించుకున్నది. ఆమె మెల్లసమయాలలోను మహా ఒయ్యారంగా సింగారించుకొని యిటూ అటూ పచారుచేస్తూ వుండేది. మోహనాంగి

చేతికి చిక్కిన పైకాన్నంతా జాగ్రత్తపరచి రెండు మూడు రోజులకు ఒక్కొక్కమారు తన యింటికి పంపిస్తూ వుండేది. శంకరరావుకు యేమిన్నీ తెలియదు. ఊటీనగరంలో అసలే ఖర్చు జాస్తిగా వుంటుంది. అందులోను మోహనాంగి పెట్టించే ఖర్చులు మరింత యెక్కువగా వున్నాయి. వచ్చిన రెండు నెలలు పూర్తిఅయ్యేటప్పటికి శంకరరావు తెచ్చిన పైకమంతా ఆఖరు అయింది. అతనికి యేమిన్నీ తోచడము లేదు. ఇందుకుతోడు వ్యాపారంలో తీవ్రమైనటువంటి నష్టము వచ్చిందని అతనికి ఉత్తరం వచ్చింది. భార్య మహా దీనంగా ఉత్తరాలు రాస్తున్నది. ఇంక ఊటీలో చూస్తే యింటి అద్దె యివ్వవలసి వున్నది. పనిమనుష్యులు ఒకప్రక్క పీకుతున్నారు. ఏమి చెయ్యడమురా అంటూ తలబట్టుకుని ఆలోచించడము మొదలుపెట్టాడు. ఎంత ఆలోచించినా యేమిదారి కనబడు తుంది. ఆఖరుకు తన్ను ప్రేమించినదనుకొన్న మోహనాంగిని అడిగితే తప్పకుండా యిస్తుంది అని అనుకుని ఒకనాడు నాలుగు వందల రూపాయలు యిమ్మన్నాడు. అంతమీాద ఆపసోపాలు పడుతూ తనవద్ద యేమిలేదని అంటూ "నగలలు అమ్మి యిద్దామా అంటే నేను అవిలేనిదే యేమాత్రమున్న నిలవ లేను!" అని యేడ్చింది. దానితో శంకరరావుకు కొంత దుఃఖం కలిగింది. ఇదివరకు లేని ఆవేదన హృదయాన్ని తినివెయ్యడము మొదలువెట్టింది. కాని సాధ్యమైనంత మట్టుకు దాన్ని అణచివేశాడు.

అప్పులవాళ్లు పీకుకుతింటున్నారు. మోహనాంగికి విసుగుదల యెక్కువ అయింది. ఆమె మునుపటికిమల్లే శంకరరావు దగ్గరకు రావడము మానేసింది. ఇష్టం వచ్చినట్టుగా ఒంటరిగా బయుల్దేరి షికారుల సాగించేది. ఒకనాటి సాయంకాలం చీకటిపడిన తర్వాత మోహనాంగి ఒకనాటు కోటిసెట్టి చేతిలో చెయ్యికలిపి షికారుచేయడము ప్రారంభించింది. ఈవర్తనను చూచి శంకరరావు యేమాత్రమున్నూ భరించలేక పోయాడు. కాని ముందు యెలాగున్నా అప్పులు తీర్చివెయ్యాలి అనుకుని నిశ్చయించుకున్నాడు. ఇలా అనుకొంటూవుండగా భార్య చాలాదినాలనుంచి వ్యాధిగ్రస్తురాలై వుందని ఆమెయింక బ్రతికదని ఉత్తరం వచ్చింది. ఆఉత్తరం చూచి అతడు కొంతసేపు విలపించి మోహనాంగి తనవద్ద ఉండగానే ఆఉత్తరం చదివి చూద్దాం ఆమె యేంచేస్తుందో డబ్బుకోసం వ్రాస్తానని భార్యపేర ఒక ఉత్తరం వ్రాశాడు. మూడోనాటికి చిన్న పోస్టుపార్శల్ వచ్చింది. అందులో ఒక ఉత్తరము నాలుగు నగలు ఉన్నవి. ఆఉత్తరం శయ్యాగతయై యున్న భార్యవ్రాసింది. "నేనింక రెండు మూడు దినములలో చనిపోతాను. మీరు అప్పులు తీర్చుకొని విముక్తులైన మీదరండి. చిక్కులలో పడవద్దు వందనాలు" అని వణుకుతున్న చేతులతో వ్రాసిందిభార్య. ఆనగలను చూచి మోహనాంగి వీటిని అమ్మివెయ్యడమే అన్నది. కాని శంకరరావు లెక్క చెయ్యలేదు.

మర్నాడు ఆనగలను అమ్మడానికి ప్రయత్నించాడు. ఊటీ నగరములో యెవ్వరూ వర్తకులులేరు. అందువల్ల ప్రక్క గ్రామానికి వెళ్లేసరికి రెండురోజులు గడచింది. మూడవదినం యింటికి వచ్చేసింది. మోహనాంగి కలకలలాడు తూ యెదురుగావచ్చి "ఏమండోయ్ మననోము ఫలించింది. మనం సుఖంగా వుండవచ్చును మనమిద్దరి మధ్యను ఆటంకంగా వున్న వ్యక్తి చచ్చిపోయింది. ఇంక మనదే స్వర్గసౌఖ్యం" అంటూ దగ్గరకు వచ్చింది. "అలాగా నాభార్య చని పోయిందా! సరే అని శంకరరావు కొంతసేపు వూరకేవుండి, సరే పీడకొంతవరకే వదలింది యింక కొంతెవుంది" అన్నాడు. మోహనాంగి ప్రక్కనవచ్చి కూచున్నది.

ఆమెదృష్టి అంతా శంకరరావు తెచ్చిన డబ్బుమీదనే వుంది. అతిడా నగలమ్మగా మూడువేల ఐదువందల రూపా యలు వచ్చినవి. అప్పులవాళ్లను పిలిచి అందులో 13 వందలు వాళ్లకుయిచ్చి శంకరరావు ఋణవిముక్తుడయినాడు. అమ్మయ్య యిప్పటికి యింకాకొంత పీడపిశాచము నన్ను ఆవరించుకు వుంది అంటూ లేచి యిటూ అటూ పచారు చేశాడు. మహాసంతోషం అభినయిస్తూ డబ్బు లాగుతూ వుంది మోహనాంగి.

చీకటిపడింది. శంకరరావు పీథితలుపు బంధించాడు.

బీరువా దగ్గరకువెళ్లి రివాల్వరు తీశాడు. లోపల పడకగదిలో విపరీతంగా సింగారించుకొంటూవున్న మోహనాంగి దగ్గరకు వెళ్లి రివాల్వరు పైకియెత్తాడు. భయంతో ఆమె తిరిగింది. "ఓదయ్యాం నాదగ్గర యింతడబ్బు తీసుకుని ఆఖరుకు సద్దుబాటుకని వెయ్యిరూపాయ లిమ్మన్నా యిచ్చావుకావు, అంతేకాక నీకోసమై ప్రాణమువదలిన నాభార్యను పీడఅన్నావు. నీవల్ల నాజీవితము అంతా మన్నుకలిసి పోయింది. నీకు ధనమే ప్రధానముకాని యింకయేమిన్నీ ముఖ్యంకాదు. నాదగ్గర ధనం ఆఖరు ఔతున్నదని అప్పుడే నాకళ్లయెదటనే యింకొకడితో వ్యాపారం సాగిస్తున్నావు. నమ్మకద్రోహం చేసినందుకు నీయొక్కయు, నమ్మినభార్యను చంపినందుకు



నాయొక్కయు పాపాం పండిపోయింది. ఇంకమనకు యీ లోకంలో వుండడానికి తావులేదు" అంటూ రివాల్వరుతో మోహనాంగిని చంపాడు. తర్వాత ఆసాధనాన్నే తనవైపునకు త్రిప్పుకుని తన్నుతానే కాల్చుకున్నాడు.

## ౧౦

పెంకిపెళ్లాం గడుసు మొగుడు.

"ఇదుగో చూడు! నేను నిన్నమధ్యాహ్నం తిన్నతిండి. గడ్డిపాడునుంచి నడిచివచ్చేటప్పటికి నాప్రాణాలు కడబట్టాయి. కాళ్లన్నీ పచ్చిపుళ్లయివున్నాయి. ఆకలి ప్రాణాలు పోతున్నాయి. ఇప్పటికి రెండుఝాములయినై. ఇంతవరకు నువ్వు పొయ్యిమీద యెసరెక్కించలేదు. దక్షిణకాశపడి విధవ బ్రాహ్మణార్థానికి ఒప్పుకొన్నాను. అందులో అంతా అయ్యేటప్పటికి రెండుగంటలైంది. అప్పుడు తిండికి కూచున్నానుగాని తిండేంసహిస్తుంది? మంచినీళ్లతో పొట్ట నింపేశాను. అబ్బా, యికమీద యెన్నడూ యెక్కడికి బ్రాహ్మణార్థానికి వెళ్లగూడదనిపించింది. నువ్వు కొంచెం కనికరించి యీపూటమాత్రం నామాటవిని పెందలకడనే చారుమెతుకులు నామొఖాన పారేస్తే నీకు పుణ్యం ఉంటుంది."

"అబ్బో, చాలు, చాలు మీవగలన్నీ ఎప్పుడూ అలా ప్రాణాచారం పడ్తారెందుకు? "ఇంత పెడితే మింగుదునమ్మా" అన్నట్లు ప్రతిరోజు యింత చెల్లిస్తూ, నేనేమో యెప్పుడు మీకు వేళకి అన్నంపెట్టనట్టుగా "పెందలకడనే చారుమెతుకులు నా

మొఖాన పారేస్తే నీకు పుణ్యం వుంటుంది" అని అలా యిది అవుతారేం? ఎప్పుడూ తమఆరోగ్యం, తమకాయుష్యమే గాని పొట్టకి పోరుగు గిట్టదుకదా."

"ఓయ్‌బాబో, సమయానికి పెట్టిందిరా, పేటన. ఇదుగో చూడు నాబుద్ధి గడ్డితిని అన్నానుగాని, నాపైనదయ వుంచి, కాస్త నామాటవిని కొంచెం పెందలాడే అన్నం పెట్టుదూ?" అదిగో మళ్లీ అలా యిదౌతారెందుకు? రోజూ మీరు వేళకియింత కుంభం చెల్లించడం లేదూ? అంతావిని అలా పాచిమాటలాడ్తారెందుకు?"

"ఓసి మాదిగ ధవిడీ! నదురు బెదురూలేకుండ నోటికెంత వొస్తే అంతపేల్తావ్? "కుంభం" అంటావ్ నేనుతినేది? ఈ మాటు ఇనిచూడూ దవడ పళ్లూడగొడ్తాను."

"ఏది కొట్టండి చూద్దాం. కొట్టకపోతే మీరు మగవాళ్లుకారు."

"నోరుముయ్యి, నోటికి హద్దు పద్దు లేకుండా చస్తున్నావ్."

"అంతామీరే. మీకే నోటికి హద్దు పద్దు లేకుండా వుంది"

"ఓసి గయ్యాళిముండా, నువ్వు ఎక్కడ దాపురించావే నాపాలిటి శనిదేవతలాగ"

"నేనుకాదు. మీతల్లి, మీఅక్క చెల్లెండ్రు. అంటే అట్టే పెద్దాననుకున్నావేవిటి? మీరు నాపాలిటికి శనిలాగ ఏలా దాపురించారో, నేనూ మీకంతే."

"పోతే మాతల్లినంటావుంటే, నీనోరుపడిపోను."

"మీనోరే"

అప్పుడు రామావధానిగా రాగ్రహం అపరితమైంది. అసలే ఒకమూల మార్గాయాసం, ఆకలిమంట, దానికితోడీ మాటలు వింటే ఆయన ఆగ్రహం పట్టలేకపోయ్యాడు. ఒక్క సారి మడికట్టుకొనివుంది అనియైనా తెలీక తనభార్యయైన సీతారావమ్మని పట్టుకొని యీలెంప ఆలెంప వాయించాడు. అక్కడితో యింకేముంది? సీతారావమ్మ కోపశోకాలకు లోనయింది. రాకాసిలాగ పెద్దగొంతుక పెట్టుకొని రాగాలు తీయడం ప్రారంభించింది. చెప్పరాని, అంతులేని తన దూషణ పంచాంగాన్ని విప్పింది. ఇరుగుపొరుగింటి అమ్మలక్కలంతా సీతారావమ్మ కేకలువిని వాళ్లల్లోవాళ్లు నవ్వుకొని, ఎవ్వరూ ఓదార్చడానికి రాలేదు. ఆవిడ యిలా అనేకసార్లు చేసింది. వాళ్లకి యిదంతా చాలా అనుభవమే. "మొగుణ్ణికొట్టి మొఱబెట్టేది" అని అందఱికీ తెలుసు.

తిట్టవలసినదంతా తిట్టి, చేయువలసిన రాద్ధాంత సిద్ధాంత మంతా చేసి, "ఇక నేను వండను" అని భీష్మించుకొని,

కాళ్లు చేతులు ముడుచుకొ, నేలమీద తనపైటకొంగును మొగంపైన ముసుగేసుకొని పండుకొంది.

ఇక పాపమా(బ్రాహ్మడి తిప్పలు దైవానికెఱుక. "ఇదేం ఖర్మంరా, బాబూ" అనుకున్నాడు. మెల్లగా, 'విధియా ఖర్మమా' అంటూ తనభార్యదగ్గిరకువెళ్లి కాళ్లు గడ్డం పట్టుకొని అనేకవిధాలుగా బతిమాలాడు. ఇక తానలా చేయనన్నాడు. క్షమించుమన్నాడు. తనకు చేతనైనంతవఱకు ఆమెకు కోపోపశమనం చేద్దామనుకున్నాడు కాని అంతా నిష్ఫలమైంది. ఇంకా భీష్మించి పడుక్కొంది సీతారావమ్మ. "సద్దెన్నం తిన్నమ్మ, మొగుడాకలెఱగ" దన్నట్లు తాను ప్రొద్దున్నే సద్దిఅన్నం గొంతుకవఱకు మెక్కించింది. తనకింకా మూడుగంటల దాకా ఆకలి యెత్తదుగదా. అంతవఱకు భీష్మించుకొని, మొగుడు వండింతర్వాత బ్రతిమాలించుకొని, మెల్లగాలేచి 'అడ్డెడుబియ్యాని కడ్డులేద'న్నట్టుగా మెక్కుదామనుకొని మొగుడు తనకింత బతిమాల్తూన్నా ససేమిరా అని పడుక్కొన్నది.

పాపం; రామావధాని తనశాయశక్తుల పెళ్లాన్ని బ్రతిమాలాడుగాని లాభం లేకపోయింది. పాపం; కడుపెంత ఆకలిచేత దహించుకు పోతున్నా, కాళ్లుచేతులెంత శక్తివిహీనాలైనా 'తప్పదురా దేవుడా' అనుకొని ఓపికతో అలాగేలేచి

స్నానంచేసి మడికట్టుకొని అన్నంవొండి తానుతిని, పెళ్లాన్ని బతిమాలాడు. కానిరానంది. ఆఖరికి లాలించగా, లాలించగా అప్పుడు భోజనానికిలేచి అడ్డెడుబియ్యాని తక్కువలేదన్నట్లుగా జుర్రేసింది. ఈలాగు రామావధాని తన పెంకెపెళ్లాంతోటి చెప్పరాని అవస్థలు పడ్తున్నాడు. అక్కడికి ఆయిల్లాలు కోరినదల్లా యిస్తూనే వున్నాడు. కాని లాభంలేకపోయింది. అతను చెప్పినదానికల్లా విరుద్ధంగా చేస్తూవుండేది. పాపం; యిలా ప్రాణసంకటం పడ్తున్నాడు భార్యతో.

* * * *

రేపటిదినం రామావధాని తండ్రి తద్దినం. ఏలా జరగడం? తనభార్య జరగనియ్యదే. తానేదిచెప్పితే దానికి వ్యతిరక్తంగా చేస్తూంటుంది. అలా అయితే, తద్దినం జరగడం ఏలాగ? అతడు పెద్దఆలోచనా సముద్రంలో పడ్డాడు. ఏం పాలు పోలేదు. ఆఖరికి ఆలోచించగ, ఒక చక్కని ఉపాయం తట్టింది. దానితో అతనిహృదయం ఆనందంచేత వుప్పొంగింది. ఆవుపాయంతో తనభార్యని అవలీలగా జయించవచ్చును కున్నాడు.

ఇంతలో సీతారావమ్మ భోజనంచేసి మొగుడిముందు కూర్చొని "ఏదండీ కాస్తయింట్లోకి తమలపాకులున్నా తీసు కొచ్చారు కారుగదా" అని అడిగింది. అప్పుడు "తీసుకు

రమ్మంటావా! అలాఅయితే తెస్తావుండు" అని లేవబోయాడు. రామావధాని. "ఇప్పుడేం అక్కఱలేదులెండి" అని కొంత విసుగుదలనుచూప్తూ మొగుణ్ణి వెళ్లనీయలేదు." అప్పుడు మెల్లిగా పెళ్లాంతో ఆమాటా యీమాటా మాట్లాడ్తూ మచ్చిక చేయడం ప్రారంభించాడు. అప్పుడు సీతారావమ్మ కొంచెం సంతోషంతోవుంది. ఇదే మంచిసమయం అనుకొని రామావధాని "ఒశేయ్, చూడు. రేపు నాప్రాణానికి తండ్రి తద్దినం వొస్తోంది. నేనెలాచేస్తానో నాకే యేంతెలీడంలేదు. పాపం; నువ్వు మనిషిసహాయంలేనిదే చెయ్యలేవు. అసలు నీకు శక్తియేలేదు. ఇంతవరకు బ్రాహ్మణ్ణికూడా చెప్పలేదు. పోనీ దాని దుంపతెగ యీసారికి యీ పీకులాటంతా లేకుండా దేవుడి గుళ్లో పెట్టేద్దామా అని అనుకొంటున్నాను. నువ్వేమంటావో కనుక్కొందామనుకుంటున్నాను." అని అన్నాడు.

"బాగానేవుంది. ఆఖరాఖరికి "ఏళ్లు ఎగసాన, బుద్ధి దిగసాన" అన్నట్టు మీకేళ్లువచ్చినకొద్ది యింతబుద్ధిలేనితనం యేర్పడ్తోందేవిటి? ఎంత నీచుడైనా తండ్రి తద్దినం మానుకునే వాడు ఉంటాడా. ఒక ఇల్లువాకిలి వుండి, గృహస్థులైనప్పుడు, సన్యాసివాడిలాగ తండ్రి తద్దినం గుళ్లోపెడ్తానంటారేవిటి? అంతఘోరపాపం యింకోటివుందా? మీకు మళ్లీ పుట్టుగతు

లుంటాయా? మిమ్మల్నికని పెంచి, పెద్దవాణ్ణిచేసిన తండ్రి తద్దినం పెట్టకపోవడం అంతటి పితృద్రోహకార్యం వేరొకటి వుంటుందా? ఘోరనరకం, పురుగులగుంట ప్రాప్తితప్ప మరి గతిలేదు. కాబట్టి నామాటవిని, డబ్బు ఖర్చు అవుతుందని యేడ్వక తండ్రి తద్దినమైనా సలక్షణంగా పెట్టండి.”

“నువ్వు చెప్పింది సమంజసంగానేవుంది కాని నీకేమైనా ఆయాసాన్ని కల్పించినవాణ్ణి అవుతానేమో అని అనుకొన్నాను.”

“అబ్బో, ఏంప్రేమ, ఏందయ! ఎన్నడూలేనిది ఈవాళ యెందుకువొచ్చింది. పాపం యెన్నడూ నన్ను కష్టపెట్టక అందలంపైన యెక్కిస్తున్నారు కామోసు. ఈజన్మలో యీ కష్టాలు తప్పవు. ఇక అనవసర ప్రసంగం కట్టిపెట్టి, రేపటి తద్దినానికి కావలసిన కూరానారా యావత్తు తీసుకురండి. ఈరాత్రే అన్నీతరుగుకొని సిద్ధంచేసుకొంటేనేగాని రేపటికి వంటకాలస్యం అవుతుంది.”

“ఎందుకు వృథాదండుగ? ఏదో పచ్చడిమెతుకులు చేసివేసి అయిందంటే అయిందనిపిద్దాం.”

“మీకాఖరాఖరికి యీలాంటి నీచపుబుద్ధులు పుట్టుతున్నాయేమిటి? తండ్రి తద్దినానికి కూరకొనడానికి డబ్బు

ఖర్చు అవుతుందని యిలా యేడుస్తారేవిటి? పచ్చడి మెతుకుల్తోటి తద్దినం పెట్టేవాళ్లని నేనెక్కడా చూడలేదు"

"అదికాదే! నువ్వు యిన్ని చేయలేవని అలా అన్నాను."

"మళ్లీ ఆమాటే మాట్లాడ్తారు. ఇకమీద యిటువంటి వగలు నాదగ్గిర చూపించకండి. నేనన్నీ చేస్తాను. అన్ని కూరలు తీసుకురండి.

"ఔతే; ఏంకూరలు తీసుకురమ్మంటావ్?"

"అయ్యో పాపం; నేనన్ని చెప్పాలికావోసు. అన్నీ నన్నడిగే చేస్తున్నారుకావోసు."

"అయితే బీరకాయలు, గోంగూర, ఉల్లిపాయలు, బంగాళాదుంపలు, గోధుమరవ్వ యివి తెస్తా."

"ఛీ, ఛీ. ఇంత అప్రాచ్యపువాళ్లై పోతున్నారేవిటి? ఇవి అన్ని తద్దినానికి పనికివొస్తాయా? కాకరకాయలు, బెండకాయలు, చిక్కుడుకాయలు, దోసకాయలు ఇవి యెన్నో ఉంటూంటే తద్దినానికి ఏవిపనికిరావో వానినే తెస్తానంటారేవి ఖర్మం? మీకేమైనా మతిపోయిందా యేవిటి?"

"నాకేమి తెలియదే."

"అయ్యో, పాపం, నంగనాచి. నోట్లో వేలుపెడితే కొరకలేరు."

"అది సరేకాని, నువ్వూరికే, కాళ్లు వ్రేళ్లు కుమ్ముకొని అవసరపడి మడికట్టుకోవలసిన పనిలేదు. మెల్లింగానే వంట చెయ్యి."

ఛీ, ఛీ! ఇఖనోరుముయ్యండి. మీనోరు తెరిస్తే అసహ్యమైన మాటలొస్తున్నాయి, ఈవాళ ఎందుచేతో అయిందిగాని ప్రొద్దుపోతే బ్రాహ్మణుకు కొట్టుకోడు."

"బ్రాహ్మడేవిటి? బ్రాహ్మడూలేడు. గీమ్మడూలేడు."

"ఇదుగో, నాకు మండుకొచ్చిందంటే బాగాజరగదు. పోయి బ్రాహ్మణార్థానికి బ్రాహ్మణ్ణి పిలుచుకొనిరండి. బ్రాహ్మడులేనిదే తద్దినం ఏవిటి? మాట్లాడకుండా తిన్నగా పోయి కూరలు తీసుకువొచ్చి, బ్రాహ్మడితో చెప్పిరండి."

అప్పుడు మాట్లాడకుండా తలకాయ వొంచుకొని రామావధాని కూరలుకోసరం వెళ్లాడు. ఈవుపాయంవల్ల తన భార్యని తాననుకున్నట్లల్లా నడిపించవచ్చు ననుకున్నాడు. తనభార్య తానేదిచేయమంటే అది చేయదు, ఏదిచేయవద్దంటే అది చేస్తుంది కాబట్టి చేయగూడని పనిని చేయమనడం, చేయవలసిన పనిని చేయవద్దనడం యిదే సూత్రం అనుకొని, సంతోషంతో కూరగాయల దుకాణానికిపోయి పుష్కలంగా తద్దినానికి కావలసిన కూరకాయలను గొని, బ్రాహ్మడితో చెప్పి యింటికివొచ్చాడు.

తర్వాత రాత్రిభోజనమైన పిదప భార్యతో రామావధాని "ఇదుగో చూడు; ఇవన్నీ యిప్పుడుతరగక్కఱలేదులే. పెందలకడనే పండుకొని తెల్లవారుఝాముననే తరుగుకొనవచ్చు."

"మీరేం మాట్లాడకండి. నాకు వొళ్లుమండుతూంది."

"పోనీగాని నేనుగూడా నీకు సహాయం చేస్తాను."

"మీకో నమస్కారం బాబూ. మీరు సహాయం చేయనక్కరలేదు మాట్లాడకుండా పోయి ఒకమూల పండుకొంటే నాకు సహాయం చేసినంతఫలం."

పెళ్లాం చెప్పినట్టుగా రామావధాని "బ్రతుకు జీవుడా" అనుకొని హాయిగా గుండెపైన చేయివేసికొని, గుర్రుపెట్టి నిద్రపోయాడు. సీతారావమ్మ కూరానారా తరిగి యిల్లంతా శుభ్రం చేసికొని, తర్వాత ఆలస్యంగా పడుకొన్నది.

* * * *

తెల్లవారింది. ఆవాళ మామగారి తద్దినం. సీతారావమ్మ యింటిపనులన్నింటినీ సిసింద్రీలాగ గబగబ చేసేస్తోంది. రామావధాన్ని ఒక్క పూచికపుల్ల యెత్తుపనినైనా ముట్టుకోనియ్యలేదు. రామావధానికావాళ నిజంగా పర్వదినంలాగ కనబడింది. అతని ఆనందానికి మితిలేకపోయింది.

తొమ్మిది గంటలకల్లా మడికట్టుకొంది. వంట అంతా పిండివంటల్తోసహా రెండుఘంటల్లో చేసేసింది. తర్వాత బ్రాహ్మడు దర్భలు పట్టుకువొచ్చాడు. రామావధాని స్నానంచేసి మడికట్టుకొనివచ్చి, అగ్నిహోత్రం ముందు కూర్చున్నాడు. తర్వాత మంత్రాలన్నీ అయిపోయినాయి. బ్రాహ్మడు భోజనానికి కూర్చొని "పదార్థాలన్నీ బహు రుచిగా వున్నాయి" అని మెచ్చుకొంటూ కంఠందాకా మెక్కించాడు. భోజనం అయిన తర్వాత తాంబూలంలో దక్షిణ సమర్పించి, నమస్కరించి సాగనంపాడు బ్రాహ్మణ్ణి రామావధాని. అప్పటికి మూడుగంటలప్రొద్దు తిరిగింది. రామావధాని భార్యతో "ఇప్పటికి చాలాప్రొద్దు పోయింది. నువ్వుముందు భోజనంచేయి. నేను ఈపిత్రుశేషాన్ని కాలువలో కలిపివేసి స్నానంచేసి వొస్తానన్నాడు. పాపం; అది పొరబాటున అన్నాడు. అప్పుడు సీతారావమ్మ తొక్క త్రొక్కిన త్రాచులాగ గస్సుమంటూలేచి" చాలు, చాలు. ఇప్పటికి మూడుగంటలైంది. ఒకమూల నాకు ఆకలిప్రాణాలు పోతున్నాయి. ఇప్పుడు మీరీమూటను తీసికొనివెళ్లి కాలువలో కలిపి, స్నానంచేసి వొస్తారా? చాలుచాలు అందాకా నేను కనిపెట్టుకొని వుండాలా?

"నువ్వు కనిపెట్టుకొని వుండక్కర్లేదు. నువ్వు ముందు భోజనంచెయ్యి. నేను తర్వాత వొచ్చి చేస్తాను."

"నేనుముందూ, మీరు వెనకానా?"

అంటూ రామావధాని చేతిలోవున్న పితృశేషాన్ని వూడలాగి, విసవిసపోయి గేదత్రాగేకుడితి తొట్టిలో పోసేసింది. రామావధాని అలాగే నిశ్చేష్టుడై కొయ్యబారి పోయాడు. పాపం; ఇంతవఱకు జాగ్రత్తగానే తద్దినాన్ని భార్యచేత సక్రమంగా నడిపించుకొచ్చాడు. పొరబాటున మఱచిపోయి తనం పిత్రృశేషాన్ని కాలువలో పడేస్తా అన్నాడు. దానితో మొగుడికి వ్యతిరక్తంగా చేసే గుణంగల సీతారావమ్మని ఆపిత్రృశేషాన్ని తీసుకువెళ్లి కుడితి తొట్లోపోసింది. ఇంతాసక్రమంగాచేసి ఆఖరికి రామావధాని తండ్రి తద్దినాన్ని నిష్ఫలం చేసుకొన్నాడు.

"ఏమలా దిగులుబోయి, మిడిగ్రుడ్లు పెట్టుకొని, నిలబడి చూస్తారేం? భోజనానికిరండి"

అని భార్య పిలిచేటప్పటికి రామావధానికి యెక్కడలేని కోపంవొచ్చింది. ఆగ్రహ మేశాన్నైపోయాడు. ఒళ్లంతా గడగడ వడకుతోంది. అదిచూచి సీతారావమ్మకి కొంచెం భయంవేసింది.

"ఏమిటలా వొణుకుతారు? భోజనానికిరండి"

"నాకు భోజనంవొద్దు పిండాకూడువొద్దు. నీపిండాకూడు పిల్లులకేసుకొంటే చాలులే."

"ముందు మీపిండాకూడు పిల్లులకేసుకున్న తర్వాతనే నాపిండాకూడూను."

"కులనాపకపు ముండా, నువ్వెక్కడదాపురించావే నాపాలిటికి. హద్దుపద్దులేక నోటికివొచ్చినట్లల్లా వదుర్తావ్ పోనీ పాపంగదా అని వూరుకుంటుంటే నీవాడింది ఆట, పాడింది పాటగా సంచరిస్తావ్? నాతండ్రి తద్దినాన్ని నాశనం చేశావు. పైగా నాపిండాకూడు కూడ పెట్టడానికి సిద్ధంగా ఉన్నావు. అంటే నేను చావడం నువ్వు కోరుతున్నావన్న మాట. నాచావు కోరేదానివి నువ్వు నాయింట్లో యెందుకు? నువ్వు తక్షణం నాయిల్లువదలి మీపుట్టింటి వెళ్లిపో. నువ్వింక వొక్కక్షణం నాయింట్లో ఉండతగవు"

అని రామావధాని భార్యని గర్జించాడు. ఎన్నడు అతడు తనభార్యనింత తీవ్రంగా గద్దించి యెఱుగడు. ఎంత అపరాధం చేసినా తానే సద్దుకుపోతుండేవాడు. కాని యీ సారి తన పితృశేషాన్ని కుడితితొట్టిలో పడేయడంచూసి అతనికెక్కడలేని ఆగ్రహం వొచ్చింది. అందుకని భార్యని లేచిపొమ్మన్నాడు. ఇలా భర్త తనని దూషిస్తూ, యిల్లు వొదిలి పొమ్మనేసరికి సీతారావమ్మకి ఆశ్చర్యం, రోషం, విచారం యివి మూడు కలిగాయి. ఇవి మూడింటిని తెలియ

జేస్తూన్న చూపుల్ని భర్త వొంకబరపింది. కాని రామావధాని తన తీవ్రతను మాత్రం వొదలలేదు.

"నేను వెళ్లను. ఏంచేస్తారో చేయండి."

"వెళ్లకపోతే జుట్టుపట్టుకొని బయటికి గెంటేస్తా."

"గెంటెయ్యండి చూద్దాం."

అప్పుడు రామావధాని ఆగ్రహావేశంతో, భార్యయొక్క కొప్పు పట్టుకొని, బరబర యీడ్చుకొంటూ వీధిలోకి లాగుకువచ్చి, పొమ్మని తలుపులు బిడాయించుకొన్నాడు. అప్పుడు సీతారావమ్మ అవమాన విచారాలకి మితిలేక పోయింది. భంగపడితిని గదా అనే రోషం; తననట్లు భర్త జుట్టుపట్టుకొని వీధిలోకి యీడ్చినాడుగదా అన్నకోపం సీతారావమ్మను ఆవేశించాయి. అలా అరగంటసేపటివఱకు వాకిటి గుమ్మం దగ్గిర నిశ్చేష్టురాలై నిలబడిపోయింది. తర్వాత ఒంటరిగా, ఆవూరికి సమీపంలోవున్న తన పుట్టింటికి వెళ్లిపోయింది.

* * * *

సీతారావమ్మ వెళ్లిపోయిన తర్వాత రామావధానికి చాలా విచారం వేసింది. పెంకె మనిషిగాని యింకో దుర్నీతి మనిషి దగ్గిర ఏమీలేదు. ఆవిషయంలో మాత్రం నిప్పు వంటిది అని తనకే తెలుసు, ఊళ్లో అందటికి తెలుసు. ఎప్పుడూ గుమ్మం వొదిలి అంతగా బయటికి వెళ్లి యెరుగదు.

లేనిపోని పోకుల్ని చేయదు. పోరుగింటి పెత్తనాలంటే అసలే గిట్టదు. తన యిల్లేమో తనపనియేమో అంతేగాని బయటి వాళ్లవోసు మెత్తదు. కాని పెంకిమనిషి, మొడ్డెం అంటే తెడ్డెం అనేరకం. రామావధానిని ఒక్క నిమిషమైనా బయటికి పోనిచ్చేదికాదు. ఎప్పుడూ తనభర్త యింట్లోనేవుండాలి. ఎప్పుడైనా ఖర్మంచాలక ఏవూరన్నా వెళ్తే, వొచ్చేదాక ఏడుస్తూవుండేది. అది బాగా అనుభవం రామావధానికి. అందువల్లనే ఆపెనుగురించి అంత విచారపడ్డాడు. అదీగాక అలా, యెప్పుడూ ఒంటరిగా వెళ్లనిదాన్ని తానకొట్టి వొంటరిగా పంపించానే అని చాలా దుఃఖించాడు. కాని పుట్టింట్లో యెన్నాళ్లుంటుందో పరిక్షించాలనుకొన్నాడు.

*　　　*　　　*　　　*

సీతారావమ్మ పుట్టింటికివెళ్లి వారముదినాలైంది. ఆవారం దినాలు పుట్టింట్లో సీతారావమ్మకి కొన్ని యుగాల లాగు కనిపించాయి. అసలు సీతారావమ్మ పుట్టింటికి వొచ్చి కొన్ని సంవత్సరాలవుతుంది. ఎప్పుడూ భర్తని పుట్టింటికి పంపమని అడిగేదికాదు. ఒకవేళ అన్నగారు, తల్లి తండ్రులు గాని వొచ్చి, రమ్మనమంటే, భర్త నెళ్లమన్నా యేవో సాకులు చెప్పి వెళ్లేదికాదు. ఇనంతా యెందుకు? ఆమె కలహాంతరిత నాయికాజాతిలో చేరుతుంది. అంటే మొగుడున్నప్పుడు

మొగుడితో యెప్పుడూ పోట్లాడ్తూ వుండడము. మొగుడు లేనపుడు ఆతనికై పరితపించడం. ఇవి ఆమెగుణాలు.

అప్పుడే వారంరోజులైందో లేదో సీతారావమ్మ, భర్తకోసరం తహతహలాడిపోయింది. అనేకసార్లు తల్లిదండ్రుల్తో "పాపం; ఆయనేం కష్టపడ్తున్నారో" అని విచారంతో అనేది. భర్త దగ్గరనుంచి యేమిఅన్నా కబురు వొస్తుందేమో అని ఆవారంరోజులు నిప్పులుమీద నిలుచున్నట్టుగా తపించిపోయింది. కాని భర్తదగ్గిరనుంచి కబురు ఏమి లేకపోయింది. అప్పుడు వెంటనే తన అన్నను వెళ్లమని బ్రతిమాలింది. అప్పుడు అన్న "ఏవమ్మా, వారంరోజులైందో లేదో అప్పుడే 'వెళ్తా వెళ్తా' నని అంత తొందర పడ్తావేవమ్మా" అని అడిగాడు. అప్పుడు ఆమె "అదికాదు అన్నయ్యా, ఆయన అసలే చిక్కిపోయివున్నారు. ఏమీ వోపికలేనివారు. ఆయన యిప్పుడు వొండుకోవడానికి చాలా కష్టపడ్తూంటారు." అని అంది.

"అదేవిటమ్మా! రాకరాక వొచ్చావు. ఇంతలో యింత తొందరెందుకు? అతడికి అంతకష్టంగా వుంటే కబురంపించడా, లేకుంటే అతడురాడా?"

"అలాంటివారు కాదన్నయ్యా, అయన నేనుపుట్టింటికి వొచ్చి చాలాకాలమైందిగదా. ఒచ్చి వారంరోజులైనా

కాలేదు. ఈలోపుననే రమ్మనమంటే బాగుండదని మొగ మోటపడ్డారు. నువ్వు కాస్తవెళ్లి ఆయన్ని తీసుకురావాలి."

"నేనెందుకు వెళ్లడం? జాబురాస్తే రాడూ. లేకుంటే మనిషి పంపిస్తేసరి."

"అలారారు, నామాటవినవూ? నేనెందుకంటున్నానో నువ్వే వెళ్లిరా."

ఇలా అనేటప్పటికి సీతారావమ్మ అన్న సుబ్బావధాని తన చెల్లెలికీ, బావకి ఏదో ఘర్షణ జరిగివుండొచ్చు అను కున్నాడు. ఆసంగతి తనతో చెప్పకుండా దాస్తోందను కొన్నాడు. అందుకనే ఆమె ఒంటరిగాకూడ వొచ్చిందను కున్నాడు.

*　　*　　*　　*

రామావధాని వంటచేసుకుంటూండగా "బావా, బావా" అని తలుపు చప్పుడయింది. అప్పుడు తలుపుతెరచి "ఏమోయ్ బావా, ఎక్కణ్ణుంచి రావడం ఇంటిదగ్గిరనుంచేనా? అంతా కులాసాగా ఉన్నారా?"

"ఆఁ, అంతా కులాసాగానే వున్నాం" కాని ఏవిటోయ్? మాచెల్లెల్ని వొంటరిగా పంపించావ్. అంత తీరికలేక పోయిందేవిటి నీకు?"

"ఔను మరి, ఎవళ్లవాళ్లు వాళ్లకిష్టంగదా"

"ఏవిటోయ్, ఏవిటాలా వింతగా మాట్లాడుతున్నావ్? నాకేమి అర్థంకావడం లేదు."

"ఇందులో వింతేముంది? మీచెల్లెలు అంతా చెప్పి వుంటుందిగా."

"ఏవిటి! ఏం జరిగిందేవిటి? నేనేదో జరిగివుంటుందనే అనుమానపడ్డాను గాని మాచెల్లెలు చెప్పలేదు."

"అబ్బా, ఎంత టక్కరివోయ్. మీచెల్లెలు నీతో యేం చెప్పలేదేం?"

"రామ, రామ. నాతోడోయ్"

"నిజంగా"

"అంత వొట్టేసుకుంటానా?"

అప్పుడు బావమరిదికి పూసగుచ్చినట్టుగ అక్కడ జరిగిన కర్మకాండ అంతా చెప్పేటప్పటికి అతను నిర్ఘాంత పోయి యిదంతా యింటిదగ్గిర చెల్లెలు చెప్పలేదేమా అని ఆశ్చర్యపడ్డాడు.

"ఔతే, బావా! నన్ను, నిన్ను తీసుకురమ్మనమని చెల్లెలు పంపించింది. పైగా నువ్వు కష్టపడ్డావని యింకా యెన్నో చెప్పిందిగాని యీసంగతేమి చెప్పలేదు సుమా"

"ఔను, నీచెల్లెలు కలహాంతరితనాయిక. కాని

చెప్పిన మాటవినక నన్ను అనేక యిబ్బందులు పెట్టేది. ఇప్పటికి కొంతవఱకు తగ్గింది. కాని నేనొక ఉపాయం అనుకొన్నాను. ఏమిటంటే, నువ్వేం అనుకోబోకు. నేను రెండో పెళ్లికి సిద్ధంగా వున్నట్టుగా చెప్పు. ఎల్లుండే ప్రయాణమని చెప్పు. తర్వాత తమాషాలు చూద్దాం."

*　　　*　　　*　　　*

అని రామావధాని అనేటప్పటికి బావమఱిది ఒప్పుకున్నాడు. మర్నాడు వాళ్లవూరు వెళ్లాడు.

"ఏమన్నయ్యా! ఆయన్ని తీసుకురాలేదేం? ఏవన్నారు?"

"అయ్యో, ఏవనిచెప్పేది? నువ్వు అతనిమాట వినడం లేదుట. అతనేం చెపితే దానికి వ్యతిరిక్తంగా నడుచుకుంటున్నావుట. ఆతని తండ్రి తద్దినం అప్పుడు పితృశేషాన్ని కుడిచి తొట్టెలో పోశావుట. ఇంకా యేవేవో చేశావని అనేకమైనవి చెప్పి, తనకింకా నువ్వు వద్దని, వేరేపెళ్లి చేసుకుంటాననీ చెప్పాడు"

"ఆఁ, వేఱేపెళ్లా!"

"ఔను, ఎల్లుండే బయలుదేరి వెళ్తాడు."

ఈమాటలువిని సీతారావమ్మ నిట్టనిలువున విచారంచేత క్రుంగిపోయింది. ఆమె ముఖంలో నెత్తురు చుక్కలేదు. వెంటనే ఏమాత్రం ఆలస్యంచేయక తనభర్త దగ్గరకివొచ్చింది.

"ఎక్కడికి మీ ప్రయాణం?"

"నువ్వెక్కడికి మళ్లా యెందుకు వొచ్చావ్?"

"నాయిష్టం, నాయిల్లు"

"నీయిల్లుకాదు, నీయిష్టంకాదు. ఇకమీద నీకూ నాకూ సంబంధంలేదు. నీదారి నీది, నాదారి నాది."

"ఔతే రెండోపెళ్లి చేసుకుంటారా?"

"ఔను"

అంటూ రామావధాని తన సామాను సద్దుకొని, ప్రయాణానికి సిద్ధమయ్యాడు. అప్పుడు సీతారావమ్మని యెక్కడలేని యాగ్రహ విచారా లావేశించాయి.

"నేను వెళ్లనీయను."

"నువ్వెవతవు, నన్ను ఆటంకపరచడానికి?"

"నేనెవ తెనా?"

అంటూ మాటలాగ్గొంది.

"సరే; మాటలేకపోయినా సరే నేనువెళ్తా"

అని రామావధాని వాకిట్లోకి రాబోయ్యాడు. సీతారావమ్మ పౌరుషం; బింకం, ఆగ్రహం అన్నీ అణిగాయి. ఒక్కసారిభయం, దుఃఖం ఆవేశించాయి. ఇన్ని నాళ్లనుంచి

అడగియుండి, మఱుగిపోయిన ప్రేమసముద్రం ఒక్కసారి ఘూర్ణిల్లింది. వెంటనే ఒక్కసారి హోరుమని యేడ్చి భర్త పాదాలపైన వాలింది. అప్పుడు రామావధానికి కళ్ల వెంబడి నీళ్లురాలాయి. భార్యని లేవనెత్తి తన వక్షస్థలంలో యిరుకించుకున్నాడు. అప్పుడు సీతారావమ్మ సంతోషం అపారమైంది. కొంతసేపటివరకు వాళ్లిద్దరలావరవశులై నిలబడ్డారు.

"ఇకనుంచి నేను మీ దాసిని. నన్ను క్షమించండి. మీరు చెప్పినట్లల్లా వింటాను."

అప్పుడు భార్య అమాయికత్వానికి రామావధాని ముద్దుపెట్టుకొని

"ఓసి పిచ్చిదానా, రెండోపెండ్లి అంటే యెవరనుకున్నావ్ నువ్వే. అప్పుడు నువ్వు పెంకిపెళ్లానివి. ఇప్పుడు నువ్వు శాంతస్వభావంగల పెళ్లానివి. నీలో యీ మార్పు లున్నాయి కనుక నువ్వే నాకు రెండోపెళ్లాం అయ్యావ్."

"ఎంత గడుసువారు!"

"నువ్వెంత పెంకిదానివి!"

ఇద్దఱూ నవ్వుకున్నారు.

# ౧౧

పెనిమిటిని వొదిలిన పేరమ్మ.

ఒశేవ్, పొరుకి మహాగర్వంగా వుండేవ్. దీనికి ఎటువంటి మొగుడు వొస్తాడోగాని, అబ్బబ్బా, అదిచేసే షోకు లిన్నిఅన్నికావు. తనకి బాగాయింగ్లీషు చదువుకొన్న నవనాగరికపు దొరలాంటి యువకుడు పెనిమిటికావాలని వూరికే అది ఉవ్వ్ళ్లూరి పోతోంది.”

“ఔనే; నువ్వుచెప్పింది నిజమే ఆపిల్లకి యేంచూసు కొన్న యైశ్వర్యమోకాని, మహాగర్వం యెక్కింది. బీద పిల్లల్ని చూస్తే యెక్కిరిస్తుంది. ‘ఎల్లమ్మ మొగుడిలావుంటాడు; పుల్లమ్మ మొగుడిలావుంటాడు నీమొగుడు, అని వొంకలు పెడుతుంది.”

“ఇదిగో నేచెప్తావిను; దానికి పెళ్లిప్రయత్నాలు జరుగు తున్నాయిగదా. దాని తల్లిదండ్రులసలే పూర్వాచార పరాయణులు. పేరమ్మని ఏఘాందసుడికో యిచ్చి పెళ్లి చేస్తారని అంతవఱకు రూఢి.”

“అదిచేసుకోకపోతే యెలాచేస్తారు?”

“ఓసిపిచ్చిదానా, దానికి నగలు, చీరెలు అంటే యెక్కువయిష్టం. కాబట్టి ఎటువంటివాణ్ణి అయినా, నగలు పెడ్తే తలవూపుతుంది.”

"ఎన్నినగలిచ్చినా యిష్టంలేనివాణ్ణి పూర్వాచార ఛాందసుణ్ణి యెలా పెండ్లాడుతుంది?"

"నేనిప్పుడుచెప్తే ఏంలాభం. అది డబ్బుకోసరం, నగలకోసరం యెక్కువగా ఆశపడేది. కాబట్టి తప్పకుండా పెండ్లాడుతుంది." .

"పెళ్లిచేసుకున్న తర్వాత ఆపెనిమిటితో కాపురం సరిగా చేస్తుందా?"

"చెయ్యదు."

"నీకేవన్నా జ్యోత్యం తెలుసునేవిటి? అలా నువ్వేలా చెప్పగలవు?"

"దీనికి జ్యోత్యంగూడా కావాలేవిటి? 'మొఖంచూస్తే తెలీదా మీగాళ్లవాపు' అన్నట్లు దానిచేష్టలు, దానికులుకులు దానిపోకడలు చూస్తే అది కాపరంచేసేదిగా వుందా? మొగుణ్ణి వొదిలి దేశాంతరం పోయేదిగా వుందికాని"

"సరే; మనకింత తొందరెందుకు? అంతా కొద్దిరోజుల లోనే తెలుస్తుంది. అప్పుడు దాన్ని వెక్కిరించడం మనవంతు సుమా."

"ఇంకా మెల్లింగా అంటావేమిటి? దాన్ని మళ్లీ పది మందిలో తలయెత్తుకొని తిరగకుండా చెయ్యాలి."

"నిజమే. అప్పుడుగాని దాని గర్వం అణగదు."

పేరమ్మ తల్లిదండ్రులు పూర్వాచార పరాయణులైన వెంకట్రామశాస్త్రిలు, సుబ్బమ్మ. వెంకట్రామశాస్త్రిలు, "ఆడపిల్లలకి చదువేమిటి? చదువుకొంటే చెడిపోతారు." అనేరకం. సుబ్బమ్మ అటూ చెప్పదు ఇటూ చెప్పదు. భర్త 'డూడూ బసవన్న' అంటే తలవూపే రకం.

వెంకట్రామశాస్త్రిలకి అన్నవస్త్రాలకి లోపంలేకుండా ఏదో పితరార్జితం ఉంది. అతడు మంచి నిష్ఠాపరుడు. ప్రతి రోజూ రుద్రాక్షమాలలు త్రిప్పుతూ ఒకచోటు కూర్చుంటాడు. లేకపోతే ఎవరికైనా ముహూర్తాలు పెట్టవలసివుంటే పంచాంగాలు తిరిగేస్తూ వుంటాడు. ఏవైనా పెళ్లిళ్లవుతే అప్పుడు తాతలనాటినుంచి దాచివుంచిన శాలువని పెట్టెలోంచి బయటికి తీసి ఎండలోవేస్తాడు. అది యిది లేకపోతే జందాలు వొడుగుకుంటూ ఉంటాడు.

పేరమ్మకి పదొంకడేళ్లు వెళ్లబోతున్నాయి. వెంకట్రామ శాస్త్రిలు వరాన్వేషణానికి బయల్దేరాడు. ఏవేవో రెండు మూడు సంబంధాలు వొచ్చాయి గాని పేరమ్మ మారాం పెట్టడంవల్ల వాళ్లేవిసిగివెళ్లిపోయారు. వెంకట్రామశాస్త్రిలు చూసే సంబంధాలన్నీ శుభ్రంగా పాతిక ముప్ఫైయేళ్ల కుర్రవాడు; చక్కగా వేదాధ్యయనం చేసేవాడు; వివాహోపనయనాలు చేయించేవాడు; తద్దినాలు చేయించేవాడు; ఈ

సుగుణాల్తోపాటు విలక్షణంగా పంచెకచ్చలు పోసిన గండభేరుండంచు పంచ, పైనకొల్లాయిగుడ్డ, చెవులకి మకరకుండనాలు, గోష్పాదం అంత వెనక్కాలజుట్టు వీని అందంతో నిగనిగలాడే కృష్ణ వర్ణంతో వుండేవరుణ్ణి చూసేవాడు. అటువంటి వాళ్లు పేరమ్మ మనస్సుకి ఎక్కుతారా. "ఛీ, కోతిముండా కొడుకిని నేను పెళ్లిచేసుకోను" "అని తిట్టి దిగబారబోసేది. అప్పుడు కూతుర్ని అనేకవిధాలుగా వెంకట్రామశాస్త్రి తిట్టి దిగబారబోసేవాడు.

"అలా నిక్షేపంలాంటి మూడు సంబంధాల్ని దురదృష్టవంతురాలు చెడగొట్టేసింది. దానిది యింతకి దరిద్రపు జాతకం. ఎవరి దరిద్రానికి ఎవరేం చేస్తారు!" అని విసుగుకొనేవాడు.

ఒకరోజు కూతుర్ని పిలిచి "ఇదిగో, యింతవరకు నువ్వెన్నో సంబంధాలొస్తే అవి అన్నీ చెడగొట్టావు. మరి నీకెవరు యిష్టంచెప్పు."

"చెపితే మీరు కోపపడరుగదా"

"కోపమెందుకు, సవ్యంగావుంటే"

"సవ్యమో కాదో, నాకు నచ్చిన సంబంధం చెప్తాను."

"చెప్పు"

"నాకు సిగ్గేస్తోంది నాన్నా"

"సిగ్గేవిటి?"

"ఖాతే చెప్తా"

"చెప్పు"

"నాకు పదహారేళ్ల చక్కని కుర్రాడు, ఇంగ్లీషు చదువుకున్న........."

"చస్, నోరుముయ్యి. అప్రాశ్యపుదానా"

"నాకు పిలకజుట్టువాళ్లు వొద్దు"

"నోరుముయ్యి; నీయిష్టమేమిటి? అట్టేనీల్గావంటే కూంబలెగ దీస్తా"

అని వెంకట్రామశాస్త్రి గుడ్లెర్రజేసి కూతుర్ని గదమాయించేటప్పటికి అప్పుడు కూతురినోరు తాళంపడింది.

* * * *

సరే వివాహం, శాస్త్రిగారి కూతురికి. అన్నివిధాల నచ్చిన వరుడే దొరికాడు వెంకట్రామ శాస్త్రిగారికి. అమ్మాయి ఏవి అనకుండా యిన్ని నగలు చూపించేటప్పటికి పేరమ్మ మఱి మాట్లాడలేదు. వివాహం దేవుడిగుళ్లో ఒక్క రోజు అయిపోయింది. అప్పటినుంచి ప్రారంభించారు తోడి పిల్లలంతా పేరమ్మ మొగుణ్ణిగురించి గేలిచేయడానికి. పేరమ్మకు

భలేసిగ్గైంది నలుగురిలో తలయెత్తుకు తిరగడానికి. ఎప్పుడూ యింట్లోనే వుండేది. మొగుడిమొగం అప్పుడప్పుడు పండగకి తనయెదుట ప్రత్యక్షమౌతుంటే పేరమ్మ శరీరం మండిపొయ్యేది. చాటుకుపోయి మెటికెలు విరిచేది. పాపము మొగుడు మట్టుకు పేరమ్మ ముఖదర్శనం యెప్పుడెప్పుడా అని చంద్రుడి కోసరం చకోరంలాగ కాచుకొని వుండేవాడు. కాని పేరమ్మ మొఖం యెప్పుడూ మబ్బుచాటుననే దాగివుండేది.

“మాచకమ్మ సమర్తమఖ ఆయెనా, పుబ్బ ఆయెనా” అని పరితపించిపోయాడు పేరమ్మ మొగుడు యజ్ఞనారాయణ. కొన్నాళ్ళకి యజ్ఞనారాయణ పరితాపం చల్లారింది. పేరమ్మ సమర్తాడింది. కొద్దిరోజులలోనే కార్యంగూడా అయింది. తర్వాత పెళ్ళాన్ని యజ్ఞనారాయణ బెజవాడకు తీసుకెళ్ళాడు.

దేవుడిదయవల్ల యజ్ఞనారాయణ కొంచెం కలిగిన వాడే. పేరమ్మకి ఏవిధంగాను కొఱత కలగజేయడంలేదు. అతని యింట్లో పాడిపంట సమృద్ధిగానే వున్నాయి. ఇంట్లో తనతల్లి తాను తనపెళ్ళాం తప్ప యింకెవ్వరులేరు. కాబట్టి తాను తనపెళ్ళాం చిలుక గోరంకల్లాగు సుఖంగా సంసారం గడపొచ్చు.

పాలు పెరుగు త్రాగి పేరమ్మకి కండబట్టింది. మనిషి యిదివఱకంటే యిప్పుడు చాలా అందకత్తె అయింది. తనకే

గదా అందమైన పెళ్లాం వుంది అని మహాబడాయి యజ్ఞ నారాయణకి. తానేమో, తనపెళ్లామేమో అంతేగాని యెప్పుడూ యిల్లుకదిలి యెరుగడు. అతనికి ఆఅందమైన పేరమ్మ దొరకడం 'కోతికి కొబ్బరకాయ దొరికినట్టుగా'వుంది. కాని పేరమ్మకి మాత్రం అదేవిటో ఒకమాదిరిగా వుండేది. మొగుడు తనపైన అంతప్రేమ చూపిస్తో; తనను వొదిలి ఒక్క క్షణమైనా బయటికి పోకుండా, కంటికి రెప్పలాగచూస్తూ, తనకు కోరిననగలు, చీరెలు కొనియిస్తూ, తన కనుసన్నలలో ఎప్పుడూ మెలుగుతూ వుంటే యింకా పేరమ్మకి ఏంకొఱత అయిందో కాని మొగుణ్ణిచూస్తే మొటమొటలాడేది. అనేక విధాల మొగుణ్ణి సాధించేది; ఈసడించి కొట్టిపారేసేది. కాని ఆమానవుడికి ఆవగింజంతైనా కోపంలేకబోయేది. ఈసడించి కొట్టినకొద్ది పెళ్లాంకాళ్లు పట్టుకోడాని కొచ్చేవాడు. అన కూడదుగాని, ఒక్కొక్కసారి ప్రహారణాలు గూడతింటూంటే వాడుభార్యచేత. ఇదంతా యెందుకు, పాపం యజ్ఞనారాయణ భార్యకి దాసానుదాసుడైపోయాడు. ఆవిడ కూచోమంటే కూచొనేవాడు నిలుచోమంటే నిలుచునేవాడు. పడుకోమంటే పడుకొనేవాడు. మఱియేమి చేయమన్నా చేసే వాడు. భార్య యెన్నిఅన్నా, ఏంచేసినా గోవులాగ అన్నీ భరించేవాడు. ఆయింట్లో పెత్తనం అంతా పేరమ్మదే అయి పోయింది.

ఇలా వుంటూన్నప్పటికి పేరమ్మకింకా యజ్ఞనాయరాణ మీాద అయిష్టమే. యజ్ఞనారాయణ పూర్వాచార పరా యణుడన్నమాటే గాని మంచిస్ఫురద్రూపి. అయినా పేరమ్మ కంటికి కురూపిగానే కనబడేవాడు. ఇదివఱకు యజ్ఞ నారాయణ అంటే బెజవాడలో చాలా మంచిపేరు వుండేది. కాని పేరమ్మ వొచ్చినతర్వాత అదంతా పోయింది. అతని సంసారం ఎప్పుడూ బయటవుండేది. పేరమ్మ చీటికి మాటికి వీధులెక్కి రంకెలుప్టేది. యజ్ఞనారాయణమాత్రం కిక్కురుమనేవాడు కాడు. అందఱు అతనిని "ఛీ, ఛీ! వాడు ఆడంగి డవ్వారా" అని అనేవారు. అవి అన్నీ తలకాయ వొంచుకొని భరించేవాడు. ఒక్కనాడుగూడా పేరమ్మ సంతో షంగా భర్తతో కాలంగడపలేదు. ఎప్పుడూ ఎడమొగం పెడమొగంగానే వుండేది. యజ్ఞనారాయణమాత్రం తన భార్య అలా సంచరిస్తున్నందుకు చాలా విచారపడ్డాడు. అది బయటికేమాత్రం పొక్కనీయలేదు. 'తానేవిధంగాగూడ లోపంచేయడం లేదే, ఎందుకుచెప్మా తనభార్య తన నీలా భాధించడం' అని యెప్పుడూ ధ్యానించేవాడు.

పేరమ్మ వచ్చినతర్వాత యజ్ఞనారాయణకి యిది వఱకుండే నిష్ఠ, మడి అంతా మన్నైపోయింది. అతని ముసలి తల్లి మాత్రం అప్పుడప్పుడు గొణిగేది గాని పేరమ్మ నోటికి

పెటిచి ఏమి మార్లాడేదికాదు. యజ్ఞశాస్త్రి సంధ్యావంధనం దగ్గిరనుంచి మానేశాడు. భార్య యిష్టప్రకారం ఆతడు పిలక జుట్టు గొరిగించి క్రాపుపెంచాడు. కళ్లకి రోల్డుగోల్డు కూలింగు లెన్సెస్ తగిలించాడు. కాళ్లకి స్లిప్పర్స్ తొడిగాడు. గ్లాస్కో మల్లు, గ్లాస్కో ఆఘారం, పైన శిల్కుకండువా యివి తయారయినాయి. అప్పుడతని విగ్రహం అందంగానే తయారయింది. కాని పేరమ్మకి మాత్రం అతడింకా నైదీకిగానే కనబడేవాడు. అతనికో కమ్మని సంగీతంవొచ్చా, ఒక కవిత్వం చెప్పడంవొచ్చా, ఒకటిరెండు యింగ్లీషు ముక్కలొచ్చా, పోనీ నాటకాల్లో ఏమైనా వేషాలు వేసేవాడా, పోనీ ఏమైనా ఉద్యోగం చేసేవాడా. ఏమితెలీని మొద్దు అవతారం. అటువంటివాడా మన నవనాగరికపు నారిమణియైన పేరమ్మకి తెగిన భర్త! ఎంత ఆశ్చర్యం! నవనాగరికంలో పేరమ్మ కాలి గోరుకు పోలడు యజ్ఞనారాణం. అతడు వట్టిదద్దమ్మ.

పేరమ్మ ఆడినది ఆట పాడినది పాట అయిపోయింది. స్వయంరాజా స్వయంమంత్రీ అయిపోయింది. ఆమె యేం చేసినా, ఎన్నిపోకడలు పోయినా యిదియేం అని అడిగేవాళ్లు ఎవళ్లూలేరు. భర్త తన దాసుడై పోయాడు. ఇక పేరమ్మ ఇష్టమే యిష్టం, రాజ్యమే రాజ్యం; పేరమ్మకి ఏవిధాన్నిచూసినా ఏం కొదవలేదుగాని ఒకభర్త విషయంలో మాత్రమే ఆమెకి

కొదువ కనుపించేది. భర్త తనతో కలిసే రకంగాదు. అతనికి నవనాగరికపు మజాఅంటే యేమిటో తెలీలేదు. ఎప్పుడూ "అయ్యో సంధ్యావందనం మానేశానే, అయ్యో దేవతార్చనలు మానేశానే. అయ్యో వివాహోపనయనాలు చేయించడంలేదే అని యేడ్చేరకం. పేరమ్మ హార్మోనియంముందు కూర్చొని ఒక పార్సీమెట్టు పాడ్తే మెచ్చుకోవడం ఏలాగో తెలుసుకోనేవాడు కాడు. అటువంటి లలితకళలంటే ఏమిటో అర్థంకాని మూర్ఖుడు. తనజన్మంలో ఒక నాటకానికిగాని, ఒక బయిస్కోపుకుగాని వెళ్ళియెఱుగడు. పేరమ్మ బలవంతంమీాద ఒకటి రెండు సార్లు నాటకానికెళ్లాడేమో. పేరమ్మ నాటకంచూసి యింటికివొచ్చి, అతన్ని పరీక్షిద్దామని "నాటకం యెలావుంది!" అని ప్రశ్నిస్తే, ఏంచెప్తే యేం తంటావొస్తుందో అని "నీకెలావుంది" అని మళ్లీ ప్రశ్నించేవాడు. పేరమ్మ బాగుందంటే బాగుందనేవాడు. లేకపోతే లేదనేవాడు. నాటకసమయంలో ఏపాత్రధారియైనా బాగా అభినయిస్తూ, పాడ్తే, సభికులందఱూ "హాయ్, హాయ్" అంటూ మెచ్చుకొని చప్పట్లుకొడితే, అంతవఱకు కునికిపాట్లు పడ్తూ, పేరమ్మ మోచేతితో పొడుస్తే, అప్పుడులేచి, అన్ని చప్పట్లు ఆగిపోయేవేళకి తాను చప్పట్లు కొట్టడం ప్రారంభించేవాడు. అక్కడ వుండేవాళ్లంతా ఆతని వొంకచూసి, పిచ్చివాడనుకొని పకపక నవ్వేవాళ్లు. అదిచూసి పేరమ్మకి చాలా

సిగ్గయ్యేది. అప్పుడెవరైనా అమ్మలక్కలు ఆయన తనకే మాతారంటే, ఇంకేదో చెప్పేదిగాని భర్తఅని మాత్రం చేప్పేదికాదు. ఆనాటకాన్నుంచి యింటికి రాగానే పేరమ్మ భర్తని అనేకవిధాలుగా తిట్టేది. వానినన్నిటిని బహువోర్పుతో ఓర్చుకునేవాడు యజ్ఞనారాయణ. అప్పటినుంచి, యిరుగు పొరుగమ్మలక్కల్తో కలిసి, యేనాటకానికైనా, సినిమాకైనా వెళ్లేదికాని భర్తనిమాత్రం రావొద్దనేది. అతడుగూడ "బ్రతుకు జీవుడా" అనుకునేవాడు.

పేరమ్మచేసే షోకులు చెప్పతరంకాదు. ఒళ్లంతా కనబడే వుల్లిపొరలాంటి రోజాచీరె, దానిపైన పవిటకి గ్రుచ్చుకొనే పిన్ను. సిల్కు ఆఫ్ బాడి రవికె. తలకి 'జనవిహారిశాంతిసుధా' హేర్ ఆయిల్ రాసుకొని, ప్రక్క పాపిడి తీసికొని, క్రాపులాగ, ఉంగరాలు ఉంగరాలుగా దువ్వుకొని, నవనాగరికపు పద్ధతిలో ఒక చక్కని ముడివేసేది. చేతికి రకరకాల బంగారుగాజులు, బంగారపు రిస్టువాచి, కళ్లకు రోల్డుగోల్డు స్పెక్టికిల్సు. ఇక నగలు విషయంలో చెప్ప నక్కరలేదు. ఇప్పటి నవనాగరికపు పద్ధతి ననుసరించి అనేక నగలు వున్నాయి. అకేషియా సోపుతో మొగం రుద్దుకొని, ఫేస్ పౌడర్ మొఖానికద్దుకొని, ఆటోదిల్బహార్ సెంటును పవిటకి రాసుకొని, కాళ్లకి మొఖమల్ పైన చెమ్కీ

కుట్టివున్న హాఫ్ సాండల్ వుడ్ స్లిప్పర్స్‌ని ధరించి టక్ టక్కుమని నడుస్తూ, మధ్యమధ్య రిస్టువాచి చూసుకొంటూ, వొచ్చిరాని యింగ్లీషు ముక్కల్ని పేలేస్తూ నవనాగరికపు మజా అంతా తూచాలుతప్పకుండా వుడాయించడం ప్రారంభించింది. మొగుడి ఎముకలుకొఱికి తనకింగ్లీషు నేరవడానికి ఒక పంతులమ్మను, హార్మోనియం నేర్పడానికి ఒక సంగీతం మాస్టరును అమర్చుకొంది.

* * * *

ఆరోజు శకుంతలనాటకం. బెజవాడనిండా ఎక్కడ చూసినా అక్కడ నోటీసులు కుప్పతిప్పలై పోయినాయి. గొప్పగొప్ప నటకులు ఆక్టుచేస్తారని ప్రతివాళ్ళు అనుకోవడం మొదలువెట్టారు. ప్రతివాళ్లు ముందుగానే సీట్లను రిజర్వు చేసుకోవడం ప్రారంభించారు. అప్పుడు పేరమ్మ ఆరోజు జగన్మోహిని అవతారాన్ని ధరించింది. యజ్ఞనారాయణ తన పెళ్లాన్నిచూసి గుమ్మైపోయాడు. అప్పుడు పేరమ్మ భర్తనుచూచి

"ఏం, వొస్తారా, యివాళనైనా నాటకం చూడడానికి."

"నువ్వు రమ్మంటే వొస్తాను గాని నిజం చెప్తాను కోప పడకు నాకు నాటకం అంటే గిట్టదుసుమా"

'గిట్టకపోతే మీరింట్లో వుండండి. వృథా డబ్బు

దండగ యెందుకు? నేను వెళ్లివొస్తా ఒక ఐదు రూపాయలు యిలా పడేయండి."

"ఒంటరిగా వెళ్తావా?"

"వెళ్తేయేం? నన్నెవరు పట్టుకుంటారు."

"అదికాదే, వస్తువాహనాలు పెట్టుకొని రాత్రిళ్లు వెళ్లడం అంతమంచిదికాదు. ఈవూరు మహాపోకిరి వూరు. ఏపోకిరి వాడైనా వొచ్చి నగలకాశపడి ఏమైనా చేస్తాడు అందుకు."

"నాకుమాత్రం అంత తెలీదనుకున్నారా యేవిటి? పక్కింటి సుందరమ్మ, వాళ్లూ వెళ్తారట. వాళ్లతోనే కలిసి వెళ్తాను."

"అలా అయితే మంచిది. కాని ఐదురూపాయ లెందుకు?"

"అలా యేడుస్తారేవిటి, నాకివ్వడానికి"

"ఎందుకని అడిగితే తప్పా?"

"ఔను. మాట్లాడకుండా యిలా పడేయండి."

తర్వాత పేరమ్మ నోటికివెఱచి యజ్ఞనారాయణ మాట్లాడకుండా ఐదురూపాయల నోటుతీసి యిచ్చివేశాడు. ఆయైదు రూపాయలు పట్టుకొని, అత్తరు గుమాయింపుతో, గులాబీ సంపెగపువ్వుల పరిమళాల్తో పక్కింటికెళ్లింది పేరమ్మ.

అప్పుడు సుందరమ్మ పేరమ్మని చాలా గౌరవించి, ఆయన రాలేదా?" అంది.

"లేదు" అని పేరమ్మ జవాబిచ్చింది.

"అదేవిటమ్మా, మీఆయన వొట్టి ఛాందసుడిలాగ కనబడ్తారేవిటి!"

"ఔను; ఎద్దుమొద్దు ఏలరావు రకం!"

పేరమ్మ సుందరమ్మ యిలా మాట్లాడుకుంటూండగా సుందరమ్మ భర్తవచ్చి "ఇంకా ఆలస్యం యెందుకు? బండీ వొచ్చింది ఎక్కండి" అని అన్నాడు. అప్పుడు సుందరమ్మ పేరమ్మని రమ్మని పిలిచింది. పేరమ్మ ఒయ్యారంగా బండీ దగ్గరకి వెళ్లింది.

*　　*　　*　　*

సుందరమ్మ మొగుడు వెంకట్రావు. బెజవాడ మున సబు కోర్టులో గుమాస్తా. నెలకు నలభై రూపాయల జీతం. పైన యెంతలేదన్నా పాతిక రూపాయలదాకా సంపాదిస్తాడు. అతడు అంత నవనాగరికుడు కాకపోయినా, క్రాపుదువ్వడం, గడ్డం యెప్పటికప్పుడు కొట్టించడం, శుభ్రమైన దుస్తుల్ని వేయడం, నాటకాలకి బయిస్కోపులకీ వెళ్లుతూండడం యీలాంటివి చేస్తాడు. అయితే అతడు కొంచెం అటువంటి గుణంకలవాడని వాడుక. కాని పైకి అంతగా పొక్కేవాడు కాడు. ఏదైనా కొంచెం గుట్టుగానే వ్యవహారం జరిపేరకం.

సుందరమ్మగూడా మొగుడికేమాత్రం తీసిపోయే రకం గాదు. ఆవిడకూడ మొగుడికంటె యిబ్బడి గుట్టును రట్టు చేయకుండా ప్రవర్తించడంలో మంచి నేర్పరి. ఎక్కడైనా నలుపు తెలుపులకి యెప్పుడూ సాధారణంగా పడడం అరుదు. సుందరమ్మ నల్లగా వుంటుంది. వెంకట్రావుది కొంచెం తెల్ల తోలు. అందువల్ల వాళ్ళిద్దరికి పరస్పర వైరుధ్యభావం రంగుభేదాల్లో గుప్తమైంది. కాని యిద్దరూ మంచి నేర్పరుల వడంచేత ఒకళ్ళపైన వొకళ్ళకుగల అసూయతను బహు జాగ్రత్తగా గుప్తంగా ఉంచేవారు. కాని వెంకట్రావుభార్యకు ఏవిధంలోను లోపంచేయలేదు. భార్యకూడా వెంకట్రావు కేవిధంగానైనా అవిశ్వాసం చూపలేదు. సుందరమ్మకి నవ నాగరికత అంటే చాలా యిష్టం. ఆడవాళ్ళకి స్వేచ్ఛవుండాలి అనే రకం. ప్రేమించిగాని పెళ్లిచేసుకోగూడదని యనేక సార్లు పేరమ్మతో సంభాషించింది. పేరమ్మగూడా ఆవిడతో ఏకీభవిస్తూ, ఆవిడని చాలా మెచ్చుకొంది. వీళ్లిద్దరూ ఒకే భావాలుకలవారవడం చేత ఒకళ్లకొకళ్లకి స్నేహం బాగా కలిసింది. ఎక్కడికెళ్లినా యిద్దరు జంటగా పోతూండేవాళ్లు. యజ్ఞనారాయణకి మాత్రం వీళ్లిద్దరు కలిసివుంటే యిష్టంలేక పోయేది. తనపెళ్లాం సుందరమ్మవల్ల చెడిపోతుందేమో అను కున్నాడు. కాని తనపెళ్లాం తనమాటవినేదికాదు గనుక ఆవిషయంలో ఏమీ ఆటంకం పెట్టలేదు.

ముందు సుందరమ్మ బండిలోకెక్కి కూర్చుంది. తర్వాత పేరమ్మ ఒయ్యారంగా బండిదగ్గిరకి, వొచ్చి తనకాలి స్లిప్పర్స్‌ను బండిలో ఒకచోట భద్రపఱచి, తనచేతి రిస్టువాచిని చూసి, 'ఇక టైంలేదు' అంటూ ఒక్కసారి వెనక నిలుచున్న వెంకట్రావువొంక ఒక వాల్చూపును, చిరునవ్వును పారేసి మెల్లగా ఎక్కుతూ, కాలుజారినట్లు నటించి క్రింద తూలి పడబోయింది. అప్పుడు వెనకనున్న సుందర్రావు, నిజంగా పేరమ్మ క్రిందపడుతుందేమో అని వులిక్కిపడి, చటుక్కున ఒక ఆక్కపట్టుకొని యెక్కించాడు. పేరమ్మ నవ్వుతూ బండియెక్కింది. తర్వాత వెంకట్రావు బండియెక్కాడు.

"ఏమోయ్, బండి త్వరగాపోనియ్యాలి"

"అలాగేనండి బాబుగారు, నాగుఱ్ఱం పందెపు గుఱ్ఱం అండి. పంజాబ్ మెయిల్‌లాగ తోల్తా"

బండివాడిమాటకు నవ్వువొచ్చినట్లుగా పేరమ్మ విలాసంగా, వెంకట్రావువొంక కోరచూపుల్ని చూస్తూ, ఒకకంటితో సుందరమ్మని కనిపిస్తూ నవ్వింది. సుందరమ్మ పేరమ్మసంగతి కొంతవరకు గ్రహించి, బండి ముందువైపుకు చూస్తూన్నట్టుగా తలతిప్పుకుంది. బండిలో అంతా చీకటి. పేరమ్మకి అన్ని పరిస్థితులూ అనుకూలంగానే వున్నాయి. వెంకట్రావు వీపుకు పేరమ్మ బుజంఅన్నింది. అప్పుడు వెంకట్రావుకు ఒక్కసారి

ఒళ్లు పులకరించింది. అందుమీంద పేరమ్మ చీరరవికెలకు రాసుకొన్న ఆటోదిల్బహార్, తలలో పెట్టుకొన్న గులాబీ సంపెగపువ్వుల పరిమళం, తలకురాసుకొన్న జనవిహారీశాంతి సుధా హెయిర్ ఆయిల్ యొక్క సువాసన యివన్ని వెంకట్రావును తిప్పేశాయి. ఆచీకటిలో వెంకట్రావుకళ్లు మోహంచేత మఱీ చీకట్లు కమ్మాయి. అప్పుడతనికి పేరమ్మ ఒక జగన్మోహినిలాగ కనిపించింది. పేరమ్మ చూపులు మన్మథుని పూములుల్కు లయినాయి. మాటలు చిలుకపల్కు లయినాయి. నవ్వులు వెన్నెల అయినాయి. ముఖం చంద్రబింబం అయింది. తాను చకోరపక్షి అయిపోయాడు. అప్పుడతని మనస్సులో పేరమ్మయొక్క స్వరూపం, సౌందర్యం బాగా హత్తిపోయింది. ఆమెనుగుఱించి యతనిలో యనేక భావాలు పుట్టాయి. పేరమ్మ బండి యెక్కబోతున్నప్పుడు నడిచిన కులుకునడక, తన అందమైన చేతికుండే రిస్టువాచిని చూసి కోయిలకంఠ స్వరంతో "ఇక టైంలేదు" అని అనడం తర్వాత బండియెక్కలేక తూలిపడడం, ఆతూలిపడ్డప్పుడు తాను తెక్కపట్టుకుంటే అప్పటి పేరమ్మ చిరునవ్వు, వాలుచ్చూపులు అన్ని తలంపుకు వొచ్చాయి. అప్పుడు అతనికి ఆమె శరీరముయొక్క మృదుత్వం బాగా అవగాహనమైంది. ఆమృదువైన శరీరాన్ని తన బాహు పంజరంతో ఎప్పుడూ ఇరుకించుకొని వుండాలెననే అభిలాష అతనికి కలిగింది.

అలా పేరమ్మ బుజం తనవీపున ఆన్చివుంచే అతనికి స్వర్గం అందుకున్నట్టయింది. ఒక్కసారి పేరమ్మని గట్టిగా కావులించు కుందామా అన్నంత ఆవేశం పుట్టింది కాని తనభార్య వుండడం వల్ల భయపడి మానుకొన్నాడు. ఏంచెయ్యడానికి ఏమీ తోచలేదు. ఇంతలో పేరమ్మబుజం మరికొంచెం గట్టిగా అతని వీపుకు నొక్కినట్లయింది. అప్పుడతనిలో ఒకవిధమైన విద్యుత్ప్ర సారమయింది. మెల్లగా వెనక్కితిరిగి చూచాడు. తనభార్య ఆవైపుకు చూస్తోంది. పేరమ్మ తలకాయ వొంచుకుంది. అప్పుడు ఏమి అవుతే అయిందని నెంకట్రావు మెల్లగా తన చేయిని పేరమ్మ శరీరంపైన వుంచాడు. పేరమ్మ కిక్కురు మనకుండా వూరుకొంది. మౌనం అంగీకారసూచనం అను కున్నాడు. తర్వాత పేరమ్మ శరీరాన్ని తన హస్తంతో ధైర్యంగా తాకడం ప్రారంభించాడు. పేరమ్మ అతనికి కొంత అభిముఖురాలైంది. అప్పుడతని వున్మాదం ఏమనిచెప్పేది! దీర్ఘమైన, బలవంతగా నిట్టూర్పుల్ని విడుస్తూ, పేరమ్మ రెండు చేతుల్ని తన నడుముకు చుట్టేసుకున్నాడు. పేరమ్మ చిరు నవ్వు నవ్వుతూవుంది. అప్పుడు తటాలున పేరమ్మ పెదవుల మీద తన పెదవులనుంచాడు. అప్పుడిద్దరూ ఆనందంలో విలీనమైపోయారు. వాళ్లిద్దరి పెదవులప్పుడు కొంచెం కది లాయి. సుందరమ్మ ఓరకంటితో వీళ్లిద్దరి అవస్థని చూసింది. కాని పరధ్యానం నటించింది. సుందరమ్మకు

చాలా విచారం వేసింది. పేరమ్మ తనను ద్రోహంచేసిందను కొంది. తనభర్తను వలలో పడేసుకొంది అనుకొంది. ఇప్పుడు తన భర్త పేరమ్మవశమయ్యాడు. పేరమ్మకి దాసుడయ్యాడు. పేరమ్మయొక్క సౌందర్యానికి ముగ్ధుడైపోయాడు. తానా బండిలోవున్న సంగతికూడా తెలీక తనభర్త పరస్త్రీతో అలా విలాసంగా వుండడం మరింత కోపకారణమయింది సుందరమ్మకి. పేరమ్మయొక్క సౌందర్యం తన సౌందర్యం కంటే అధికమైందని భర్త ఆమెతో అలావున్నాడనుకొని తనకితాను చాలా నిందించుకొని, దుఃఖించింది. పాపం; ఇంతవరకు పేరమ్మని సుందరమ్మ తన ప్రాణస్నేహితురాలు, తన బాగు కోరేది అనుకొంది. కాని తనకింత ద్రోహం చేస్తుందని కలలోనైనా తలచుకోలేదు. అప్పుడు సుంద రమ్మకి పేరమ్మమీద, భర్తమీద అపరిమితమైన కోపం వొచ్చింది కాని అది అంతా బలవంతాన దిగమింగుకొంది. పేరమ్మ తన సంసారానికి చిచ్చుపెట్టింది అని అనుకొంది.

ఇంతలో బండి నాటకంహాలుదగ్గిర ఆగింది. బండీ వాడు దిగండి అని కేకవేశాడు. వెంటనే వెంకట్రావు దిగాడు. అప్పుడు వెంకట్రావు హస్తాన్ని వూతచేసుకొని పేరమ్మ దిగింది. సుందరమ్మ దిగుతూండగా, భర్త తనచేయిని సహాయం యివ్వబోయాడు. కాని సుందరమ్మ అతనిచేతిని

విదలించి "నేను దిగగలను. మీరు దింపనక్కరలేదు." అని అంది. అప్పుడు వెంకట్రావు హృదయం కొంచెం త్రుళ్ళిపడింది. కాని మళ్ళీ సముదాయించుకొన్నాడు.

తర్వాత వెంకట్రావు "టిక్కెట్లు కొనుక్కొస్తాను, మీరిక్కడే వుండండి" అని భార్యతో చెప్పాడు. అప్పుడు పేరమ్మ సుందరమ్మనుచూసి "అక్కా, ఇదిగో అయిదు రూపాయలునోటు. నాకుగూడా బావని ఒకటికెట్టు తీసుకు రమ్మనిచెప్పవు?" అని అంది. అప్పుడు సుందరమ్మ కెక్కడలేని ఆగ్రహం వొచ్చిందిగాని అంతా లోపల అణచుకొని, బల వంతాన నవ్వుతూ ఫరవాలేదులే. నీకుగూడా ఆయనే కొని తెస్తారు." అని అంది.

అదేమిటి అక్కయ్యా, అలా అంటావ్. నాకోసరం మీరు డబ్బు ఖర్చు పెట్టడం యెందుకు?"

సుందరమ్మ అతికష్టంమీద "ఫరవాలేదులే" అంది. "ఓసి, నువ్వెంత జాణవే!" అని పేరమ్మను గురించి తలచు కొన్నది. ఇంతలోపల వెంకట్రావు రిజర్వుడు టిక్కెట్లును పట్టుకువొచ్చాడు. ఇదివరకు నాటకాలకి తానుమట్టుకు కుర్చీ టిక్కెట్టు తీసుకొని, సుందరమ్మకి అర్ధరూపాయ టిక్కెట్టు తీసుకునేవాడు. కాని యిప్పుడు పేరమ్మకి మెహర్బానీకోసరం రిజర్వుడు టిక్కెట్లని కొన్నాడు. సుంద

రమ్మ యితని చర్యలంతా కనిపెట్టుతోనే వుంది. పేరమ్మ కూడా సుందరమ్మ యింతకుముందులాగ తనతో మాట్లాడడం లేదనిన్నీ, ఏదో అనుమానం తట్టిందనీ అనుకొన్నది కాని తెలివి గలది కాబట్టి సుందరమ్మ తనలో అంతగా మాట్లాడకపోయినా, తానేమో నిర్దోషిలాగ ఆమాటా యీమాటా కల్పించుకొని మాట్లాడుతూనే వుంది. సుందరమ్మకి పేరమ్మతో మాట్లాడడం చాలా కష్టమైంది. కాని విధిలేక పూనుకోవలసి వొచ్చింది. సుందరమ్మకి ఇప్పుడు నాటకంమీద సరదా పోయింది "ఎందుకొచ్చామా యీనాటకానికి" అనిపించింది. తలకాయనొప్పి అనో, కడుపునొప్పి అనో సాకుపెట్టి యింటికి వెళ్లిపోదామనుకొన్నది. కాని వెళ్లి బాగుండదని వూరుకొంది. అయినా యింకా పేరమ్మ యొక్కయు, తనభార్త యొక్కయు పోకడ లెలాగుంటాయో చూడాలెనని అనుకొంది.

ముగ్గురు హాలులోకి ప్రవేశించారు. అప్పుడే ప్రార్థన జరుగుతోంది. తొందరతొందరగా పోయి రిజర్వుడులో పేరమ్మ వెంకట్రావు సుందరమ్మలు కూర్చొన్నారు. ఆ తొందరలో ఏమీ ఎరగనట్టు అతి చాకచక్యంగా తాను వెంకట్రావుకు ఎడమచేతి ప్రక్కగా కూర్చొంది. సుందరమ్మ కుడిచేతి ప్రక్కగా కూర్చొంది. వెంకట్రావు మధ్య

కూర్చొన్నాడు. అప్పుడు సుందరమ్మ కోపం భగ్గుమని మండింది. కాని యేం చేస్తుంది? అది అంతా లోపలనే అణిచివేసుకుంది. భర్తయేవో రెండు మూడు మాటలు తనతో అన్నాడు కాని వాటికి సరియైన జవాబు చెప్పక సుందరమ్మ మొగం చిట్లించింది. ఆమార్పును వెంకట్రావు గ్రహించి, తానేమి యెరగనివాడిలాగ, సుందరమ్మ యోగ క్షేమాల్ని విచారించే వాడిలాగ "ఏవిటి, ఇవాళ అదో మోస్తరుగా వున్నావేం?" అని అడిగాడు. "ఏమీ లేదు." అని చీదరించుకొన్నట్టుగా పలికింది. ఇదివరకు అంతగా భర్తని చీదరించుకొనేదికాదు సుందరమ్మ. వెంకట్రావు తనభార్య తనను అనుమానిస్తోంది అని తెలుసుకొని "ఏం లేదంటావేమిటి? నాతో చెప్పరాదూ? నువ్వు ఇదివరకుమల్లే కనబడడం లేదివాళ." అని మళ్లీ ప్రశ్నించాడు. అప్పుడు సుందరమ్మ కోపంఅంతా ఆపుకొని శ్లేషగా "ఎప్పుడూ ఎవరైనా ఒకలాగే ఉండగలరా ఏవిటి?" అని అంది. ఈ ప్రత్యుత్తరాన్ని విని వెంకట్రావు కొంచెం చలించాడు. మళ్లీ అమాయికుడిలాగ చిరునవ్వు నవ్వుతూ "ఏమో, నీభావ కవిత్వం నాకర్థం కావడంలేదు" అని అన్నాడు.

"మీకేలా అర్థమౌతుంది?"

"ఏవిటి యివాళ విచిత్రంగా మాట్లాడుతున్నావ్."

"విచిత్రంలేదు, గిచిత్రంలేదు."

"చాలు, చాలు నీపెడ జవాబులు."

"పెడత్రోవలు తొక్కే వాళ్లకి పెడజవాబులు కాక పోతే యింకేవిటి?

ఈమాటకి వెంకట్రావు త్రుళ్లిపడ్డాడు. పేరమ్మకి భయంవేసింది. పిల్లిదత అనసలు సుందరమ్మ గ్రహించింది. అప్పుడావె కళ్లల్లో నిప్పులు రాల్తున్నాయి. మొగం జేవు రించింది. పళ్లు పెటపెట కొరుకుతోంది. వెంకట్రావు, 'పాకం ముదిరేట్టుగావుంది' అని భయపడ్డాడు. 'ఏలాగురా దేవుడా' అనుకొన్నాడు. పరువు పోతుందేమో అనుకొన్నాడు. అక్కడ తనభార్య ఆవేశంతో అల్లరిచేసి, గుట్టునురట్టు చేస్తే, అక్కడవుండే జనంలో తన తలకొట్టేసుకొన్నట్టవుతుందిగదా అని విచారించాడు. అప్పుడు నెమ్మదిగా భార్యను చూసి "ఇదుగో, సుందరం, యిలా చూడు. నామాట కాస్తవిను. మన యీ సరసాలన్నీ యింటికెళ్లిన తర్వాత ఆడుకొందాం. అంతవరకూ వోపికపట్టు. ఇక నాటకం ప్రారంభించపోతారు. ఎవరైనా చూస్తే, వింటే నలుగురిలో నవ్వులాటు అవుతుంది." అని అన్నాడు.

"అబ్బా, ఏం పరువుగలవారు. మర్యాద పోయిన పరువు నిలవబెట్టుకోవడానికి చూస్తుంటారు."

వెంకట్రావు ఆమాటకి ఆలాగే నిస్తబ్ధుడైపోయాడు. అప్పుడు పేరమ్మ అతిచమత్కారంగా "అక్కా, ఇక మీ సరసాలు చాలించండి. నాటకం ప్రారంభించ పోతున్నారు. అటుచూడండి"

ఆమాటలకి సుందరమ్మ కోపం ఆజ్యంపోసిన అగ్ని చందమయింది. అప్పుడు పేరమ్మవొంక ఉరిమిచూస్తూ "ఓసి, నంగనాచి, టక్కులాడీ, ద్రోహి. నువ్వు చాలించు" అని అంది. అప్పుడా రిజర్వుడులో వున్న కొంతమంది పెద్ద మనుష్యులు వీళ్ల ముగ్గురికేసి ఆశ్చర్యంతో చూశాడు. వెంకట్రావు సిగ్గుచేత తలకాయ క్రిందికి వ్రేలాడేసుకొన్నాడు. అప్పుడు పేరమ్మ కెక్కడలేని ఆగ్రహం వొచ్చింది. అప్పు డొక్కసారి తాను కూర్చొన్న చోటునుంచి లేచింది. వెంకట్రావు వులిక్కిపడి పేరమ్మ వొంకచూసి, కూచోమని బతిమాల్తూన్నట్టుగా కళ్లలో సంజ్ఞచేశాడు. కాని పేరమ్మ మొగం చిట్లించుకొని "చాలు, చాలు. మంచి మర్యాదగానే వుంది. బుద్ధి గడ్డితిని మీతో వొచ్చాను. భలేవాడవయ్యా నువ్వు. నన్ను నలుగురిముందర నీపెళ్లాంచేత ఆలాతిట్టిస్తావా?" అని బలవంతాన కన్నీళ్లని రప్పించుకొని, ఒక్కసారి సాభిప్రాయంగా వెంకట్రావు వొంకచూసి, పిమ్మట సుందరమ్మవొంక తీక్ష్ణంగాచూసి, విసవిస అక్కణ్ణుంచి లేచిపోయింది. అప్పుడు

వెంకట్రావు ప్రాణం యెగిరిపోయినట్టయింది. ఆలాగే మాన వుడు నీరసుడై, మాటలేక, తలకాయ వొంచుకొని కూర్చొన్నాడు. సుందరమ్మ పేరమ్మ వెళ్లినదారినే వుతిమి చూస్తోంది. అప్పుడా విచిత్రాన్నంతా చూస్తూన్న ఆపెద్ద మనుష్యులు వెంకట్రావుకి వినబడేలాగు "ఓహో, ఈవాళ శకుంతల నాటకం అని వొచ్చాం. శ్రీకృష్ణతులాభార నాటక ప్రదర్శనం యిది. రుక్మిణి సత్యభామల పోరాటం చాలా బాగుంది. సత్యభామ అలిగి వెళ్లిపోయింది. రుక్మిణి కోపంగా వుంది. శ్రీకృష్ణుడి కిప్పుడేమితోచక, విచారంతో ఆలాగే తలకాయ వొంచుకొని కూర్చొన్నాడు. భలే నాటకం యిది." అని అన్నాడు. ఈమాటలు వినేటప్పటికి వెంకట్రావుకి మఱింత అవమానం కలిగింది. అక్కడ యింక ఒక్క క్షణంగూడా కూర్చోకూడదనుకొన్నాడు. అప్పుడు భార్యతో "నువ్వు నాపరువు తీశావు. ఇక యింటికినడు. ఇంతకంటె అవమానం కావాలా ఏమిటి?" అని అన్నాడు. "ఈ అవమానానికి కారకులు మీరుగాని నేనుకాదు." అని అంది. "ఎవరయితేనేమిలే. ఇప్పుడైనా నామాటవిని యికలే" అని అన్నాడు. అప్పుడు సుందరమ్మ వెంకట్రావులు లేచి వెళ్తూంటే అందఱు నవ్వుకొన్నారు.

తర్వాత బండిలో సుందరమ్మను అనేక విధాల

వెంకట్రావు దూషించడం ప్రారంభించాడు. సుందరమ్మ యేమాత్రం జవాబివ్వడంలో తగ్గలేదు. తర్వాత యింటికి చేరుకోవడంతోనే వెంకట్రావు సుందరమ్మని తీవ్రంగా దూషించడం ప్రారంభించాడు. కాని సుందరమ్మ తీవ్రత కూడా తగ్గలేదు. అప్పుడు వెంకట్రావు ఆగ్రహంతో ఎప్పుడు లేనిది సుందరమ్మను తన చేతి బెత్తముతో వాతలుపడేట్టుగా బాదాడు. అప్పుడు సుందరమ్మ, ఏడుస్తూ, కోపంతో "మీరు కొడితే నేనుపడేదాన్ని కాను. మీకిష్టం లేకపోతే నేను రేపు పొద్దున్నే బండియెక్కి మాపుట్టింటికి వెళ్లిపోతా. అప్పుడు మీరూ పేరమ్మ హాయిగా కాపరం చేయండి. నేను మీయిద్దరి ప్రాణాల కుసూరుమంటూ మాపుట్టింట్లోనే పడివుంటాను." అని ఖండితంగా చెప్పింది. ఆమాటలకి వెంకట్రావు మరింత మండిపడి "నోరుముయ్యి" అంటూ ఆబెత్తంతో నోటిమీద కొట్టాడు. ఆదెబ్బలకోర్వలేక సుందరమ్మ క్రిందబడిపోయింది. వెంకట్రావు పడుకొన్నాడు. కాని నిద్రపట్టలేదు. 'ఎప్పు డెప్పుడు తెల్లవారునా, ఎప్పుడు పేరమ్మని చూసి, తనక్షమా పణను తెల్పుతానా' అని అనుకొన్నాడు. అప్పటికతనికి పేరమ్మ జగన్మోహిని అయిపోయింది. పేరమ్మ తన బాహు పంజరంలో చిక్కివున్నట్టుగా తలచుకొని వుప్పొంగి పోయాడు. మళ్లీ పేరమ్మకి తనమీద ఆగ్రహం కలిగిందేమో అని చాలా విచారించాడు. తనపై అలా పేరమ్మ కాగ్రహం కలగడానికి

అసలు మూలకారకురాలైన తన భార్యపైన అతనికి అమితమైన ఆగ్రహం, అసూయ కలిగాయి. భార్య నెలాగైనా వొదిలేద్దామనుకొన్నాడు. ఉదయముననే లేచి, సుందరమ్మ వెళ్తానంటే ఆతక్షణం బండియెక్కించి పుట్టింటికి సాగనంపుదామని నిశ్చయించుకున్నాడు. అలా కాకపోతే కొద్దిరోజులలోనే వెళ్ళేట్టుగా చేయాలని అనుకొన్నాడు.

తాననుకొన్నది ఫలించింది. మరుచటిరోజు ఉదయం సుందరమ్మ పుట్టింటి కెళ్తానంది. అతనికి సంతోషమైంది. "ఓ, మహారాణిలాగ వెళ్ళొచ్చు" అంటూ సామాను సద్దుకోమన్నాడు. "ఆహా, ఎంత దుర్మార్గపు మనసు పెనిమిటి!" అని మనస్సులో చాలా విచారపడింది సుందరమ్మ. తన వుసురు పేరమ్మకెప్పటికైనా తగలకపోతుందా అనుకొంది. ఏమి బదులుచెప్పక తన సామానంతా సద్దుకొని ప్రయాణానికి సిద్ధపడింది. అప్పుడు కాఫిఅన్నా తాగలేదు. అసలు సుందరమ్మ కాఫీ గతప్రాణి అని తెలుసుండీకూడా వెంకట్రావు కాఫీకూడా తాగమనకుండా, బండిని తీసుకొని వచ్చి, సుందరమ్మని యెక్కించి, రైలుచార్జీయిచ్చి, పుట్టింటికి సాగనంపాడు.

* * * *

సుందరమ్మ పుట్టింటికి వెళ్ళిపోయిన సంగతి పేరమ్మకి తెలిసింది. ఇంకేం తనను వెంకట్రావు పూవులతో పూజిస్తా

డనుకొంది. ఇకనుంచి వెంకట్రావుయింటికిగూడా తానే యజమానురాలవుతానని ఉవ్విళ్లూరి పోయింది. అతని సంపాదనగూడా తనకే. ఇకనుంచి తనకి డబ్బుకిగాని, నగలకి గాని, చీరెలకిగాని ఏవిధమైన యిబ్బంది వుండదు. తనకోసరం వెంకట్రావు భార్యనిగూడా వెళ్లగొట్టాడు. ఇకనుంచి అతనితో స్వేచ్ఛగా నాటకాలకి, సినిమాలకి వెళ్లొచ్చు. ఇప్పుడు తానేదికోర్తే అది యివ్వడానికి యిటు తన ఛాందసపు పెనిమిటి. అటు తన నవయౌవన సౌందర్యానికి దాసానుదాసుడై, తనకన్ను సన్నలలో మెలగే వెంకట్రావు. ఇప్పుడే యిద్దఱి వల్ల తనం మహారాణికావొచ్చు. అదృష్టం అంటే అదీ అదృష్టం.

ఇదివఱకంటే ఆరోజు సాయంకాలం పేరమ్మ శృంగార మపారమైపోయింది. అప్పుడు రతీదేవి సాక్షాత్కరించిందా అన్నట్టుగా మున్నాబెంది. అప్పుడు తళ్కుతూ తారుతూం, యజ్ఞనారాయణని ఏదో సాకుమీద పెద్దబజారుకు పంపించి, దొడ్లో సన్నజాజుల చెట్లక్రింద కుర్చీవేసుకొని, ఏదో నవలను చదువుతూ, అప్పుడప్పుడు వెనక్కి తిరిగిచూస్తూ కూర్చొంది.

అప్పుడే వెంకట్రావు ఆఫీసునుంచి వచ్చాడు. ఇంకా ఆఫీసు డ్రస్సు మార్చనేలేదు. పేరమ్మ నెలా చూడడమా అని తహతహలాడ్తూ, ఒకవేళ దొడ్లో వుందేమో అని తన

యింటికి పేరమ్మ యింటికి అడ్డంగా వున్న గోడమెక్కి తొంగి చూశాడు. అప్పుడు రతీదేవిలాగ విలాసంగా కూర్చొని నవలను పఠిస్తూ వున్న పేరమ్మనుచూసి, పట్టలేని సంతోషంతో 'లేతగులాబి' అని కేకవేశాడు. అప్పుడు పేరమ్మ వులిక్కి పడ్డట్టుగా వెనిక్కి తిరిగిచూసింది. అప్పుడు వెంకట్రావుకళ్లు నవ్వుతున్నాయి. పేరమ్మ మొఖం చిట్లించుకొని, దగ్గరకివెళ్లి "చాలు, చాలు, మీసరసాలు. మీభార్యచేత నన్నలా అవమానపరచడం చాలక, యింకా తమరుకూడా నన్ను అవమానపరుద్దామనుకొంటున్నారేవిటి? మొదట నాబుద్ధి గడ్డితిని, నేనానాడు ఆసిచాసికి, క్షణసౌఖ్యానికి, వెర్రిదాన్నై కళ్లుగానక పాటుపడ్డాను. కాబట్టి నన్నుక్షమించండి, నాగుట్టును రట్టుచేయకండి. మీరు నాకు బాగాబుద్ధి చెప్పారు. మీకాళ్లు పట్టుకొంటాను నాసంగతి యెవరితోను చెప్పవొద్దు." అని, తనపరువు పోయినందుకు విచారపడుతూన్నట్టుగాను, ముందు అతనితో అలా సరసానికి దిగడం తప్పుపని చేసినట్టుగాను, దానికొఱకై తాను పశ్చాత్తాప పడుతూన్నట్టుగాను, తనగుట్టును అతడు బయట పెడ్తాడేమో అని భయపడ్డట్టుగాను ఇంకా యీవిధాలైన అనేక భావాల్ని అప్పుడు వెంకట్రావుకితోప జేసింది. ఆమాటలువిని వెంకట్రావుకు ఎక్కడలేని విచారం కలిగింది. అప్పుడు పేరమ్మపైన తనకిదివరకు వుండే మోహా

ముద్వేగుణీకృతమైపోయింది. ఆతనికి పేరమ్మపైన అపరిమితమైన జాలివేసింది. అప్పుడు పేరమ్మకోసరం తనప్రాణం యిచ్చేద్దామనేటంతటి ఆవేశం పుట్టిందతనికి. తన ఆవేశాన్ని పేరమ్మకు మాటల్లో చెప్పలేకపోయాడు. తన కన్నీళ్లతోనే ఆమెను అలా కొంతసేపటివఱకు చూశాడు.

"గులాబీ, నావిషయంలో నువ్వలా అనడం భావ్యం కాదు. నీయందు నాకుండే ప్రేమని పరీక్షించాలనివుంటే నీవేది చేయమంటే అది చేయడానికి సిద్ధంగావున్నాను. అంతకంటే నేనేమి నీతో చెప్పలేకుండా వున్నాను. నీకోసరం నాభార్యని పుట్టింటికి తరిమివేశాను. ఇప్పుడు నువ్వే నారాణివి; నేను నీసేవకుడను. నేను నీయాజ్ఞలకంతటికి బద్ధుడనై వుంటాను. నాయిల్లు, నాసర్వస్వం నీయధీనం చేస్తాను. ఇంతకంటే నేనేం చెప్పలేను."

"ఉస్, వూరుకోండి. నామొగుడు ముండాకొడుకు వింటాడు."

"ధన్యోస్మి"

"రాత్రి పదిగంటలకి"

"నేనిక్కడే కాచుకొని వుంటాను."

"అంత రాత్రివేళా? పురుగు పుట్రా వుండదూ?"

"అవినన్నేం చేస్తాయ్?

"సరిలెండి. ఇక వెళ్లండి."

"ఏదీ, అడ్వాన్సు?"

"అబ్బా, ఏవిటీతొందర?

"నీయిష్టం"

"ఊఁ"

*  *  *  *

పేరమ్మ వెంకట్రావులు నిరాఘాటంగా రతీమన్మథుల్లాగ నిర్మలానందాన్ని అనుభవిస్తున్నారు. వెంకట్రావు ఒకనెల ప్రివిలెజ్ లీవ్ తీసుకొన్నాడు. ఆపయిని అర్ధజీతంపైన మాసంరోజులు సెలవు తీసుకొన్నాడు. మొత్తం రెండు మాసాలు పేరమ్మకోసరం సెలవు తీసుకున్నాడు. కాని అబ్బాయిగారిక్కి అప్పుడే తల తిరుగుతోంది. పేరమ్మ కోర్కెలు చెల్లించలేక పోతున్నాడు. పాపం యెక్కడినుంచి తెస్తాడు. నలభై రూపాయల జీతగాడితడు. పేరమ్మ లక్షాధికారి భార్యలాగ డబ్బును ఖర్చుపెట్టుతోంది. పేరమ్మతో సరీగా తులతూగ లేకపోయాడు. ఆఖరికి వ్యర్థపు వాగ్దత్తాలు, "ఇదుగో రేపు, ఇదిగో మాపు" అనడాలు మొదలుపెట్టాడు. అప్పుడే పేరమ్మకి ఆతనిమీద విరక్తి ప్రారంభమౌతోంది.

ఈవిషయంలో పేరమ్మ భిన్నరుచులుగలది. ఎప్పుడూ ఒకే కూరతింటే యేంరుచి?" అనేరకం. అందులోను అతనిదగ్గిర డబ్బుగూడా లేకపోయింది. ప్రతిరోజూ వచ్చే పేరమ్మ రెండు మూడు రోజుల కొకొక్కసారి రావడం ప్రారంభించింది. తర్వాత వారంరోజుల కొక్కసారి వచ్చి, ఏదో సాకుచెప్పి వెళ్లిపోతూ వుండేది. ఆఖరికి ఆతన్ని కసరుకోవడాలు, ధుమధుమలు, దూషింపులు సాగాయి. అవి అన్ని వెంకట్రావుకి చాలా విచారం కలుగజేశాయి. పేరమ్మ తననలా మోసపుచ్చుతుందని కలలోగూడా తలపలేదు. తనకులాగనే పేరమ్మకి తనపైన గాఢమగు ప్రేమవుందని భావించాడు. కాని యిప్పుడిప్పుడే ఆతని కళ్లు పొరలు వీడాయి. ఇప్పటికి పేరమ్మకు ప్రేమఅనేది లేదని భావించాడు. పేరమ్మ యెక్కువగా షోకులికి, డబ్బుకి ఆశపడేదని తెలుసుకొన్నాడు. పేరమ్మ తనని వొదిలేస్తుందేమో అని అనుమానపడ్డాడు. కాని పేరమ్మజుట్టు తనచేతిలో వుందికదా అని సంతుష్టిపడ్డాడు. పేరమ్మ తనని వొదిలేస్తే, పేరమ్మ సంగతి ఊరంతా చాటి వేయువొచ్చనుకున్నాడు.

అలా పేరమ్మ వెంకట్రావులు రహస్యంగా యజ్ఞనారాయణ కంట్లో దుమ్ముకొట్టి స్వేచ్ఛా విహారం సాగిస్తున్నారు. కాని ఎన్నాళ్లని దాగుతారు. ఒకరోజు

రాత్రి పదిగంటలకి యజ్ఞనారాయణ అల్పాచమానానికని దొడ్లోకివొచ్చాడు. అప్పుడు పేరమ్మని లాంతరుపట్టుకొని వెంకట్రావు గోడదూకిస్తూ వుండడంచూసి నిలువున కొయ్య అయిపోయాడు. మర్నాడు పేరమ్మని పిలిచి, "రాత్రి ఎక్కడి కెళ్లావు?" అని అడిగాడు. అప్పుడతనికి కోపోద్రేకం తాండవిస్తూవుంది. అసలు సహజంగా యజ్ఞనారాయణ అమాయికుడు, మేధకుడు. అటువంటివాడికి కోపం వొచ్చిందంటే చాలా ప్రమాదం జరుగుతుందనుకొని, వెంటనే పేరమ్మ వెనక్కి తిరిగి రివ్వుమని వెంకట్రావు యింటికి వెళ్లింది. వెంకట్రావుకి సమాచారం చెప్పింది. అప్పుడు వెంకట్రావు వీరావేశంతో అర్జునుడు గయుడికి అభయహస్తం యిచ్చినట్టుగా పేరమ్మకి అభయం యిచ్చి, తగిన ఫకడబందిలో వున్నాడు. కాని యజ్ఞనారాయణమాత్రం పేరమ్మకోసరం వెంకట్రావు యింటికి వెళ్లలేదు. పేరమ్మకి తనకి నాటితో సరి అనుకొన్నాడు. ఇక పేరమ్మ తనపెళ్లాంకాదు అనుకొన్నాడు. ఇంచుమించుగా చచ్చినట్టుగా భావించాడు. ఇంటికివొస్తే కాళ్లు విరగగొడ్తాననుకొన్నాడు. పేరమ్మగూడా యజ్ఞనార్యాయణ గడప త్రొక్కనంది. అతనికి తనకి నాటితో ఋణం చెల్లిపోయినట్టుగానే భావించింది. ఇకనుంచి వెంకట్రావు దగ్గిరనే వుంటానంది. ఆలాగే అప్పటినుంచి

వెంకట్రావుతోనే వుంది. వెంకట్రావు ఆనందానికి మితిలేదు! తనదగ్గిర పేరమ్మ వుండడం కొండందుకున్నట్లయింది. వీళ్లిద్దఱి సంగతి ఊరంతా ప్రాకింది. కాని వాళ్లేం దానిని లక్ష్యపెట్టలేదు. నిండా మునిగినవాళ్లకి చలియేమిటి!

పేరమ్మకి మాత్రం వెంకట్రావుతో వుండడం అంత యిష్టంలేక పోయింది. అతడు తనకోర్కెలను దేనిని సఫలీకృతం చేయుడంలేదు. మాట్లాడితే డబ్బులేదనడం ప్రారంభించాడు. పేరమ్మకి యితనికన్న యజ్ఞనారాయణే మంచి వాడనిపించాడు. "ఎరక్కపోయి, అన్యాయంగా వీడిదగ్గిఱ చిక్కుపడిపోయానే" అని చాలా విచారించింది. పైకిమాత్రం వెంకట్రావుమీద ప్రేమవున్నట్టుగానే సంచరించింది. వెంకట్రావు పేరమ్మని పూర్తిగా నమ్మాడు. పేరమ్మ రోజుకు రోజు, వెంకట్రావు దగ్గరనుంచి యెలా తప్పించుకోవడమా అని పరితపించి పోతోంది.

* * * *

ఒకరోజు సురభికంపెనివాళ్ల నాటకం. "స్త్రీసాహసము" అనే నాటకాన్ని ప్రదర్శిస్తారని ప్రకటింపబడినది. ఆప్రకటనలో స్త్రీలు, స్త్రీపాత్రల్ని, పురుషులు పురుషపాత్రల్ని ధరిస్తారనికూడా ప్రకటింపబడినది. ఆప్రదర్శనానికి స్త్రీ

పురుషులు చాలామంది వెళ్తున్నారు. అందులో పేరమ్మ వెంకట్రావులు ప్రథములు. వెంకట్రావు తనకి చేర్ టికెట్టు తీసుకొన్నాడు. పేరమ్మకి ఎనిమిదణాల టికెట్టును తీసికొన్నాడు. అది పేరమ్మకి చాలా చిన్నతనం అయింది. కాని వెంకట్రావేం చేస్తాడు? అవి నెలాఖరుదినాలు. చేతిలో ఒకపైసాలేదు. అదైనా ఎక్కడో అప్పుతీసుకొచ్చాడు. పేరమ్మగూడా ఏం మాట్లాడలేదు. ఆఅర్ధరూపాయ టికెట్టును తీసికొని ఆడవాళ్లల్లో కూర్చొంది. వెంకట్రావు కుర్చీమీద కూర్చొన్నాడు.

ఆటప్రారంభమైంది. అందులో ముఖ్య స్త్రీపాత్రను ధరించిన రామాబాయి, చక్కగాపాడి, అభినయించి సభ్యుల నందఱిని ఆనందంలో వూపిపారేసింది. సభ్యులందఱు రామాబాయిని అనేకవిధాలుగ పొగడారు. కొందఱు కొంతడబ్బును కూడా విసిరారు. ఆట అద్భుతంగా వుంది. ప్రతివాళ్ల నోటివెంబడి రామాబాయి నామమే స్మరింపబడుతోంది.

ఆట ఆఖరైంది. జనం చప్పట్లు గొట్టుతూ "భేష్, రామాబాయీ, భేష్" అన్నారు. అప్పుడొక మునిసిపల్ కౌన్సిలరు స్టేజిమీదికెక్కి యీక్రింది విధంగా ప్రసంగించాడు:-

"సోదర సోదరీ మణులారా!

నేను మనపురమున యీసురభి కంపెనివారు వచ్చి "స్త్రీ సాహసము"ను జయప్రదముగ ప్రదర్శించినందులకు వారికి మీతరపున నాకృతజ్ఞతాభివందనముల నిడుచుంటిని. నేటి ప్రదర్శనములో అందరికంటే రామాబాయిగారి అభినయం అత్యద్భుతముగా నున్నది. కాబట్టి ఆమెకు నేనీ బంగారు పతకమును బహుమతి యొసంగుచున్నాను. ఈ రామాబాయిగారికివలెనే, మన దేశమునందలి విద్యాధికురాండ్రగు స్త్రీలు, నాటక ప్రదర్శనములలో బాల్గొని, నాటక కళ నభివృద్ధి పఱచుచు, ఆంధ్ర నాట్యరంగమునకు ప్రపంచమంతటను గొప్పకీర్తిని గడింతురుగాక యని యాశించుచుంటిని."

ఉపన్యాసము ముగియగనే ఎవరియిళ్లకు వాళ్లు పోయారు. పేరమ్మ వెంకట్రావులుగూడా యింటికివొచ్చారు. వెంకట్రావు పేరమ్మనిచూసి "గులాబీ, నాటకం ఎలావుంది చెప్పు" అని అడిగాడు. అప్పుడు పేరమ్మలేని సంతోషాన్ని తెచ్చిపెట్టుకొని" చాలా బాగుంది. అందులో రామాబాయి అద్భుతంగా ఆక్టుచేసింది." అని అంది. దానికి వెంకట్రావు మళ్లీ అదేమిచేసింది, దాని మొఖం. ఆపాత్రనే నువ్వుగనుక ధరిస్తే అంతకు వేయిరెట్లు చాకచక్యం చూపించేదానవు

కాదూ?" అని అన్నాడు. ఆమాటకి పేరమ్మ సంతోషంతో ఉప్పొంగి పోయింది. నిజంగా ఆపాత్రని తానే ధరించినట్టు, అందరూ తననే మెచ్చుకొని, కాసులు విసిరినట్లూ, ఎన్నో బంగారు పతకాలు బహుమతి యిచ్చినట్లు, తనకి జనంఅంతా బ్రహ్మరథం పట్టినట్టుగా భావించింది.

"ఏవిటీ ఆలోచిస్తున్నావ్?" అని వెంకట్రావడిగాడు.

"ఏమీ లేదు. నిద్రవొస్తుంది." అని పేరమ్మ జవాబు చెప్పింది. అప్పుడిద్దరూ పండుకొన్నారు. వెంకట్రావు గుర్రుపెట్టి బాగా నిద్రపోతున్నాడు. పేరమ్మకి నిద్రా భద్రా లేదు. ఆసురభికంపెని ధ్యానమే. తాను నిజంగా ఆసురభి కంపెనిలో చేరితే యెలావుంటుందో అనుకొని ఉవ్విళ్లూరి పోయింది. ఆరాత్రి అల్లా తాను సురభికంపెనిలో జేరినట్లు, అద్భుతమైన యాక్ట్రెస్ అయి అందరిచేత మెప్పులుపొంది, అనేక బంగారు మెడల్సు సంపాదించి, అందరిచేతను పొగడ బడుతున్నట్టుగా కలకన్నది. మర్నాడు తెల్లవారింది. వెంకట రావు మామూలుగా లేచి పేరమ్మను తట్టిలేపాడు. పేరమ్మ ఉలిక్కిపడి లేచి, తననలా లేపినందులకతనిపైన చాలా విసుగు కొంది. తర్వాత వాళ్లిద్దరూ మామూలుగా కాలకృత్యాలన్నీ తీర్చుకొన్నారు. పిమ్మట పదిగంటలకి భోజనంచేసి వెంకట రావు మామూలుగా ఆఫీసుకు వెళ్లాడు. ఆ ఫీసు లో

కూర్చొన్నంత సేపు వెంకట్రావెప్పుడెప్పుడు సాయంకాల మౌతుందా అని అనుకొనేవాడు. అయిదుగంటలయింది. ఆఫీసునుండి యింటికివచ్చి "రోజ్" అని పిలిచాడు. కాని యింట్లోనుంచి జవాబులేదు. నిద్రపోతుందేమో అని తలుపు గుద్దాడు. కాని జవాబులేదు. తర్వాత గోడదూకి దొడ్డి దారినే వెళ్లాడు. దొడ్డి తలుపు తాళంవేసివుంది. ఆతడలాగే కొయ్య అయిపోయాడు. పేరమ్మ ఎక్కడికో పలాయన మంత్రం పఠించింది.

* * * *

"అబ్బే, యిక లాభంలేదు. రామాబాయి, లలితా బాయిముందు ఎందుకు పనికిరాకుండా పోయింది. లలితా బాయి గాత్రం, అభినయం, అందం, అబ్బా, ఏమనిచెప్పను. ఈరాత్రి వేషంవేసిందంటే ఎటువంటి మహారాజైనా తెల్లవారి దానియింటిముందు దాసుడు కావలసిందే. అటువంటి విగ్రహం లలితాబాయిది. స్టేజిమీదికి వొచ్చిందంటే సాక్షాత్కరించిన రతీదేవిలాగున వుంటుంది."

అని లలితాబాయి (పేరుమార్చుకొన్న పేరమ్మ)ని పొగడడం ప్రారంభించారు. లలితాబాయి లెక్కలేనన్ని సువర్ణ పతకాలు బహుమతి పొందింది. ఆరీతిగా లలితాబాయి ప్రభ ఒక అయిదేళ్లు ఏకధ్వజంగా వెలింగింది.

తర్వాత లలితాబాయికి గర్వం ఎక్కింది. వ్యభిచారం జాస్తిఅయింది. సుఖరోగాలు హెచ్చాయి. త్రాగుడుకూడా అలవాటుపడింది. "పాపం; ఎంతచక్కని విగ్రహం ఎలా పాడైపోయింది. వెధవ నాటకాల్లో చేరిన వాళ్లెవళ్లు బాగు పడ్డారు." అని జనం అనుకుంటున్నారు.

లలితాబాయికి పెద్ద జబ్బుచేసింది. లక్షలు లక్షలు గడించిన లలితాబాయికి నేడు మందుకి డబ్బులేక పోయింది. అంతా త్రాగుడిక్రింద పాడుచేసుకొంది. ఆజబ్బులో తన యిష్టం వొచ్చిందల్లా తిన్నది. రెండుకాళ్లు పడిపోయినాయి. పాపం; లలితాబాయి ఆఖరికి రెండుకాళ్లు లేనిదిఅయి రోడ్ల వెంబడి ప్రాకుకొంటూ దమ్మిడీ, దమ్మిడీ అడుగుకొని తినవలసి వొచ్చింది. ఇంతకి దైవసంఘటనం అలావుంది.

లలితాబాయి తనదుస్థితికి తానే కారకురాలని హెూరుమని యేడ్చింది. తనను తానెంతో నిందించుకొంది. తనం చాలాద్రోహి, పాపి, పాపఫలం అనుభవిస్తున్నా నను కొంది. ఆబ్రతుకు బ్రతకడంకంటే ఏనూతులోనన్నా పడి ఆత్మహత్య చేసుకుందామనుకుందిగాని, తానెవరినో చూడాలె నని ఆశపడింది.

వెంటనే టికట్లకలెక్టర్లని బ్రతిమాలుకొని రైలెక్కి బెజవాడవొచ్చింది. తర్వాత గవర్నరుపేటకువొచ్చి ఒక

యింటిముందు కూచొని తలుపుతట్టింది. లోపలినుండి గృహ యజమాని "ఎవరువారు?" అని అన్నాడు. లలితాబాయి, మాట్లాడకుండా మళ్లీ తలుపు గట్టిగాతట్టింది. అప్పుడు తలుపు తీశాడాయజమాని

"ఇదేవిటి! ఆఁ"

"నాపాప ఫలం"

"మళ్లీ నాదగ్గరకెందుకొచ్చావు!"

"మీాదాసిగా వుండడానికి"

"ఆహా నీకెంతగతి పట్టింది."

లలితాబాయి దుఃఖమే తానై మాట్లాడలేక, ఆగృహ యజమాని పాదాలమీాద వాలింది. అప్పుడు గృహయజ మానికి కళ్లవెంబడి నీళ్లు గిర్రున తిరిగాయి. ఒక్కసారి, లలితాబాయిని లేవనెత్తుకొని గట్టిగా కావులించుకొన్నాడు.

పాపం; పేరమ్మ పాపఫలంవల్ల రెండుకాళ్లు పోయినాయి. అయినప్పటికి యజ్ఞనారాయణ ఆమె నతిప్రేమగా చూడడం ప్రారంభించాడు.

నూతనగ్రంథము ! నూతనగ్రంథము !!

# గృహస్థాశ్రమ రహస్యములు

కాలమునకు తగిన గ్రంథము ! నాయికానాయకులు కోరు నట్టి గ్రంథము ! రహస్యములను వెలిబుచ్చు గ్రంథము ! అత్యావశ్యకమగు గ్రంథము ! మీరుబహుకాలముగ వాంఛించు రహస్య గ్రంథము ఇప్పుడే ప్రచురింపంబడినది.

230 పుటలు కొ్రవగల గొప్ప గ్రంథము.



ప్రతి అట్ట. వెల రూ. 1-8-0.

—♦( రెండవ కూర్పు )♦—

అందమగు ఆఫ్‌టోన్ పటములతో ముద్రింపబడిన విచిత్రగ్రంథము. రమ్యముగా బైండు చేయబడినది.

---

వావిళ్ల ముద్రాక్షరశాల. 244 టంకశాల వీధి. మదరాసు.

కొక్కోకాచార్యుని మతానుసారముగా తయారుచేయబడిన

# చింతామణి లేహ్యము

## అయస్కాంత సింధూరమున్ను.

ఈ ప్రఖ్యాతిగాంచిన ఔషధమున 196 విధములగు అవుషధ ద్రవ్యములున్ను విత్తనములున్ను, యూనాని ఔషధ ద్రవ్యములగు సాలమిస్రి, అంబరు, చారపప్పు, పిస్తా, బాదం, అక్రూట్, జల్ కూజామున్నగు పప్పులున్ను మలబారు దేశపు మూలికల సంజీవివంటి సత్త్వములున్ను చేర్చి మిక్కి శ్రద్ధతో చేయబడినది. మరియు ఆవునెయ్యి, ఆవుపాలు, ప్రశస్తమైన తేనె మున్నగువాటిని చేర్చి పాకవిధినతిక్రమించక చేయించియున్నాము. మందు సేవించునప్పుడెట్టి యాహారనియమమున్ను లేదు. శీఘ్రస్ఖలనము, ముసలితనము, బలహీనత, జ్ఞాపకశక్తి లేకుండుట, భయము, అధైర్యము ఇంకను మేహ సంబంధమైన గుల్మము, ఉదరశూల, అంత్రవృద్ధి, వరిబీజము, పక్షవాతము చచ్చువాతము, మున్నగునవి ఝంఝామారుతమును చూచిన మేఘములవలె పలాయమవును. ఒక మండలమునకు సరిపోవు లేహ్యమును సింధూరమున్ను చేరి సెట్టు 1 కి రూ 5—0—0

---

ఆశ్చర్యమైనది! ఘంటసేపులో గుణమును తెలుపునట్టిది!!

# మన్మథ స్తంభన మాత్రలు.

## గుణములేదని నిరూపించువారికి రూ. 100 లు ఇచ్చెదము.

అతిశీఘ్రములో స్ఖలితమైపోవు స్వభావము గలపురుషులు వీటిని పుచ్చుకొన్నపిదప ప్రవర్తించి చూచినచో మహత్తైన సుఖానందమును పొందగలరు. అనుభవించి చూచినవారికే దీని తత్త్వము తెలియును. ఈ మాత్రలను డైరెక్షనులో చెప్పినమేరకు 10 రోజులు సేవించిరేని పురుష సింహమువలె బలము, గులాబిపువ్వువంటి ముఖ కాంతియు, వర్చస్సున్ను, ధైర్యమున్ను కలుగును. దీనివంటిది వేరొందును లేదు. గ్యారింటీగా నుండెదము. ఉపయోగించు విధము మందుతోకూడా పంపబడును.

వెంటనే వ్రాయుడు. డబ్బి 1 కిరూ. 2

---

శ్రీధ[illegible] అండు కం[illegible], తపాలపెట్టె 119, మద్ర

